# శ్రీవిద్యా మహాయంత్రము

## శ్రీచక్ర విశేషవ్యాఖ్య, పూజా విధానము




సువర్ణఘంటాకంకణ, శ్రీవిద్యారత్నాకర, శ్రీ విద్యావిశారద

**శ్రీ క్రోవి పార్థసారథి**

# శ్రీవిద్యా మహాయంత్రము

(శ్రీచక్రానికి విశేష వ్యాఖ్య, పూజా విధానము)

గ్రంథకర్త :
సువర్ణఘంటాకంకణ
శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద
శ్రీ క్రోవి పార్థసారథి

ప్రకాశకులు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం,
విజయవాడ - 520 013. ఫోన్ : 522824

# శ్రీవిద్యా మహాయంత్రము

*గ్రంథకర్త :*

**శ్రీ క్రోవి పార్థసారథి**

23-11/1-10/2, దేవీ నిలయం,
ఓగిరాలవారి వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.
ఫోన్ : 530672



---

**వెల : రూ. 80-00**

---

ప్రకాశకులు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం
కృష్ణలంక, విజయవాడ - 520 013.
ఫోన్ : 522824

*కవర్ డిజైన్ : పి. రాము*

*ముద్రణ :*

**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

గాంధీ నగర్ విజయవాడ - 3.
ఫోన్ : 574828

# ప్రణతులు

"శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరి" శ్రీచక్రాన్ని గురించి వివరిస్తూ పరమేశ్వరితో పరమేశ్వరుడు అన్న మాటలివి. ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రము అనేది సామాన్యమైనది కాదు. ఈ చరాచర జగత్తుకూ ప్రతీక. సృష్టిలోని ప్రతి వస్తువూ శ్రీచక్రంలో ఉన్నది. పంచభూతాలు, తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, మొదలైన తత్త్వాలన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. అందుకే శ్రీచక్రాన్ని పూజిస్తే చరాచరజగత్తునంతటనూ పూజించినట్లే. విశ్వమానవాళినంతటినీ అర్చించినట్లే. అందుకే శ్రీచక్రము అంత గొప్పది అని చెప్పబడుతోంది.

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ తన భక్తులను రక్షించాలనే తలంపుతో ఒక ఆకారం ధరించాడు. ఆ ఆకారమే పరమేశ్వరి. ఆమె యొక్క యంత్ర రూపమే శ్రీచక్రము.

శ్రీచక్ర స్వరూపము, శ్రీచక్రావతరణము, శ్రీచక్రంలో కోణాలు, సంధులు, మర్మస్థానాలు, బీజాక్షరాలు, శివశక్తిచక్రాలు, వృత్తాలు, తత్త్వములు, ముద్రాశక్తులు, ప్రస్తారములు, బిందువు, నవావరణలు మొదలైన అనేక విషయాలను ఇందులో చర్చించటం జరిగింది. శ్రీచక్రము, పంచదశీ మహామంత్రము రెండూ వేరు కాదు. అసలు పంచదశీ మహామంత్రంనుంచే శ్రీచక్రము పుట్టింది. కాబట్టి యంత్రము, మంత్రము, పరదేవత మూడూ ఒక్కటే.

శ్రీచక్రాన్ని పూజించాలనే కోరిక ఉన్నప్పటికీ అనేక మందికి అనేక రకాలయిన భయాలున్నాయి. అర్చనా విధానము చాలా క్లిష్టమైనది అనే సంకోచమున్నది. అందుచేతనే అందరికీ అందుబాటులో ఉండే విధంగా 'నిత్యార్చనా విధానము' ఇవ్వబడింది. సాధకుల సౌలభ్యం కోసం శ్రీసూక్త పురుష సూక్త విధానంతో నవావరణార్చన కూడా ఇవ్వబడింది.

ఐహిక వాంఛలున్నవారు శ్రీచక్రాన్ని ప్రత్యేకంగా పూజించాలి. దీన్ని బాహ్య పూజ అంటారు. కాని మోక్షగాములు అంతరారాధన మాత్రమే చెయ్యాలి. అది కూడా భావనోపనిషత్తులో చెప్పిన విధంగా. భావనోపనిషత్తులో అంతర్యాగము ఏ విధంగా చెప్పబడింది ?

ఇలాంటి అనేక విషయాలను ఈ గ్రంథంలో కూలంకుషంగా వివరించటం జరిగింది. దేవీ ఉపాసనా పరులంతా చదివి తీరవలసిన గ్రంథమిది.

శ్రీచక్రాన్ని గనక అర్చించినట్లైతే సాధకుడి యొక్క కోరికలన్నీ తీరతాయి. కాబట్టి శ్రీచక్రాన్ని గురించి సామాన్యుడికి కూడా అర్థం కావాలనే తలంపుతో ఈ గ్రంథం వ్రాయటం జరిగింది.

ఈ గ్రంథ రచనలో నాకు అన్ని విధాలా సహకరించిన నా భార్య రమాదేవికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమునకు శ్రీముఖములు పంపిన పీఠాధిపతులందరకూ నా పాదాభివందనములు తెలుపుకుంటున్నాను.

పండితులు నాయీ సాహసాన్ని మన్నిస్తారని, దేవీ భక్తులు, సాధకులు అందరూ ఈ గ్రంథాన్ని ఆదరిస్తారనీ ఆశిస్తూ ........

ప్రమాథినామ సంవత్సర
మార్గశిర శుద్ధ పంచమి
13-12-1999

బుధజన విధేయుడు
**క్రోవి పార్థసారథి**



Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU
**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**
Sri Siddheswari Peetadhipati
Courtallam - 627 802
(Via) Tenkasi - Tirunelveli Dist. ----- South India
With Narayanasmritis

# అభినందన

5-5-1997

దేవీ పూజలో కౌళ, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు.
భిన్న సంప్రదాయములలో పంచదశీమహామంత్రము, షట్చక్రభేదన-
దేవి సాక్షాత్కారము. మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యేరీతిలో
శ్రీ క్రోవి పార్థ సారథిగారు వ్రాసిన

## “శ్రీ విద్యాదర్శనము”

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## “ శ్రీ విద్యారత్నాకర”

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః



13-12-99న "శ్రీవిద్యా మహాయంత్రము" గ్రంథావిష్కరణ చేస్తున్న పరమహంస పరివ్రాజకచార్య
శ్రీశ్రీశ్రీ శివ కళ్యానానంద భారతీ మహాస్వామి, శ్రీ శృంగేరి విరూపాక్షపీఠం, గుంటూరు.

Phone : 823332

SRI SRI SRI SWAMY SWAROOPANANDENDRA SARASWATI

(Peetadhipathi)



# SRI SARADA PEETHAM

C/o. ADISANKARA TRUST (Regd. 74/97)

Upanishad Vihar, Sramshakthi Nagar

Chinnamushidivada, Pendurti-531 173, Visakhapatnam. (A.P.)

---

ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మజ్ఞానాన్ని ప్రభావించేది శ్రీవిద్య. అద్వైత భావనను పెంపొందించేది, మోక్షమును ప్రసాదించేది శ్రీవిద్య. శివశివాశక్తుల కలయిక రూపమే శ్రీచక్రము. విశ్వమంతటినీ చైతన్యపరిచే ఆపరాశక్తిరూపమే శ్రీచక్రము. కార్యసాధనకు శక్తి కావాలి కావున గృహస్తులకు తమకార్యసిద్ధికి శ్రీచక్రార్చన అనుసరణీయము. అంతర్యాగముతో కూడిన శ్రీచక్రార్చన మోక్షమును ప్రసాదిస్తుంది. ఆచార పూజా భేధాలున్నందు వల్ల గురు సాంప్రదాయాన్ని అనుసరించేలా వివరణాత్మకంగా చిరంజీవులు శ్రీ క్రోవి పార్థసారధిగారు "శ్రీవిద్యా మహా యంత్రము" అను గ్రంథమును ప్రచురించుట సంతోషము. సాధకుల అర్హతలను, వివిధ ప్రస్తారములను, వాటి నిర్మాణమును, ముద్రాశక్తులను, మహన్యాసమును, నవావరణ దేవతలను, చతుష్షష్టి యోగినులను, నిత్యదేవతలను వివరిస్తూ అర్ధవంతంగా రచన సులభశైలిలో సాగింది. సామాన్యులు కూడా ఆచరించేలా, శ్రీచక్రార్చన శ్రీసూక్త, పురుషసూక్త సహితంగా నవావరణ పూజావిధానమును తెలియజేయుట శ్రీవిద్యా ప్రచారానికి దోహదం చేస్తుంది. అయితే శ్రీవిద్య సద్గురువు నాశ్రయించే గురుముఖఃతా నేర్చుకోవలసిన విద్య. పుస్తకపఠనంతో అర్చన అనుసరించదగిందికాదు. ఈ పుస్తకం శ్రీవిద్యను సంపూర్ణంగా అర్థంచేసుకొనుటకు ఉపయుక్తం. సంకేతత్రయా జ్ఞానంతో శ్రీచక్రార్చన చేస్తే అనంతమైన ఫలం లాభించుట ఖాయం. ఆ ఫలం అలౌకికము.

చిరంజీవులు శ్రీ క్రోవి పార్థసారథిగారికి వారి కుటుంబమునకు శ్రీశారదామాత సకలాయురారోగ్య జ్ఞానైశ్వర్యాలను అనుగ్రహించి పరిరక్షించుచుండాలని ఆశీర్వదిస్తూ.....

శారదాపీఠం
ఉపనిషత్ విహార్, శ్రమశక్తి నగర్
చినముషిడివాడ, విశాఖపట్టణం.

నారాయణ స్మృతులతో
శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజిక

---



Phone: 22707 (04633)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

SRI SIDDHESWARI PEETADHIPATI

**COURTALLAM - 627 802**

(Via) Tenkasi — Tirunelveli Dist. — South India.

With Narayanasmritis

Date : ౨౩.౧౧.౯౯

## శ్రీముఖం

చిరంజీవి క్రోవి పార్థసారథిని చిరాయువుగా దీవించి నారాయణ స్మరణలతో వ్రాయునది. మీరు 'శ్రీవిద్యా మహా యంత్రము' అనుపేర శ్రీచక్రానికి వ్రాసిన వ్యాఖ్య పరిశీలించినాము. ఇది మీరు 'శ్రీచక్రము' పై పూర్తి అవగాహన కలిగిన అనంతరమే వివిధ గ్రధ పరిశీలనానంతరము స్వతంత్ర వ్యాఖ్యతో వ్రాసినందున ఒక ప్రామాణికత సంతరించుకొన్నది. ముఖ్యముగా 'వృత్తత్రయము'ను గూర్చి ప్రధానమైన రెండు భిన్న సాంప్రదాయముల విషయమై మీ వివరణ శ్లాఘ్యము. చదువరులు వారివారి గురు సాంప్రదాయమును బట్టి ఆయా శ్రీచక్రములను పూజించుకొనవలసినదిగా మీరు సూచించియున్నారు. ఈ గ్రంథములో, శ్రీవిద్యా మహాయంత్రములో ఎన్ని ఎన్ని స్థానములు, ఏ ఏ నామములతో గుర్తింప సాధ్యమో అన్నింటిని పరిపూర్ణముగా వివరించియున్నారు. మీ రచన సమగ్రమైనది. శ్రీచక్రార్చన విధానమును కూడా చక్కగా తెలియపరచియున్నారు. ఇంక ఒక్కటే మీవల్ల జరగవలసియున్నదని భావించుచున్నాను. అది ఏమన శ్రీశంకరాచార్య స్థాపితమైన నాల్గు పీఠములలోను, కంచి కామకోటి పీఠములోను గల సనాతనమైన శ్రీచక్రములన్నింటిని గురువుల అనుమతితో పరిశీలించి వృత్తత్రయము యొక్క ఉనికి, షోడశ దళములు, భూపురముల మధ్యనే యున్నట్లు, తత్ భిన్నముగా వున్నట్లయినచో యథా తథముగా ప్రచురించగలరు.

మరిన్ని శృంగేరీపీఠం పూర్వముకప్పుడు రక్షణలుప్తమై, మరి ఇతర కారణముల చేతను హంపీ విజయనగరమునకు తరలింపబడినట్లు, అచ్చట నుంచే కొన్నిశాఖలై భారత దేశములో విస్తరించి మాది అవిచ్ఛిన్నమని మాది అవిచ్ఛిన్నమని కొన్ని పీఠములు ప్రకటించుచున్నవి. మీ రచనలో శ్రీపుష్పగిరి పీఠమునందు ఈ అష్టదళములు, షోడశదళముల కొనలు అర్ధవృత్తముగా పైకిలేచినట్లు వ్రాసియున్నారు. వానిలో నిజానిజములు నిమిత్తము లేకుండా ఆయా పీఠములలో గల శ్రీచక్రములను పరిశీలించి విశదీకరించగలరు.

వృత్తత్రయము యొక్క ఉనికిని గూర్చి అధిక్షేపించువారలు శ్రీచక్ర నిర్మాణమునకు సంబంధించిన అన్ని వివరణ శ్లోకములలోను అష్టదళము, షోడశదళము అని నిర్ద్వంద్వముగా ప్రకటించినప్పటికీ కొన్ని శ్రీచక్రములలో దళములను స్థూపాకారముగా (Cylyndrical) నిర్మాణము చేయుట ఇటీవల బహుళ ప్రచారముగా ఉన్నది. ఇది సౌలభ్యముకొరకు ప్రవేశపెట్టినారా? అని మీరే పరిశీలించి అధికారముగా ప్రకటించగలరు. దీనితో శ్రీవిద్యోపాసకుల మధ్య గల చర్చకు తుదిపరిష్కారముకాగలదు. మరిన్నీ చాల చరిత్రకందని పురాణకాలమునుండి పూజింపబడుచున్న శ్రీచక్రములు కాశ్మీరు నుండి కుర్తాళము వరకు కలవు. కుర్తాళము అగస్త్య క్షేత్రమని పురాణ ప్రసిద్ధి. అగస్త్య ప్రతిష్ఠ అయిన త్రికూటాచలేశ్వర దేవాలయములో లోపాముద్రార్చితయైన శ్రీచక్రము ఇప్పటికిని చెక్కుచెదరకుండా యున్నది. అటులనే పుష్పగిరిపీఠ ఆవరణ వెలుపలగల చాలా పురాతనమైన దేవాలయములో 'శిలానిర్మిత శ్రీచక్రము' గలదు. ఇటువంటి, పూర్వ వైభవము గటట్టిని పురాణప్రశస్తిని గట్టిని, శ్రీచక్రములను పరిశీలించి నిష్పక్షపాత బుద్ధితో దళములను గూర్చియు, వృత్త త్రయములను గూర్చియు వివరించగలరు.

శ్రీచక్ర విషయమై గణనీయమైన కృషి సలిపిన మీరు మీ గ్రంథమున పొందుపరచిన 'చక్రవిదుడు' అను బిరుదునకు అర్హులైయున్నారు. ఈ శ్రీముఖముద్వారా మీకు పై బిరుదమును ప్రధానము చేయడమైనది.

ఇతి నారాయణ స్మృతిః

(signature)

# విషయ సూచిక

ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీవిద్యా మహా యంత్రము

## 1. పరిచయము

*శ్రీచక్రం త్రిపుర సుందర్యాః । బ్రహ్మాండాకార మీశ్వరీ ।*

శ్రీచక్రము యొక్క స్వరూపాన్ని పరమేశ్వరుడు పరమేశ్వరికి వివరిస్తున్నాడు. సృష్టి ఆరంభానికి ముందు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ పూర్ణ బిందు స్వరూపంలో ఉండేవాడు. ఏకాకిగా ఉన్న తాను అనేకానేక రూపములు పొందగోరినవాడై తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు.

ప్రళయం సంభవించినప్పుడు పంచభూతాలు ఒక దానిలో ఒకటి కలిసిపోతాయి.

పృథివి - జలమునందు, జలము - అగ్ని యందు, అగ్ని - వాయువునందు,

వాయువు - ఆకాశమునందు లీనమైపోతాయి. (ప్రళయం సంభవించినప్పుడు జగత్తులోని జీవరాశి అంతా నాశనమైపోతుంది. అయితే ఈ జీవులలో అన్నీ ముక్తిని పొందవు. కొన్నింటికి ప్రారబ్ధకర్మ ఇంకా ఉంటుంది. అటువంటి జీవులు తమ ప్రారబ్ధ విశేషాలతో కలిసి మాయలో కలిసి పోతాయి.) ఆ మాయచిచ్ఛక్తిగా మారి బ్రహ్మానందమనుభవిస్తూ మిగిలిన జీవులతో కలిసి పరబ్రహ్మ యందు సామరస్యము పొందుతుంది. అటువంటి పరిస్థితిలో పరబ్రహ్మ పూర్ణబిందు స్వరూపుడై ఉన్నాడు. అట్టి పరబ్రహ్మకు మళ్ళీ సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది.

పరబ్రహ్మ స్వయం ప్రకాశము గలవాడు. జ్ఞాన స్వరూపుడు, ఇచ్ఛారహితుడు. అతడు తనయందు కలిసిపోయి విడదీయటానికి వీలులేకుండా ఉన్నటువంటి విమర్శశక్తి అంశతో అంటే మాయతోనూ, ప్రళయకాలంలో తనలో కలిసిపోయిన, ఇంకా ప్రారబ్ధము తీరనటువంటి జీవుల కోరికల వల్ల, మళ్ళీ సృష్టి చెయ్యాలనే కోరిక గలవాడవుతున్నాడు. ఆ సమయంలో పూర్ణబిందు స్వరూపుడు తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఆ రెండు భాగాలే ప్రకాశ విమర్శాంశలు. వారే శివశక్తులు. పరమేశ్వరుడు, పరమేశ్వరి, ఆ పరమేశ్వరుని

**పర శిష్యులు :** శ్రీవిద్య కాకుండా వైష్ణవము, శైవము వంటి ఇతర విద్యలలో పూర్ణదీక్షాపరులు

**నాస్తికులు :** వేదాలను ప్రమాణంగా అంగీకరించనివారు, భగవంతుడు లేడు అనే వారు. గురువు మీద భక్తి, గౌరవము, నమ్మకము లేని వారు, ఆయనకు సేవ చేయనివారు, వీరెవరికీ శ్రీవిద్య ఉపదేశించరాదు. భగవంతుడి మీద నమ్మకం కలవారికీ, గురువును గౌరవించేవారికి మాత్రమే శ్రీవిద్యను ఉపదేశించాలి. కొంత మంది మిడిమిడి జ్ఞానంతో శ్రీవిద్యకు విపరీతార్థాలు చెప్పి, వ్యతిరేక ప్రచారం చేస్తుంటారు. వీరు కుడా శ్రీవిద్యకు అనర్హులే. నాస్తికులూ శ్రీవిద్యకు అనర్హులు.

జన్మతః ఐశ్వర్యవంతులు, మహారాజులు, గురువుకు సేవ చేయలేనివారు, శ్రీవిద్య తెలుసుకోవాలనే జిజ్ఞాస గనక ఉన్నట్లైతే, గురువుకు తగినంత ధనము ఇచ్చి శ్రీవిద్యను పొందవచ్చు. ధనం తీసుకుని శ్రీవిద్యనుపదేశించటం శాస్త్ర సమ్మతమే! అసలు విద్యను నేర్చుకోవటానికి మూడు మార్గాలున్నాయి.

*గురుశుశ్రూషయా విద్యా, పుష్కలేన ధనేనవా ।*
*అథవా విద్యయా విద్యా, చతుర్థోనోపలభ్యతే ॥*

1) గురువుకు సేవలు చేసి, 2) గురువుకు తగినంత ధనమిచ్చి, 3) తనకు వచ్చిన విద్యను గురువుకు చెప్పి అతడి నుండి విద్యను పొందటము. అంతేకాని నాల్గవ పద్ధతిలేదు. అయితే శ్రీవిద్యోపాసనలో మొదటి రెండు పద్ధతులు మాత్రమే ఆచరించాలి. మూడవ పద్ధతి నిషిద్ధము.

## శ్రీచక్ర పూజాధికారులు

శ్రీచక్రాన్ని అర్చించే వారు మూడు రకాలుకా విభజించబడతారు.

*ఆజ్ఞాంతం సకలం ప్రోక్తం తతః సకల నిష్కలం ।*
*ఉన్మన్యన్తం పరస్థానే నిష్కళం చ త్రిధాస్థితం ॥*

శరీరంలో మేరుదండమున్నది. దీనినే వెన్నుపూస అంటారు. దీని వెంబడి సుషుమ్నానాడి ఉంటుంది. సుషుమ్నానాడికి రెండు చివరలా సహస్ర దళ పద్మములుంటాయి. రెండు సహస్రదళ పద్మాల మధ్య పందొనిమిది స్థానాలున్నాయి. వాటిని మూడు జట్లుగా విభజించటం

జరిగింది. అవి. 1) అకులము నుంచి ఆజ్ఞా చక్రము వరకు. తొమ్మిది స్థానాలు. 2) బిందువు నుంచి ఉన్మన వరకు తొమ్మిది స్థానాలు. 3) మహా బిందువు.

మొదటి జట్టులో శ్రీచక్ర భావన చేసేవారు సకలులు. రెండవ జట్టులో శ్రీచక్ర భావన చేసే వారు సకల నిష్కలులు. మూడవ జట్టులో శ్రీచక్ర భావన చేసేవారు నిష్కలులు. మొదటి జట్టుకు ద్వైదీభావము గల ఉపాసకులు అధికారులు. వీరి దృష్టిలో భక్తుడు వేరు, భగవంతుడు వేరు. ఐహిక సుఖాలంటే వీరికి మక్కువ ఎక్కువ. వీరే సకలులు. మూడవ జట్టువారు అద్వైత భావన గలవారు. భగవంతుడు, భక్తుడు ఇద్దరూ ఒక్కటే అనే భావన కలవారు. మహాజ్ఞానులు. వీరే నిష్కలులు. రెండవ జట్టువారు శుద్ధాశుద్ధ మిశ్రులైన భేదాభేద దృష్టి గలవారు. అంటే ఒకసారి భగవంతుడు, భక్తుడు వేరు అనుకుంటారు. ఇంకొకసారి తానే సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపము అనుకుంటారు. వీరు సకల నిష్కలులు.

*అకులే విషు సంజ్ఞే చ శాక్తే వహ్నౌ తథా పునః ।*
*నాభౌ అనాహతే శుద్ధౌ లంబికాగ్రే భ్రువోన్తరే ॥*

మొదటి జట్టులో అకులము దగ్గర నుండి ఆజ్ఞాచక్రము వరకు తొమ్మిది స్థానాలుంటాయి. అవి.

1. అకులము : ఆధార చక్రానికి దిగువన ఉండే సహస్రారము.
2. విషు : ఆధార చక్రానికి క్రింద భాగాన ఉన్న అష్టదళము, షడ్దళముల మధ్య భాగము.
3. శక్తి : కుండలినీశక్తి ఉండే స్థానము. ఆధార చక్రము.
4. వహ్ని : స్వాధిష్ఠానము.
5. నాభౌ : బొడ్డు దగ్గర ఉన్న మణిపూరము.
6. అనాహతము : హృదయ స్థానము
7. విశుద్ధౌ : కంఠ స్థానము
8. లంబికాగ్రే : కొండ నాలుక, సూక్ష్మ జిహ్వా స్థానమైన అష్టదళ పద్మము.
9. భృవోన్తరం : ఆజ్ఞా చక్రము, భృకుటి స్థానము.

*ఇందౌ తదర్థ రోదిన్యాం నాదే నాదాన్త ఏవచ ।*
*శక్తౌ పునర్వ్యాపికాయాం సు మనోన్మన గోచరే ॥*

రెండవ జట్టులో బిందువు నుంచి ఉన్మన వరకు తొమ్మిది స్థానాలున్నాయి.

1. ఇందౌ : బిందువు
2. తదర్థం : అర్థ చంద్రము
3. రోదిని 4) నాదము 5) నాదాన్తము 6) శక్తి 7) వ్యాపిక 8) సుమన 9) ఉన్మన.

***మహాబిందౌ పునశ్చైవం త్రిధా చక్రం తు భావయేత్ ।***

మూడవ జట్టులో ఒకే ఒక స్థానమున్నది. అదే మహా బిందువు. ఇది శిరస్సుకు రెండంగుళాల పైన ఉన్నది. సాధకులు తమ సామర్థ్యాన్ని బట్టి ఈ స్థానాలలో శ్రీచక్ర భావన చేస్తారు. ఆధార చక్రం నుంచి ఆజ్ఞాచక్రం వరకు ఉన్న షట్చక్రాల గురించి గతంలో వివరించటం జరిగింది. ఇప్పుడు రెండవ జట్టులోని సూక్ష్మ చక్రాలను వివరించటం జరుగుతున్నది.

***నళినీ పత్ర సంహత్యాః సూక్ష్మ సూచ్యభివేధనే***
***దళేదళేతు యః కాలః సకాలో లవసంజ్ఞితః***
***అతి సూక్ష్మ తమః కాలో నోపలభ్యో భృగూద్వహా ॥***

తామర పూవుల యొక్క రేకులను కట్టగా చేసి సూదితో గ్రుచ్చినట్లైతే, ఒక్కొక్క దళము గ్రుచ్చుడు పడటానికి పట్టే కాలాన్ని లవము అంటారు. అంతకన్నా తక్కువైన కాలాన్ని పరిశీలించటం సాధ్యంకాదు. ఇటువంటి 256 లవములను ఒక మాత్ర అంటారు.

***బిందోరర్థమాత్రా పరే పరే చాపి పూర్వపూర్వాః***

బిందువుకు అర్థమాత్ర అంటే 128 లవములు. అక్కడి నుండి మిగిలిన వాటికి పై వాటిలో సగము మాత్రమే ఉచ్చారణ కాలము చెప్పబడింది. ఇప్పుడు బిందును వివరించటం జరుగుతోంది.

## బిందువు

***దీపాకారోఽర్థమాత్రం చ లలాటే వృత్తమిష్యతే***

దీప సమాన కాంతి, అర్థమాత్ర (128 లవములు) ఉచ్చారణ కాలము, వృత్తాకారము కలిగిన బిందువు లలాటమందున్నది.

## అర్ధ చంద్రము, రోదిని

*అర్ధ చంద్ర స్తథాకార: పాదమాత్ర స్తదూర్ధ్వత:*
*జ్యోత్స్నాకారా తదర్ధాంశా రోదినీత్యస్య విగ్రహ: ॥*

బిందువుకు పై భాగాన అర్ధ చంద్రమున్నది. పేరుకు తగ్గట్టుగానే దాని ఆకారము అర్ధ చంద్రముగానే ఉంటుంది. ఇది అష్టమి నాటి చంద్రునివలె ప్రకాశిస్తూ ఉంటుంది. దీని ఉచ్చారణ 1/4 వంతు మాత్ర. అంటే 64 లవములు. దీని పైన వెన్నెల వంటి కాంతి గలిగి, 1/8 వంతు మాత్రాకాలము (32 లవములు) గల ఊర్ధ్వాగ్ర త్రికోణ స్వరూపము గల రోదిని ఉంటుంది.

## నాదము

*బిందు ద్వయాన్తరేదండ శ్చైవ రూపో మణిప్రభ:*
*కలాంశో ద్విగుణంశశ్చ నాదాంతో విద్యుదుజ్జ్వల: ॥*

కనులవలె ఉండే రెండు బిందువులున్నాయి. వీటిని తిర్యక్ బిందువులంటారు. వాటిని కలుపుతూ మధ్యలో సన్నని రేఖ ఉంటుంది. ఇది మణులవలె ఎర్రని కాంతులతో ప్రకాశిస్తూ ఉంటుంది. దీని ఉచ్చారణా కాలము కలాంశ అంటే, 1/16 వంతు మత్రం (16 లవములు) ఇది అవ్యక్త నాద స్వరూపము.

## నాదాన్తము, శక్తి

*హలాకారస్తు సవ్యస్థ బిందుయుక్తో విరాజతే ।*
*శక్తిర్వామస్థ బిందూర్ధ్వ స్థిరాకారా తథా పున: ॥*

నాదానికి పైభాగాన 1/32 మాత్రాకాలము (8 లవములు) కలిగి విద్యుత్కాంతులతో ప్రకాశిస్తూ కొన పైకి ఎత్తిపెట్టిన నాగలిలాగా ఉండి, కుడి వైపున ఉన్న బిందువుతో కలిసి ఉంటుంది. (ఇదే నాదాన్తము) తిర్యక్ బిందువులలో ఎడమ బిందువుకు పైభాగాన ఉన్నదే శక్త్యాకారము. శక్తికి పైభాగాన వ్యాపిక ఉంటుంది. శక్తికి ఉచ్చారణ కాలము 4 లవములు.

## వ్యాపిక

*వ్యాపికాబిందు విలస త్రికోణాకారతాంగతా ।*
*బిందు ద్వయాంత రాలస్థా ఋజురేఖామయీ పున: ॥*

శక్తికి పై భాగాన వ్యాపిక ఉన్నది. అది ఊర్ధ్వ శీర్షము గల త్రికోణము మాదిరిగా ఉంటుంది. దీని ఉచ్చారణ కాలము 2 లవములు. పైన క్రింద రెండు బిందువులుండి, ఆరెండిటినీ కలిపే సన్నని రేఖనే సుమనా అంటారు.

## సుమనా, ఉన్మనా

*సుమనా బిందు విలస దృజు రేఖా తథోన్మనా*
*శక్త్యాదీనాం వపు: స్ఫూర్జ ద్వాదశాదిత్య సన్నిభమ్ ॥*

బిందువు పైభాగాన ప్రకాశించే తిన్నని రేఖయే సుమన. సుమన చేరేంత వరకు సాధకుడి మనస్సు పనిచేస్తూ ఉంటుంది. అందుచేతనే దీనిని 'సుమనా' అన్నారు. దీని ఉచ్చారణాకాలము 1 లవము.

ఆ తరువాతది ఉన్మన. ఉన్మనాస్థితిలో మనసు పని చెయ్యదు. ఇక్కడ మనసుకు ఇంకొక రూపం వస్తుంది. దీనికి ఉచ్చారణా కాలము లేదు. ఈ రకంగా సూక్ష్మ చక్రాలు చెప్పబడ్డాయి. వాటి ఉచ్చారణ కాలము.

| | | |
|---|---|---|
| బిందువు | - | 128 లవములు |
| అర్ధ చంద్రము | - | 64 లవములు |
| రోధిని | - | 32 లవములు |
| నాదము | - | 16 లవములు |
| నాదాంతము | - | 8 లవములు |
| శక్తి | - | 4 లవములు |
| వ్యాపిక | - | 2 లవములు |
| సుమన | - | 1 లవములు |
| ఉన్మన | - | కాలము లేదు. |

## మహా బిందువు - పరబ్రహ్మ స్వరూపము

*దేశకాలనవచ్ఛిన్నం తదూర్ధ్వే పరమం మహత్ ।*
*నిసర్గ సుందరం తత్తు పరానంద విఘూర్ణితమ్ ॥*

ఉన్మని పైభాగాన మహాబిందువున్నది. ఇది శిరస్సుకు రెండు అంగుళాల పైభాగాన ఉంటుంది. ఈ మహా బిందువు దేశ కాలములకు అతీతమైనది. పరమ పదమైనది. సర్వోత్కృష్టమైనది. గొప్పవాటి కన్న కూడా గొప్పది. స్వభావము చేతనే అందమైనది. అందుచేతనే విసర్గ సుందరమని చెప్పబడింది. శివశక్తుల సామరస్యము పరమానందకరమైనది. అటువంటి పరమానందముతో ఇది వ్యాపించి ఉన్నది.

మహాబిందువు నందు పరమేశ్వరుని అర్చించేవారు జ్ఞానులు. మోక్ష వాదులు. వీరికి మరు జన్మ ఉండదు.

## శ్రీవిద్యా గురు పరంపర

పరమాత్మ పూర్ణబిందు స్వరూపుడు. సృష్టి చెయ్యాలనే సంకల్పంతో తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. అవే ప్రకాశాంశ; విమర్శాంశలు. శివశక్తులు, కామేశ్వరుడు కామేశ్వరి.

*పరమానందానుభవః పరమగురు ర్నిర్విశేష బింద్వాత్మా ।*
*స పునః క్రమేణ భిన్నః కామేశత్వం యయౌ విమర్శాంశాత్ ॥*

పూర్ణబిందు స్వరూపుడైన పరమాత్మ ప్రకాశ విమర్శ సమిష్టి రూపమైన సకల గురుమండల స్వరూపుడైనవాడు. ఆ పరమాత్మయే దివ్యౌఘ, సిద్ధౌఘ, మాన మేఘములను వేరు వేరుగా పొంది కామేశ్వరీ కామేశ్వర భావం పొందాడు.

*ఆసీన శ్రీపీఠే కృతయుగకాలే గురుశ్శివో విద్యామ్ ।*
*తస్మై దదౌ స్వశక్త్యై కామేశ్వర్యై విమర్శ రూపిణ్యై ॥*

సృష్టి ఆవిర్భావ కాలంలో, కృతయుగ ప్రారంభంలో, సర్వానందమయ ఓడ్యాణ పీఠమనే బిందు పీఠమందు పరమాత్మ స్వరూపుడైన పూర్ణ కామేశ్వరుడు 'ఊర్ధ్వానందనాథ' అనే పేరుతో, అనుత్తరానందం కోసం మాయా స్వరూపిణి, స్వాత్మరూప అయిన కామేశ్వరీ

దేవికి శ్రీవిద్యను ఉపదేశించాడు. కామేశ్వరీ కామేశ్వరు లిద్దరూ పరబ్రహ్మ స్వరూపులే. వారిద్దరికి భేదం లేదు. అయినప్పటికీ లోకాలను అనుగ్రహించాలనే కోరికతో, పరమాత్మ తానే గురు శిష్యులుగా మారి, సర్వోపనిషత్కారణ భూతమైన శ్రీవిద్యాతంత్రాన్ని ఆమెకు ఉపదేశించాడు. ఈ రకంగా పరమాత్మ శ్రీవిద్యను లోకంలో వ్యాప్తి చెయ్యటం కోసం తాను 'ఊర్ధ్వానందనాథ' అనే దీక్షానామం ధరించి, కామేశ్వరీ దేవికి శ్రీవిద్యనుపదేశించి, ఆమెకు 'మిత్రేశ దేవనాథ' అని నామకరణం చేశాడు. ఈ రకంగా కామేశ్వరీ కామేశ్వరులు దీక్షానామాలు ధరించి సర్వానంద మయమైన ఓడ్యాణ పీఠంలో పురాణ దంపతులుగా ఉన్నారు. అది శ్రీవిద్యకు మొదటి స్థానము.

*సేయాయ మిత్ర సంజ్ఞాం స్థానేశాన్ జ్యేష్ఠ మధ్య బాలాఖ్యాన్ ।*
*చిత్ప్రాణ విషయ భూతాన్ త్రేతాయుగాది కారణ త్రిగురూన్ ॥*
*బీజత్రితయాధి పతీ న్పరీక్ష్య విద్యాం ప్రకాశయామాస ।*
*ఏభ్యై రోఘ త్రితయం సమను గృహీతం గురుక్రమో విదితః ॥*

ఆ తరువాత పరమేశ్వరుని ఆజ్ఞమేరకు ఆ పరాభట్టారిక, శ్రీవిద్యా వ్యాప్తి కోసం తనయొక్క అంశలు, అవ్యక్త, మహత్తత్వ అహంకార స్వరూపులు, సత్వ రజ స్తమోగుణ ప్రధానులు, సృష్టి స్థితి లయ కారకులు, వాగ్భవ, కామరాజ, శక్తి బీజాధిపతులు అయిన త్రిమూర్తి ద్వంద్వానికి శ్రీవిద్యను ఉపదేశించింది. వారి ద్వారా ఉపదేశ పరంపరగా, ఈ విద్య విస్తరించి, దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ గురుమండలంగా లోకంలో ప్రసిద్ధి పొందింది.

దివ్యౌఘులు అంటే - ఇంద్రాది దేవతలు

సిద్ధౌఘులు అంటే - సనకసనందనాది మహర్షులు

మానవౌఘులు అంటే- విద్యారణ్యులు, గౌడపాదులు, ఆదిశంకరులు మొదలైన వారు.

బిందుమండల వర్తిని అయిన కామేశ్వరి యోనిచక్రం (త్రికోణం) లోని ఉత్తర కోణమునందు జాలంధర పీఠంలో ఉన్న, శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులకు మొదటగా శ్రీవిద్యను ఉపదేశించి, వారికి ఊర్ధ్వ దేవనాథ, కామేశ్వర్యంబా అని నామకరణం చేసింది. తరువాత ఊర్ధ్వ దేవనాథ ద్వంద్వము, యెనిచక్రంలోని దక్షిణ కోణంలో గల పూర్ణగిరి పీఠంలో ఉన్న కామరాజ బీజాధిపతులైన లక్ష్మీనారాయణులకు ఈ విద్యను ఉపదేశించి వారికి షష్టీశ దేవనాథ వజ్రేశ్వర్యంబా అని నామకరణం చేశారు. ఆ తరువాత షష్టీశ దేవనాథ

ద్వంద్వము, యోనిచక్రానికి అగ్రకోణంలో కామగిరి పీఠంలో ఉన్న వాగ్భవ బీజాధిపతులైన వాణీ హిరణ్య గర్భులకు ఉపదేశించి, వారికి మిత్రేశదేవనాథ, భగమాలిన్యంబా అని నామకరణం చేశారు. శ్రీచక్రంలోని త్రికోణంలో ఉన్న కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలినిలు వీరే.

మిత్రేశనాథ ద్వంద్వము శ్రీవిద్యను దివ్యులైన ఇంద్రాది దేవతలకు, వారు సనకసనందనాది సిద్ధులకు, వారు మానవులకు ఉపదేశించారు. ఈ రకంగా గురుపరంగా శ్రీవిద్య భూలోకంలోవ్యాప్తి చెందింది. శ్రీవిద్య చాలా రహస్యమైనది.

**కర్ణాత్కర్ణోప దేశేన సంప్రాప్తమవనీతలం ॥**

ఈ విషయమంతా కర్ణాత్కర్ణోపదేశము వలన మాత్రమే తెలియబడుచున్నది. అంటే గురువు శిష్యునికి ఉపదేశం చెయ్యటం ద్వారానే శ్రీవిద్య పరంపరగా వస్తుంది. అంతే కాని పుస్తకాలు చదవటం వల్ల మాత్రం కాదు.



# ౨. శ్రీచక్ర స్వరూపము

పరమేశ్వరుడు, శక్తిస్వరూపిణి అయిన ఆ పరమేశ్వరికి శ్రీవిద్యను గూర్చి వివరిస్తున్నాడు. ఆ సమయంలో పరమేశ్వరి అడుగుతున్నది.

> *దేవదేవ దయాసింధో త్రికాలజ్ఞ మహేశ్వర: ।*
> *బ్రూహిమే సర్వ విజ్ఞానం సర్వకామార్థదాయకమ్ ।*
> *శ్రీచక్ర స్య విశేషాణి రహస్యాతి రహస్యకమ్ ॥*

ఓ మహా దేవా ! మహేశ్వరా ! సర్వకామ్యములను తీర్చునట్టిది, అతి రహస్యమైనట్టిది అయిన శ్రీచక్ర విశేషములను నాకు వివరించవలసినది.

> *శృణుదేవి ప్రవక్ష్యామి శ్రీచక్ర స్వరూపంతథా ।*
> *ఏతత్ విజ్ఞాన మాత్రేణ భుక్తి ముక్తి ప్రదాయినీమ్ ॥*

ఓపార్వతీ! దేనిని గురించి తెలుసుకున్నంత మాత్రం చేతనే భక్తి ముక్తి కలుగుతాయో, ఆ శ్రీచక్ర స్వరూపాన్ని నీకు వివరిస్తున్నాను. సావధాన చిత్తవై వినుము. అని పరమేశ్వరుడు శ్రీచక్రాన్ని గురించి మాయా స్వరూపిణికి వివరించాడు అని తంత్రాలలో చెప్పబడింది.

'రుద్రయామళం'లో శ్రీచక్రాన్ని గురించి ఈ విధంగా చెప్పబడింది.

> *పృశ్నయోనామమునయ: సర్వే చక్ర సమాశ్రయా: ।*
> *సేవమానా శ్చక్రవిద్యాం దేవ గంధర్వ పూజితామ్ ॥*
>
> *అగ్నిష్టో మాత్మకం చక్రమగ్నిష్టోమమయం జగత్ ।*
> *అగ్నావంతర్బోభాను: అగ్నిష్టోమమయం స్మృతమ్ ॥*
>
> *త్రిఖండ మాతృకా చక్రం । సోమసూర్యాఽనిలాత్మకమ్ ।*
> *త్రికోణం బైందవం సౌమ్య మష్టకోణం చ మిశ్రకమ్ ॥*
>
> *చక్రం చంద్రమయం చైవ దశార ద్వితయం తథా ।*
> *చతుర్దశారం వహ్నేస్తు చతుశ్చక్రం చ భానుమత్ ॥*
>
> *ఏతత్ప్రసాదాదింద్రాద్యా వసవోఽష్టో మరుద్గణా: ।*
> *యే యే సమృద్ధా లోకేఽస్మిన్ త్రిపురాచక్ర సేవకా: ॥*

*పురత్రయం చ చక్రస్య సోమసూర్యాఽనిలాత్మకమ్ ।*
*మహాలక్ష్మ్యా: పురం చక్రం తత్రైవాస్తే సదాశివ: ॥*

పృశ్నులు అను మునులందరూ శ్రీచక్రాన్ని ఆశ్రయించి, దేవ గంధర్వులు పూజించి శ్రీచక్ర విద్యను సేవించి ఉన్నారు.

శ్రీచక్రము అగ్నిష్టోమాత్మకమైనది. ఈ జగత్తు అంతాకూడా అగ్నిమయమే. అగ్ని లోపల సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. మాతృకాచక్రమనబడే శ్రీచక్రము సోమసూర్య అనిలాత్మకమై మూడు భాగాలుగా ఉన్నది.

బిందువు, త్రికోణము, అష్టకోణము - చంద్రమయము.
దశారయుగ్మము, చతుర్దశారము - అగ్ని మయము.
అష్టదళము, షోడశదళము, భూపురము - భాను మయము.

శ్రీచక్ర ప్రసాదము వలన ఇంద్రుడు మొదలైన దేవతలు, అష్టవసువులు, మరుద్గణాలు ప్రకాశిస్తున్నారు. ఎవరెవరు లోకమందు సంపదలతో తులతూగుతున్నారో, వారందరు శ్రీచక్రమును పూజించేవారే. శ్రీచక్రము మహాలక్ష్మి పురము. దీనిలో సదాశివుడున్నాడు.

శ్రీచక్రాన్ని దుర్వాస మహర్షి లలితా హృదయములో ఈ విధంగా వర్ణించాడు.

*మధ్యే తస్య మరుత్సేవ్యం చతుర్ద్వార సముజ్జ్వలం ।*
*చతురస్ర త్రిరేఖాఢ్యం చారుత్రివలయాంకితమ్ ॥*

*కలాషోడశభిర్యుక్తం అష్ట పల్లవ సంయుతం ।*
*చతుర్దశారరుచిరం దశార ద్వితయాఽన్వితమ్ ॥*

*అష్టకోణయుతం దివ్యం అగ్ని కోణ సముజ్జ్వలం ।*
*యోగిభి: పూజితం నిత్యం యోగినీ గణ సేవితమ్ ॥*

*కూశ్మాండ గ్రహవేతాల క్రూరదానవవిగ్రహం ।*
*ఉపాసిత ముమాకాంత ముకుందా భోజ సంభవై: ॥*

*ఆశానాంపూరకం నిత్యం అర్చకానా మహర్నిశం ।*
*అష్టాదశక మర్మాఢ్యం చతుర్వింశతి సంధికమ్ ।*
*శ్రీ మదిందుగ్రహోపేతం । శ్రీచక్రం ప్రణమామ్యహమ్ ॥*

క్షీరసాగరం మధ్యన, మణిద్వీపంలో కదంబవనంలోని చింతామణి గృహంలో, రత్న సింహాస నములు కలిగి, భూపురత్రయముతో ప్రకాశిస్తూ, వలయత్రయము, షోడశ దళము, అష్ట దళము, చతుర్దశారము, దశార ద్వయము, అష్టకోణము, అగ్ని కోణములతో ప్రకాశించునది. (త్రేతాగ్నులు కాబట్టి త్రికోణము అగ్ని కోణమని చెప్పబడినది.) నిత్యము యోగులచేత, యోగినుల చేత (శక్తి ఉపాసకులు) పూజింపబడునది, కూశ్మాండ వేతాళములు, క్రూరదానవుల మూర్తులతో కూడినది, త్రిమూర్తులచేత ఉపాసింపబడునది, అయిన దీనిని అర్చించు వారి కోరికలను అహర్నిశలు తీర్చునది, పద్దెనిమిది మర్మాలు; ఇరవై నాలుగు సంధులతో కూడినది, పూర్ణ చంద్రునితో, గ్రహములతో, సకల జ్యోతిః సముదాయముతో కూడినది అయిన శ్రీచక్రమునకు నమస్కరించుచున్నాను. 'సౌందర్యలహరి'లో శంకరభగవత్పాదుల వారు శ్రీచక్రాన్ని వివరిస్తూ ....

***చతుర్భి శ్రీకంఠై శ్శివయువతిభిః పంచభిరపి***
***ప్రభిన్నాభిశంభోర్నవభిరపి మూల ప్రకృతిభిః***
***చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్ర త్రివలయ***
***త్రిరేఖాస్సార్ధం తవశరణ కోణాః పరిణతాః ॥***

నాలుగు శివచక్రములతోను, ఐదు శక్తి చక్రములతోను మొత్తం తొమ్మిది మూల ప్రకృతికలతోను, శ్రీచక్రము శివా శివులకు ఆలవాలయమై ప్రకాసిస్తున్నది. అంటే శ్రీచక్రంలో నాలుగు శివచక్రాలు, ఐదు శక్తి చక్రాలున్నాయని విశదమౌతున్నది. 'భైరవయామళం'లో శ్రీచక్రాన్ని వివరిస్తూ.

***చతుర్భిశ్శివ చక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః ।***
***శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ॥***

నాలుగు శివచక్రాలు, ఐదుశక్తి చక్రాలు వెరసి తొమ్మిది చక్రాలతో శ్రీచక్రము శివశక్తుల స్వరూపమై ఉన్నది. అయితే శ్రీచక్రంలో ఉండే చక్రాలు ఏవి?

1) బిందువు, 2) త్రికోణము, 3) అష్టకోణము 4) అంతర్దశారము, 5) బహిర్దశారము, 6) చతుర్దశారము, 7) అష్టదళము, 8) షోడశదళము, 9) వృత్తత్రయము, 10) భూపురత్రయము లతో శ్రీచక్రము పరదేవతా స్వరూపమై ఉన్నది.

'ప్రపంచ సారసంగ్రహం'లో శ్రీచక్రాన్ని వివరిస్తూ ......

***బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతం ।***
***వసుదళవృత్త కళాదళవృత్త త్రిమహీగృహం భజే చక్రమ్ ॥***

బిందువు, త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము, వృత్తము, అష్టదళము, వృత్తము, షోడశదళము, వృత్తము, భూపురత్రయములతో కూడిన శ్రీచక్రమునకు నమస్కరించుచున్నాను.

## శ్రీచక్రావతరణము

అసలు శ్రీచక్రము ఏ విధంగా పుట్టింది ? అని గనక విచారించినట్లైతే, గతంలో చెప్పినట్లుగా పరబ్రహ్మ మళ్ళీ సృష్టి చెయ్యాలనే తలంపుతో తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఆ భాగాలే శివశక్తులు. పరమేశ్వరుడు అమృత స్వరూపుడు. సాధకులకు ముక్తిని ప్రసాదిస్తాడు. కాని పరమేశ్వరి భక్తుల కోరికలు తీరుస్తుంది. భోగభాగ్యాలనందిస్తుంది. అందుకే ఆమె విష స్వరూపిణి అని చెప్పబడింది. ఈ సృష్టి అంతటకూ ఆమెయే కారణము.

***తచ్ఛక్తి పంచకం సృష్టయాలయేనాగ్ని చతుష్టయమ్***
***పంచశక్తి చతుర్వహ్ని సంయోగా చ్చక్ర సంభవః ॥***
***ఏతచ్చక్రావతారస్తు కథయామిత వానఘే ।***

పాపరహితమైన ఓ దేవీ ! శ్రీచక్రము అవతరించిన విధానమును వివరిస్తున్నాను. వినవలసినది. శ్రీచక్రంలో తొమ్మిది కోణాలున్నాయి. అందులో అభిముఖంగా ఉండే ఐదు కోణాలూ సృష్టి రూపమైన శక్తికోణాలు. అలాగే వెనుకవైపుకు ఉన్న నాలుగు కోణాలూ సంహార రూపమైన శివకోణాలు. శివశక్తి కోణముల సంయోగము చేతనే అష్టదళము, షోడశ దళము, భూపురములతో కూడిన శ్రీచక్రము ఏర్పడింది.

***యదాసా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ ।***
***స్ఫురత్తామాత్మనః పశ్యేత్తథా చక్రస్య సంభవః ॥***

విశ్వరూపిణి అయిన ఆ పరాశక్తి స్వేచ్ఛగా తనను తాను చూసినప్పుడు శ్రీచక్రము ఉద్భవించింది.

## నవధాతువులు

శ్రీచక్రంలో ఉన్న తొమ్మిది చక్రాలను యోనులు అని పిలవటం జరుగుతున్నది. యోని అంటే కారణము, గని, జన్మస్థానము, నివాస స్థానము అని అర్థము. ఈ నవయోనులూ నవధాతువులకు ప్రతీకలు. నవధాతువులు అంటే ...........

1) చర్మము 2) రక్తము 3) మాంసము 4) మెదడు 5) ఎముకలు 6) మజ్జ 7) వీర్యము 8) ప్రాణము, 9 ) జీవము.

శ్రీచక్రంలోని తొమ్మిది కోణాల మాదిరిగానే ఈ ధాతువులు కూడా శివ, శక్తి సంబంధం కలిగి ఉంటాయి. వీటిలో ఐదు శక్తిధాతువులు కాగా మిగిలిన నాలుగు శివధాతువులు.

కామికా తంత్రంలో చెప్పినట్లుగా

**త్వగస్పృజ్మాంసమేదోస్తి ధాతవశ్శక్తి మూలకా : ।**
**మజ్జా శుక్ల ప్రాణ వీర్య ధాతవశ్శివ మూలకాః ॥**

వీటిలో 1) చర్మము 2) రక్తము 3) మాంసము 4) మెదడు 5) ఎముకలు శక్తి ధాతువులు.

1) మజ్జ 2) వీర్యము 3) ప్రాణము 4) జీవము అనేవి శివధాతువులు.

**నవధాతురయం దేహోనవయోని సముద్భవః ।**
**దశమీ యోగిరే కైవ పరాశక్తి తధీశ్వరీ ॥**
**ఏవం పిండాండముత్పన్నం తద్వద్బ్రహ్మాండ ముద్భవౌ ।**

ఈ దేహము నవయోనులందు పుట్టి నవధాతు మయమై ఉన్నది. దీనిలో పదవ ధాతువు సాక్షాత్తూ ఆ పరమేశ్వరియే అయి ఉన్నది. ఈ రకంగా పిండాండ బ్రహ్మాండాలూ ఉద్భవించాయి.

## సంధులూ, మర్మస్థానాలు

శ్రీచక్రాన్ని గనక గీసి లెక్కపెట్టినట్లైతే అందులో ఇరవైనాలుగు సంధులూ, ఇరవై ఎనిమిది మర్మస్థానాలూ ఉంటాయి. అయితే సంధి అంటే ఏమిటి? మర్మము అంటే ఏమిటి?

*ద్వి రేఖాసంగమస్థానం సంధిరిత్యభిధీయతే ।*
*త్రిరేఖా సంగమస్థానం మర్మమర్మవిదోవిదుః ॥*

రెండు రేఖలు కలిసినచోట సంధి అని, మూడు రేఖలు కలిసిన చోట మర్మస్థానమని అంటారు. అయితే శ్రీచక్రంలో ఇరవైఎనిమిది మర్మాలు, ఇరవైనాలుగు సంధులు ఉంటాయని చెప్పబడుతోంది.

***అష్టావింశతి మర్మాణి । చతుర్వింశతి సధియః***

కాని శ్రీచక్రాన్ని గీసి మర్మస్థానాలు లెక్కపెట్టినట్లైతే వాటి సంఖ్య ఇరవైనాలుగు మాత్రమే ఉంటుంది.

అయితే శివచక్రాలయిన బిందువు, అష్టదళ పద్మము, షోడశ దళ పద్మము, భూపురాలకు సంగమస్థానములు లేకపోయినప్పటికీ, వాటిని కూడా మర్మస్థానాలుగానే లెక్కపెట్టాలని లొల్లా లక్ష్మీ ధరుడు మొదలైనవారు చెప్పారు. కాబట్టి వీటిని కూడా కలిపి లెక్కించినట్లైతే మర్మస్థానాలు ఇరవైఎనిమిది అవుతాయి.

కాని శ్రీచక్రంలో మర్మస్థానాలు ఇరవై ఎనిమిది కాదు. కేవలం పద్దెనిమిది మాత్రమే అని కొందరంటారు.

***ఆశానాం పూరకం నిత్యం । అర్చకానా మహర్నిశం ।***
***అష్టాదశక మర్మాఢ్యం ।చతుర్వింశతి సంధికమ్ ॥***

పై శ్లోకాన్ని బట్టి శ్రీచక్రంలో పద్దెనిమిది మర్మస్థానాలు, ఇరవైనాలుగు సంధులు ఉంటాయి.

## శ్రీచక్రంలో కోణాలు

శ్రీచక్రంలో మొత్తం నలభైఐదు కోణాలుంటాయి. అది ఏ విధంగా అంటే - శ్రీ చక్రంలోని శక్తి చక్రాలన్నీ కోణాకారంలో ఉంటాయి. వీటిలో.....

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్రికోణంలో | - | 3 | బహిర్దశారంలో | - | 10 |
| అష్టకోణంలో | - | 8 | చతుర్దశారంలో | - | 14 |
| అంతర్దశారంలో | - | 10 | మొత్తం కోణాలు | | 45 |

కాని శ్రీచక్రాన్ని గీసి లెక్కపెట్టినట్లైతే, మొత్తం కోణాలు 43 మాత్రమే ఉంటాయి. ఎందుచేతనంటే, త్రికోణంలోని రెండు కోణాలు అష్టకోణంలో కలిసిపోతాయి.

## శ్రీచక్రంలో రకాలు

శ్రీచక్రం మూడు విధాలుగా ఉంటుందని 'యోగినీ హృదయం'లో చెప్పబడింది.

**తత్రాద్యం నవయోని స్యాత్తేన ద్విదశ సంయుతం**
**మనుయోని పరం విద్యా తృతీయం తదనంతరమ్ ।**
**అష్టద్వయ ష్టదళోపేతం చతురస్రత్రయాన్వితం**
**చక్రస్య త్రిపురాకాత్వం కథితం పరమేశ్వరీ ॥**

శ్రీచక్రము మూడు రకాలుగా చెప్పబడింది.

1) బిందువుతో కూడిన నవయోని చక్రము.

2) బిందువు, నవయోని, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము.

3) బిందువు, నవయోని, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము, అష్టదళము, షోడశ దళము, భూపురములతో కూడిన పూర్తి చక్రము.

అయితే శ్రీచక్రంలోని చివరి మూడు ఆవరణలు అంటే భూపురము, షోడశ దళము, అష్టదళము అనేవి కలిసి సృష్టి చక్రము. వీటిలో......

భూపురము - సృష్టిసృష్టి
షోడశ దళము - సృష్టి స్థితి
అష్ట దళము - సృష్టి సంహారము

అదే విధంగా శ్రీచక్రం మధ్యలో ఉన్నటువంటి చతుర్దశారము, బహిర్దశారము, అంతర్దశారము కలిసి స్థితిచక్రము! వీటిలో .......

చతుర్దశారము - స్థితి సృష్టి
బహిర్దశారము - స్థితి స్థితి
అంతర్దశారము - స్థితి సంహారము

శ్రీచక్రంలోని చివరన ఉన్నటువంటి అష్టకోణము, త్రికోణము, బిందువులు కలిసి సంహార చక్రము. వీటిలో .....

అష్ట కోణము - సంహార సృష్టి

త్రికోణము - సంహార స్థితి

బిందువు - సంహార సంహారము

ఈ రకంగా శ్రీచక్రంలో సృష్టి స్థితి సంహారాలున్నాయి.

## బీజాక్షరాలు

ఏ యంత్రాన్ని తయారు చేసినప్పటికీ, అందులో ఆ యంత్రానికి సంబంధించిన బీజాక్షరాలుంటాయి. కాని సామాన్యంగా శ్రీచక్రంలో అవేవీ కనిపించవు. శ్రీచక్రము కేవలము రేఖా నిర్మితము. అయితే కొన్ని ప్రాంతాలలో శ్రీచక్రంలో బీజాక్షరాలు ఉంటాయి. ఈ రకంగా ఉన్నప్పుడు శ్రీచక్రంలో అసలు బీజాక్షరాలుండాలా ? అవసరం లేదా ? అనే ప్రశ్న ఉదయిస్తుంది. బీజాక్షరాల పైన కూడా వృత్తాలలో లాగానే భిన్నాభిప్రాయలున్నాయి.

***బీజాక్షరయుతం చక్రం యతీనా ముత్తమోత్తమం ।***
***బీజాక్షర విహీనంతు గృహస్థా నాం ప్రశస్తకం ॥***

బీజాక్షరములు గల శ్రీచక్రము యతీశ్వరులకు ఉత్తమమైనది. బీజాక్షరములు లేని శ్రీచక్రము గృహస్తులకు ప్రశస్తమైనది.

అయితే కొందరి అభిప్రాయం ప్రకారము శ్రీచక్రంలో బీజాక్షరాలు ఉండి తీరాలి.

***బీజం వినాతు నిర్జీవం । శవ వత్పరికీర్తితం***
***బీజయుక్తం భవేద్యంత్రం । నిశ్చప్తం సిద్ధిదాయకం***
***శ్రీచక్రనం బీజసంయుక్తం । నిశ్చప్తం పరమేశ్వరీ***
***బీజహీనం తు యచ్చక్రం । తచ్చక్రం సిద్ధిదం న చ ॥***

బీజాక్షరములనేవి ప్రాణములవంటివి. అవి గనక లేకపోతే శ్రీచక్రము జీవము లేనిదవుతుంది. బీజాక్షరములు గల శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే ఫలితము కలుగుతుంది. బీజాక్షరములు లేని చక్రాన్ని అర్చించినచో ఫలితము ఏమీ ఉండదు.

పై శ్లోకాలవల్ల, కొన్ని సంప్రదాయాలలో శ్రీచక్రంలో బీజాక్షరాలున్నాయని, కొన్ని సంప్రదాయలలో బీజాక్షరాలులేవని తెలుస్తోంది. ఈ రకంగా భిన్న సంప్రదాయాలున్నప్పుడు గురు సంప్రదాయాన్ని మాత్రమే పాటించాలనే ఆర్యోక్తిని పాఠకులు గ్రహింతు గాక !

## శ్రీచక్ర పూజ - ఫలితములు

శ్రీచక్రాన్ని ఏ విధంగా పూజించాలి ? అనగా అందులోని తొమ్మిది ఆవరణలలోని దేవతలనూ పూజించాలి. కాని శ్రీచక్రాన్ని దేనితో తయారు చెయ్యాలి ? దేనితో తయారు చేసిన చక్రాన్ని పూజిస్తే ఫలితము ఏమిటి ? ఈ విషయము 'రుద్రయామళం'లో చెప్పబడింది.

**తత: కుంకుమసింధూరై: కార్యం యత్నంతు యోగిన:**
**సౌవర్ణే రాజతే తామ్రే స్ఫాటికే వైద్రుమే తథా**
**చక్రే చోక్త విధానేన పూజ్య దేవీ పరోత్తమై:**

కుంకుమ, సింధూరాలతో నేలమీద శ్రీచక్రాన్ని గీసి పూజచేసినట్లైతే కార్యసిద్ధి కలుగుతుంది. వెండి, బంగారము, రాగి, స్ఫటికాలతో తయారు చేసిన శ్రీచక్రాలను కూడా పూజించవచ్చును. 'తంత్రరాజం'లో ఈ విధంగా చెప్పబడింది.

**రత్న హేమనిరూప్యేవా తామ్రే దృషది చక్రమాత్**
**కృత్వా చక్రస్య నిర్మాణం స్థాపయేత్ పూజయే దపి**
**లక్ష్మీ కాంతి యశ: పుత్ర ధనారోగ్యాది సిద్ధయే ।**

బంగారము, వెండి, రాగి, గండకీశిల (సాలగ్రామ శిల)లతో చేసిన శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే పుత్ర, ధన, ధాన్యాభివృద్ధి కలుగుతుంది. 'రత్న సాగరం' అనే గ్రంథంలో...

**యావజ్జీవం సువర్ణే స్యాద్రూప్యే ద్వావింశతి ప్రియే**
**తామ్రే ద్వాదశకం వర్షయ్ తదర్థం భూర్జపత్రకే**

బంగారంతో చేసిన శ్రీచక్రాన్ని జీవితాంతం పూజించవచ్చు. అంటే ఎల్లకాలమూ అర్చించ వచ్చును అని అర్థం. అలాగే వెండితో చేసిన శ్రీచక్రాన్ని ఇరవై రెండు సంవత్సరాలు, రాగితో చేసిన దాన్ని పన్నెండు సంవత్సరాలు, భూర్జరీపత్రం మీద వ్రాసిన దాన్ని ఆరు సంవత్సరాలు పూజించవచ్చును. 'లక్ష సాగరం' అనే గ్రంథంలో ఏ రకమైన శ్రీచక్రాన్ని పూజిస్తే ఏ ఫలితము వస్తుందో చెప్పబడింది.

**భూమౌసింధూర రజసారచితం సర్వకామదమ్ ।**
**సువర్ణ రచితం యంత్రం సర్వ రాజవశంకరమ్ ॥**

*రజతే నకృతం యంత్ర యాయురారోగ్య కామదమ్ ।*
*తామ్రేతురచితం యంత్రం సర్వైశ్వర్య ప్రదమ్ మతమ్ ॥*
*క్లుప్తంమరకతే యంత్రం సర్వ శత్రు వినాశనమ్ ।*
*లోహత్ర యోద్భవం యంత్రం సర్వ సద్ధి కరమ్ మతమ్॥*

నేలమీద సింధూరంతో శ్రీచక్రాన్ని గీసి పూజించినట్లైతే సర్వకార్యసిద్ధి కలుగుతుంది. బంగారంతో తయారుచేసిన శ్రీచక్రాన్ని పూజిస్తే రాజవశ్యము కలుగుతుంది. అలాగే వెండిదైతే ఆయురారోగ్య ఐశ్వర్యములు, మరకతం (పచ్చ)తో చేసిన శ్రీచక్రమైతే శత్రునాశనము, మూడు లోహములతో చేసిన శ్రీచక్రాన్ని పూజిస్తే సర్వకార్య సిద్ధి కలుగుతుంది.

ఈ రకంగా దేనితో తయారు చేసిన శ్రీచక్రాన్ని పూజించినప్పటికీ మంచి ఫలితము ఉంటుంది. అయితే శ్రీచక్రాన్ని పూజ నిష్కామ్యంగాను, లోక కల్యాణార్థము చేయటము శ్రేయస్కరము.



# 3. శ్రీచక్రము - శివశక్తి చక్రాలు

*చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః*
*శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివ యోర్వపుః*

నాలుగు శివచక్రాలతోను, ఐదుశక్తి చక్రాలతోను, వెరసి తొమ్మిది చక్రాలతో శ్రీచక్రము శివశక్తులకు నిలయమై ఉన్నది. శ్రీచక్రాన్ని గురించి శంకరభగవత్పాదుల వారు సౌందర్యలహరిలో

*చతుర్భిః శ్రీకంఠైః శివ శ్శివయువతిభిః పఞ్చభిరపి*
*ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః*
*చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ*
*త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః*

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు, తొమ్మిది మూల ప్రకృతికలతో శ్రీచక్రము విరాజిల్లుతున్నది. అయితే దీనిలో.....

*త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా*
*చతుర్దశారం చైతాని శక్తి చక్రాణి పంచచః*

కోణాకారంలో ఉన్న త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్ద శారము అనేవి శక్తి చక్రాలు. కాగా..........

*బిందుశ్చాష్ట దళం పద్మం పద్మం షోడశపత్రకం*
*చతురశ్రం చ చత్వారి శివ చక్రాణ్యనుక్రమాత్ ॥*

బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము అనేవి నాలుగు శివ చక్రాలు. శివచక్రాలకు, శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది. అది తెలిసిన వాడే చక్రవిదుడు. ఈ విషయము తెలియకుండా ఎంతకాలము జపం చేసినా మంత్రం సిద్ధించదు. లలితా త్రిశతి ఫలశృతిలో .....

*నతేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతై రపి ।*
*చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః ॥*

*నవచక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ।*
*త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా ॥*
*చతర్దశారం చైతాని శక్తి చక్రాణిపంచచః ।*
*బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్ ॥*
*చతురస్రం చ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్ ।*
*త్రికోణేబైందవం శ్లిష్టం అష్టారేష్టదళాంబుజమ్ ॥*
*దశారయో షోడశారం భూగృహం భువనాశ్రకే ।*
*శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్ ॥*
*అవినాభావ సంబంధం యో జనాతి సచక్రవిత్*
*త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపపరః శివః ॥*

శ్రీచక్రము శివశక్తుల యొక్క శరీరము. అందులోని కోణాలన్నీ శక్తి స్వరూపాలు. కాగా బిందువు, అష్టదళము, షోడశ దళము, భూపురము శివ చక్రాలు. శివ శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది.

| | | |
|---|---|---|
| త్రికోణానికి | - | బిందువుతో ఐక్యత |
| అష్ట కోణానికి | - | అష్టదళంతోఐక్యత |
| దశార యుగ్మానికి | - | షోడశదళంతో ఐక్యత |
| భూపుర త్రయానికి | - | చతుర్దశారంతో ఐక్యత. |

ఈ రకంగా శివ, శక్తి చక్రాలు ఒక దానితో ఒకటి అవినాభావ సంబంధము పొంది ఉన్నాయి. ఈ సంకేతము నెరిగినవాడే చక్రవిదుడు. శ్రీచక్రంలో శక్తి త్రికోణ రూపిణికాగా శివుడు బిందు స్వరూపుడు, శివశక్తి చక్రాల అవినాభావ సంబంధం గురించి భైరవయామళంలో.......

*త్రికోణే బైందవం శ్లిష్టమష్టారేష్ట దళాంబుజమ్ ।*
*దశారయోషోడశారం భూగృహం భువనాశ్రకే ॥*

శంకర భగవత్పాదుల వారి పరమ గురువైన గౌడపాదాచార్యుల వారు తమ 'సుభగోదయస్తుతి'లో ......

"త్రికోణే వృత్తత్రితయ, మిభకోణే వసుదళం
కళాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్ ।
చతుశ్చక్రం శైవం నివసతి భగే శాక్తికముమే
ప్రధానైక్యం షోఢాభతిచ తయోః శక్తిశివయోః ॥

అంటూ వృత్తత్రయాన్నే బిందువుగా తీసుకున్నారు. మొత్తం మీద శివశక్తి చక్రాల ఐక్యతను వివరించారు.

ఈ రకంగా శ్రీచక్రములో శివశక్తి చక్రాలు అవినాభావ సంబంధం కలిగి ఉన్నాయి. ఇదే ప్రకృతి పురుషుల కలయిక. అర్ధనారీశ్వర తత్వము, శరీరంలోని ప్రతి అణువులోనూ సగ భాగము శక్తి, మిగిలిన సగ భాగము శివుడు. అందుచే తన శక్తి యొక్క సహాయము లేకుండా శివుడు ఏ పని పూర్తి చెయ్యలేడని చెప్పబడింది.



# 4. శ్రీచక్రము - వృత్తాలు

శ్రీచక్రంలో నవావరణలున్నాయనని ముందే చెప్పటం జరిగింది. అయితే ఈ నవా వరణలలో వృత్తాలు చెప్పబడలేదు. అలాగే వృత్తాలలో ఏ దేవతలూ కూడా చెప్పబడలేదు. అసలు శ్రీ చక్రంలో వృత్తాలు ఉన్నాయా? లేదా ? అంటే హయగ్రీవ సంప్రదాయంలో అసలు వృత్తత్రయమే లేదు. ఆనంద భైరవ సంప్రదాయంలో వృత్తత్రయం ఉన్నది. దానికి పూజ మాత్రం లేదు. అనుభవంతో గనక చూసినట్లైతే వృత్తత్రయానికి పూజ ఎక్కడా కనపడదు. కాని దక్షిణామూర్తి సంప్రదాయంలో వృత్తత్రయానికి పూజ ఉన్నది అని చెప్పబడింది. ఆ పూజ ఏ రకంగా ఉన్నదో మాత్రం తెలియలేదు.

**వృత్తాలు ఎన్ని ? :** శ్రీచక్ర లేఖనంలో కోణాలు గియ్యటానికి వృత్తము అవసరం లేదు. ఒక వృత్తము గీసి అందులోనే శివశక్తి కోణాలు గియ్యటం జరుగుతుంది. ఈ విషయన్ని శ్రీచక్ర లేఖనంలో వివరించటం జరిగింది. అంటే ఇందులో త్రికోణము, అష్టకోణము, దశార యుగ్మము, చతుర్దశారము వస్తాయి. దీనిని బట్టి చతుర్దశారము వెలుపల ఒక వృత్తము గీసి అందులో అష్టదళము, ఇంకొక వృత్తము గీసి షోడశ దళము ఏర్పాటు చేయటం జరుగుతుంది. ఈ రకంగా శ్రీచక్రంలో మూడు వృత్తాలు ఉన్నాయని చెప్పబడింది. "**వృత్త త్రయంచ** " అని చెప్పే శ్లోకాలు ఈ విషయాన్ని నిర్ధారిస్తున్నాయి. శంకరాచార్యులు, గౌడపాదులు, లొల్లా లక్ష్మీధరుడు, భాస్కరాచార్యులు మొదలైన వారంతా శ్రీచక్రంలో మూడు వృత్తాలు ఉన్నాయనే చెబుతున్నారు. అయితే కొన్నిచోట్ల మాత్రం ప్రతి ఆవరణకూ ఒక వృత్తం చొప్పున శ్రీచక్రంలో ఎనిమిది వృత్తాలు ఉన్నాయని చెప్పబడింది. దానికి అనుగుణంగానే శ్రీచక్రం మేరువును పరీక్షించినట్లైతే ఎనిమిది వృత్తాలు కనిపిస్తాయి. ఈ రకంగా వృత్తాలు ఏర్పాటు చేసుకున్నట్లైతే ఆవరణలలోని కోణాలు, పద్మాలు చెక్కటం తేలిక. అందుచేతనే శ్రీచక్రంలోని వృత్తాలు దాని తయారులో సులువు కోసం ఏర్పాటయినవే కాని వేరుకాదని కొందరంటారు. అయితే పండితాభిప్రాయాన్ననుసరించి శ్రీచక్రంలో మూడు వృత్తాలు మాత్రమే ఉంటాయి.

**వృత్తాలు ఎక్కడ ఉంటాయి ?** శ్రీచక్రంలో వృత్తాలయితే మూడున్నాయి అని రూఢి అయింది. కాని అవి ఎక్కడ ఉంటాయనే విషయంలోనే బేధాభిప్రాయాలున్నాయి. కొన్ని తంత్రాల ప్రకారం మూడు వృత్తాలు ఒకే చోట, అంటే షోడశ దళానికీ, భూపురానికీ మధ్యన

ఉంటాయి. మరి కొన్నిటి ప్రకారము చతుర్దశారము తరువాత ఒకటి, అష్టదళము తరువాత ఒకటి, షోడశదళము తరువాత ఒకటి ఉంటాయి. ముందుగా వృత్తాలు మూడు ఒకే చోట ఉన్నాయనటానికి ఆధారాలు పరిశీలిద్దాం.

*బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ*
*మన్వశ్రదళ సంయుత షోడశారమ్*
*వృత్తత్రి భూపురయుతం పరిత శ్చతుర్ద్వాః*
*శ్రీచక్రమేత దురితం పరదేవతాయాః*

ఈ శ్లోకం ప్రకారము వృత్తాలు మూడూ షోడశ దళానికీ, భూపురానికీ మధ్యన ఉన్నాయి. శంకరభగవత్పాదుల వారు తమ 'సౌందర్యలహరి'లో ఈ విధంగా అన్నారు.

*చతుర్భి శ్శ్రీకణ్ఠై శ్శివయువతిభిః పఞ్చభిరపి*
*ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః*
*చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ*
*త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః ॥*

దీని ప్రకారము కూడా వృత్తాలు భూపురము, షోడశ దళముల మధ్యనే ఉంటాయి.

గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలో శ్రీచక్రాన్ని వివరిస్తూ ఈ విధంగా చెప్పారు.

*త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ*
*ర్దశారం భూ గేహాదపిచ భువనాశ్రం సమభవత్*
*తతో ఽభూన్నాగారం నృపతిదల మస్మా స్త్రివలయం*
*చతుర్ద్వాః ప్రాకారత్రితయ మిదమేవాంబ శరణమ్ ॥*

దీని ప్రకారం కూడా వృత్తాలు మూడూ ఒకేచోట ఉంటాయి. శ్రీచక్రన్యాసంలో .....

*బైందవం బ్రహ్మ రంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్*
*లలాటేష్టారపత్రం చ భృవోర్మధ్యే దశారకమ్*
*బహిర్దశారంకంఠేతు హృదయే చతుర్దశారకమ్*
*నాభౌచవసు పత్రం చ కట్యాం షోడశ పత్రకమ్*
*వృత్తత్రయం చ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్ ॥*

అని చెప్పటం జరిగింది. అంటే మానవ శరీరంలోని ....

| | | |
|---|---|---|
| బ్రహ్మరంధ్రము | - | బిందువు |
| తల ముందు భాగము | - | త్రికోణము |
| లలాటము | - | అష్టకోణము |
| భ్రూమధ్యము | - | అంతర్దశారము |
| కంఠము | - | బహిర్దశారము |
| హృదయము | - | చతుర్దశారము |
| నాభి | - | అష్ట దళము |
| కటి | - | షోడశ దళము |
| ఊరువులు | - | వృత్త త్రయము |
| పాదములు | - | భూపురము |

ఈ రకమైన ఆధారాల వలన వృత్తత్రయము శ్రీచక్రంలో భూపురానికీ, షోడశ దళానికీ మధ్యన ఉంటుంది. అని నిర్ధారించటమైంది.

అయితే ఈ వృత్తాలు మూడూ విడివిడిగానే ఉన్నాయని చెప్పటానికి కూడా తగినంత ఆధారం ఉన్నది. ప్రపంచ సార సంగ్రహములో ఈ విధంగా ఉంది.

*బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతం ।*
*వసుదళవృత్త, కళాదళవృత్త త్రిమహీగృహం భజే చక్రమ్ ॥*

దీనిని. బట్టి చతుర్దశారము తరువాత ఒకటి, అష్ట దళము తరువాత ఒకటి, షోడశ దళము తరువాత ఒకటి వృత్తాలు ఉన్నాయని తెలుస్తోంది. అలాగే శ్రీచక్ర న్యాసంలో ఈ విధంగా ఉన్నది.

*కుక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యామష్టదళాంబుజమ్*
*కట్యాం ద్వితీయవలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్*
*తస్యాధస్తాత్ తృతీయం, మూలధారే చతురస్రకం*

| | | |
|---|---|---|
| కుక్షి భాగము | - | ప్రథమ వృత్తము |
| నాభి | - | అష్ట దళము |
| కటి | - | ద్వితీయ వృత్తము |
| స్వాధిష్ఠానము | - | షోడశ దళము |

స్వాధిష్ఠానము క్రింది భాగము - తృతీయ వృత్తము

మూలాధారము - చతురస్రము

దీన్ని బట్టి వృత్తాలు విడివిడిగానే ఉన్నాయని చెప్పబడుతోంది.

అలాగే శ్రీచక్రాన్ని వివరిస్తూ మానవ దేహంలోని రుద్ర గ్రంధి, విష్ణు గ్రంధి, బ్రహ్మ గ్రంధులే వృత్తత్రయము అని చెప్పబడింది. గ్రంధిత్రయము విడివిడిగానే ఉంటుంది. కాబట్టి శ్రీచక్రంలోని వృత్తాలుకుడా విడివిడిగానే ఉండాలి అని వీరి వాదన.

శ్రీచక్రంలోని వృత్తాలు ఎన్ని ఉన్నప్పటికీ, అవి ఎక్కడ ఉన్నప్పటికీ వాటిని నవావరణలలో చేర్చలేదు. వృత్తాలలో ఉండే దేవతల పేర్లు కూడా చెప్పబడలేదు. చక్రార్చనలో ఎక్కడా వృత్తాలకు పూజ కూడా లేదు. అయితే శంకర భగవత్పాదుల సంప్రదాయంలోని వారంతా వారు చెప్పినట్లే వృత్తాలను షోడశ దళము, భూపురాల మధ్యనే ఏర్పాటు చేస్తున్నారు.

శ్రీచక్రంలోని వృత్తాలలో వివిధ దేవతలున్నారని 'శ్రీవిద్యా విలాసం' అనే గ్రంథంలో చెప్పబడింది. ప్రథమ వృత్తంలో ఏడుగురు దేవతలుంటారు. వారు ....

1) శంకరీ, 2) ఇందుశేఖరీ, 3) అర్ధనారీశ్వరీ, 4) అఘోరస్వరూపిణీ, 5) హనదహనయనా, 6) హాలాహలధారిణీ, 7) భూరిభవా.

ద్వితీయ వృత్తంలో పన్నెండుమంది దేవతలున్నారు. వారు ........

1) నారాయణా, 2) త్రివిక్రమా, 3) కేశవా, 4) మాధవా, 5) గోవిందా, 6) దామోదరా, 7) మధుసూదనా, 8) వామనా, 9) శ్రీధరా, 10) హృషీకేశా, 11) పద్మనాభా, 12) కమలనయనా.

తృతీయ వృత్తంలో పన్నెండు మంది దేవతలున్నారు. వారు ..........

1.) చతుర్ముఖా, 2) చతురాననా, 3) చతురాంగీ, 4) చతురశ్రా, 5) చతురశ్రగేహినీ, 6) చతుర్దశ, ఫలప్రదా, 7) త్రయీమయి, 8) త్రిముఖదేవీ, 9) త్రికమలా, 10) త్రిరేఖా, 11) త్రిగుణా, 12) త్రిమూర్తిదేవీ.

ఏది ఏమైనప్పటికీ, వృత్తాలు నవావరణలలో చేర్చబడలేదు. వాటిలో ఏ దేవతలు లేరు. వాటికి పూజ కుడా లేదు. కాబట్టి గురు సంప్రదాయాన్ననుసరించి వృత్తాలను ఏర్పాటు చేయటమనేది ఉత్తమము అని గ్రహించగలరు.

# 5. నాద బిందు ఐక్యత

గౌడపాదులవారు తమ యొక్క సుభగోదయస్తుతిలోని 46వ శ్లోకంలో ....

*అధిష్ఠానాధార ద్వితయ మిదమేవం దశ దళం*
*సహస్రారాజ్ఞాంతం మణిపురమతో భూద్దశదళమ్ ।*
*హృదంభోజాన్మూలా నృపదళమభూత్వాంత కమలం*
*తదేవైకో బిందుర్భవతి జగదుత్పత్తి కృదయమ్ ॥*

శ్రీచక్రంలో నాలుగు శివచక్రాలు, ఐదుశక్తి చక్రాలు వెరసి తొమ్మిది చక్రాలు ఉంటాయి. అలాగే మానవ శరీరంలో షట్చక్రాలుంటాయి. ఈ షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యతనే 'నాదబిందు ఐక్యత' అంటారు. నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాల సమూహము.

1. ఆధార చక్రానికి నాలుగు దళాలుంటాయి. దాని కర్ణిక త్రికోణము
2. స్వాధిష్ఠానానికి ఆరు దళాలుంటాయి. దాని కర్ణిక అష్టకోణము.
3. మణిపూర చక్రానికి పది దళాలుంటాయి. దాని కర్ణిక అంతర్దశారము.
4. అనాహతానికి పన్నెండు దళాలుంటాయి. దాని కర్ణిక బహిర్దశారము.
5. విశుద్ధి చక్రానికి పదహారు దళాలుంటాయి. దాని కర్ణిక చతుర్దశ కోణము.
6. ఆజ్ఞా చక్రానికి రెండు దళాలుంటాయి. దాని కర్ణిక ఒకచోట అష్ట దళము, ఒక చోట షోడశ దళము.
7. శ్రీచక్రంలోని మూడు వృత్తాలూ రుద్రగ్రంధి, విష్ణుగ్రంధి, బ్రహ్మగ్రంధి రూపంలో ఉంటాయి. వీటన్నింటికీ పైన చతుర్ద్వారాలు గల భూపురమున్నది. దాని కర్ణిక సహస్ర దళ పద్మము. దీని మధ్యన బైందవ స్థానమున్నది. ఇదే జగదుత్పత్తికి హేతువు. 'రుద్రయామళం'లో .....

*త్రికోణమష్టకోణం చ దశకోణ ద్వయం తథా ।*
*మనుకోణం చతుష్కోణం కోణచక్రాణి షట్క్రమాత్ ॥*
*మూలాధారం తథా స్వాధిష్ఠానం చ మణిపూరకమ్ ।*
*అనాహతం విశుద్ధాఖ్య మాజ్ఞాచక్రం విదుర్బుధా ॥*

త్రికోణము మొదలైన చక్రాలన్నీ ఆధారాది షట్చక్రాలతో ఐక్యత పొందుతున్నాయి. శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలూ మానవ దేహంలోని షట్చక్రాలు ఈక్రింది విధంగా ఉంటాయి.

| **శ్రీచక్రంలో తొమ్మిది చక్రాలు** | | **షట్చక్రాలు** |
|---|---|---|
| 1. బిందువు, త్రికోణము | - | మూలాధారము |
| 2. అష్టకోణము | - | స్వాధిష్ఠానము |
| 3. అంతర్దశారము | - | మణి పూరము |
| 4. బహిర్దశారము | - | అనాహతము |
| 5. చతుర్దశారము | - | విశుద్ధి చక్రము |
| 6. అష్ట దళము, షోడశ దళము | - | ఆజ్ఞా చక్రము |
| 7. భూపురము | - | సహస్రారము |

*త్రికోణం చాధారం త్రిపుర వినుతేష్టారమనఘే ।*
*భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారమ్ మణిపురమ్ ॥*
*దశారంతే సంవిత్కమల మథ మన్వస్రక్రముమే ।*
*విశుద్ధం స్యాదాజ్ఞా శివ ఇతి తతో బైందవ గృహమ్ ॥*

శ్రీచక్రంలోని చక్రాలకూ, షట్చక్రాలకూ ఐక్యత ఈ విధంగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| 1. ఆధార చక్రానికి | - | త్రికోణంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | - | అష్ట కోణంతోఐక్యత |
| 3. మణిపూరానికి | - | అంతర్దశారంతో ఐక్యత |
| 4. అనాహతానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధ చక్రానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 6. ఆజ్ఞా చక్రానికి | - | అష్ట దళము, షోడశ దళములతో ఐక్యత. |
| 7. సహస్రారానికి | - | చతుర్ద్వార సహితమైన భూపురంతో ఐక్యత. |
| వృత్త త్రయము | - | బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధి. |

శ్రీచక్రంలోని నవావరణలకూ, షట్చక్రాలకూ ఐక్యత సమయ, కౌళమతాలలో విడివిడిగా చెప్పబడుతోంది. కౌళమతస్తుల ప్రకారము త్రికోణము ఆధార చక్రంలో ఉంటుంది. కాని సమయ మతస్తుల ప్రకారము ఆజ్ఞా చక్రంలో త్రికోణముంటుంది. వీరి ప్రకారము నాదబిందు ఐక్యత ఈ విధంగా ఉంటుంది.

1. మూలాధారానికి - భూపురంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి - చతుర్దశారంతో ఐక్యత
3. మణిపూరానికి - బహిర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - అంతర్దశారంతోఐక్యత
5. విశుద్ధచక్రానికి - అష్ట కోణంతో ఐక్యత
6. ఆజ్ఞా చక్రానికి - త్రికోణంతో ఐక్యత
7. సహస్రారానికి - బిందువుతో ఐక్యత
8. గ్రంధిత్రయానికి - వృత్త త్రయముతో ఐక్యత

ఈ రకంగా శ్రీచక్రంలోని నవావరణలకూ, షట్చక్రాలకూ ఐక్యత ఉన్నది. సాధకుడు కుండలినీ శక్తిని నిద్ర లేపి, షట్చక్ర భేదనం గనక చేసినట్లైతే ఆ శక్తి సహస్రారం చేరి సాధకుడికి ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది.



# కౌళమతానుసారము శ్రీచక్రము - షట్చక్రాల ఐక్యత




మూలాధార కమలము




స్వాధిష్ఠాన కమలము



మణిపూర కమలము



అనాహత కమలము



విశుద్ధ కమలము



ఆజ్ఞా కమలము

# సమయ మతానుసారము శ్రీచక్రము షట్చక్రాల ఐక్యత




మూలాధార కమలము




స్వాధిష్ఠాన కమలము



మణిపూర కమలము



అనాహత కమలము



విశుద్ధ కమలము




ఆజ్ఞా కమలము

# శ్రీచక్రము - మానవదేహము

శ్రీ అంటే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల స్వరూపము. చక్రము అంటే యంత్రము లేదా నివాసస్థానము. మొత్తం మీద శ్రీచక్రము అంటే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల యొక్క స్వరూపమైన ఆ పరాభట్టారిక యొక్క సామ్రాజ్యము లేదా నివాసస్థానము. మానవదేహము నవధాతువుల వలన నిర్మితమైంది. వాటిలో ఐదు శక్తి ధాతువులు కాగా నాలుగు శివధాతువులు. కామికాతంత్రంలో చెప్పినట్లుగా.....

*త్వగ స్సృజ్మాంస మేధోఽ స్థిధాతవ శ్శక్తి మూలకాః ।*
*మజ్జా, శుక్ల, ప్రాణ, వీర్య ధాతవ శ్శివమూలకాః ॥*

పై శ్లోకాన్ని బట్టి చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు అనేవి శక్తి ధాతు మూలకాలు. మజ్జ, శుక్లము, ప్రాణము, జీవము శివధాతువులని చెప్పబడుచున్నవి.

*నవధాతురయం దేహో నవయోని సముద్భవః ।*
*దశమీయోని రేకైవ పరాశక్తి స్తదీశ్వరీ॥*

అనే ఈశ్వర వచనాన్ని బట్టి మానవదేహము నవయోనుల వలన పుట్టి, నవధాతుమయమై ఉన్నది. దీనిలో పదవ యోని ఆ పరమేశ్వరియే. శ్రీచక్రంలో ఉన్న తొమ్మిది చక్రాలు, మానవదేహంలోని తొమ్మిది ధాతువులకు ప్రతీకలు. అంతే కాకుండా మానవ దేహంలో నవరంధ్రాలున్నాయి. అలాగే శ్రీచక్రంలో నవావరణలున్నాయి. అందుచేతనే శ్రీచక్రానికీ మానవదేహానికీ సామ్యము చెప్పబడింది. శ్రీచక్రంలోని నవావరణలను, మానవదేహంలోని వివిధ అవయవాలతో పోల్చటం జరిగింది.

*బైందవమ్ బ్రహ్మరంధ్రం చ, మస్తకం చ త్రికోణకమ్*
*లలాటేష్టారపత్రం చ, భృవోర్మధ్యే దశారకమ్*
*బహిర్దశారం కంఠే చ మన్వశ్రం హృదయం భవేత్*
*నాభౌచ, వసుపత్రంచ, కట్యాం షోడశపత్రకమ్*
*వృత్తత్రయం చ ఊరుభ్యాం, పద్భ్యాం భూపురత్రయమ్॥*

శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు, మానవదేహంలోని వివిధ భాగాలతో ఈ క్రింది విధంగా సమన్వయం చెయ్యబడ్డాయి.

| | | |
|---|---|---|
| బిందువు | - | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | - | తలముందుభాగము |
| అష్టారము (అష్టకోణము) | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |
| అష్టదళము | - | నాభి |
| షోడశదళము | - | కటి ప్రదేశము |
| వృత్తత్రయము | - | ఊరువులు |
| భూపురము | - | పాదాలు |

అయితే కొన్ని తంత్రాల ప్రకారము ఈ సమన్వయం వేరుగా ఉంది.

*శ్రీచక్రం బ్రహ్మరంధ్రేతు, సువృత్తం చ త్రికోణకమ్*
*లలాటేష్టారకం చక్రం, భృవోర్మధ్యే దశారకమ్*
*బహిర్దశారం కంఠేతు, మన్వస్రం హృదయే భవేత్*
*కుక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యామష్టదళాంబుజమ్*
*కట్యాం ద్వితీయం వలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్*
*తస్యా ధస్తాత్ తృతీయం, మూలాధారే చతురశ్రకం*
*ద్వితీయం భూపురంజంఘే, తృతీయం వామజంఘకే*
*త్రిపురే శ్రీమహాయంత్రం సృష్టి న్యాసవిధిక్రమాత్ ॥*

| | | |
|---|---|---|
| బిందువు, త్రికోణము | - | బ్రహ్మరంధ్రము |
| అష్టకోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |
| ప్రథమవృత్తము | - | కుక్షి |

| | | |
|---|---|---|
| అష్టదళము | - | నాభి |
| ద్వితీయవృత్తము | - | కటిప్రదేశము |
| షోడశదళము | - | స్వాధిష్ఠానము |
| తృతీయవృత్తము | - | స్వాధిష్ఠానానికి క్రిందిభాగము |
| చతురస్రంలోని ప్రథమరేఖ | - | మూలాధారము |
| చతురస్రంలోని ద్వితీయరేఖ | - | కుడిపిక్క |
| చతురస్రంలోని తృతీయరేఖ | - | ఎడమపిక్క |

ఈ రకంగా శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు మానవదేహంలోని వివిధ భాగాలతో సమన్వయం చెయ్యబడ్డాయి. మానవ దేహము తొమ్మిది ధాతువులతోకూడి ఉన్నది. వీటినే యోనులు అంటారు. శ్రీచక్రము తొమ్మిది చక్రముల సమూహమై ఉన్నది. అందుకే శ్రీచక్రాన్ని 'నవయోన్యాత్మకము' అంటారు. ఈ నవయోనులు నవధాతువులకు ప్రతీకలు.

మానవదేహంలో జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, మనస్సు మొత్తం పదకొండు ఇంద్రియాలు ఉన్నాయి. పరబ్రహ్మ స్వరూపుడైన ఈశ్వరుడు లోకాలను ఉద్ధరించాలనే ఉద్దేశ్యంతో, తానే స్త్రీ పురుషులుగా, గురుశిష్యులుగా రూపాంతరం చెంది శ్రీవిద్యను దేవికి ఉపదేశిస్తూ ఇలా అన్నాడు.

***శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ!***
***పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మకమేవ చ॥***
***ఇంద్రియాత్మకమేవం చ, మనస్తత్త్వాత్మకం తథా***
***మాయాది తత్త్వ రూపం చ, తత్త్వాతీతం చ బైందవమ్॥***

ఇక్కడ శ్రీచక్రము బ్రహ్మాండముతో పోల్చబడింది. ఈ చరాచరజగత్తు అంతా శ్రీచక్రంలో ఇమిడి ఉన్నది. సృష్టికి పంచభూతాలు, తన్మాత్రలు మూలమై ఉన్నాయి. వాటియొక్క తత్త్వాలు శ్రీచక్రంలో చేర్చబడ్డాయి. ఈ రకంగా శ్రీచక్రం విశాల విశ్వంతో పోల్చబడింది. అలాగే మానవదేహంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండు ఇంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలో చేర్చబడటంచేత శ్రీచక్రము మానవదేహంతో పోల్చబడినది. అందుకనే శ్రీచక్రపూజ చేసినట్లైతే, ఈచరాచర జగత్తునూ, విశ్వమానవాళినీ కూడా పూజించినట్లే.

# 6. శ్రీచక్రము - ప్రస్తారాలు

శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలు ఉంటాయని ముందే చెప్పటం జరిగింది. ఈ విధంగా నవావరణలతో కూడిన శ్రీచక్రాన్ని వివిధ రూపాలలో తయారు చేస్తారు. ఆ రూపాలనే ప్రస్తారములు అంటారు. శ్రీచక్రాన్ని ఎన్ని రకాలుగా తయారు చేయవచ్చు? అన్నప్పుడు 'శ్రీవిద్యార్ణవ తంత్రం'లో ఈ విధంగా చెప్పబడింది.

**ప్రస్తారోత్రిధా ప్రోక్తః శ్రీచక్రస్య తథేశ్వరీ ।**
**మేరుకైలాస భూ సంజ్ఞా భేదాస్య త్రిధాభవేత్ ॥**

పరమేశ్వరుడు ఆ యొక్క పరమేశ్వరికి శ్రీచక్రంలోని ప్రస్తారములను వివరిస్తూ ఇలా అంటున్నాడు. ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రములోని ప్రస్తారములను మూడు విధాలుగా చెప్పటం జరిగింది. అవి 1) భూ ప్రస్తారము, 2) మేరు ప్రస్తారము, 3) కైలాస ప్రస్తారము.

అయితే ఈ ప్రస్తార నిర్ణయము జరిగేది కేవలము శ్రీచక్రము యొక్క ఆకారంతో మాత్రమే కాదు. అందులో తాదాత్మ్యం చెందే దేవతలను బట్టి చెప్పబడుతోంది.

**మేరు ప్రస్తారకం యంత్రం నిత్యా తాదాత్మ్యకం స్మృతం**
**మాతృకాయస్తు కైలాస ప్రస్తారాఖ్యాం సురేశ్వరీ ।**
**భూప్రస్తారం మహాదేవి వశిన్యాత్మక ముత్తమమ్ ॥**

మేరు ప్రస్తారంలో షోడశ నిత్యలు తాదాత్మ్యం చెందుతాయి. కైలాస ప్రస్తారంలో మాతృకలు అంటే అక్షరములు తాదాత్మ్యం చెందుతాయి. భూప్రస్తారంలో వశిన్యాది దేవతలు తాదాత్మ్యం చెందుతాయి. ఇప్పుడు వీటిని వివరంగా చూద్దాం.

## 1. భూప్రస్తారము

ఇది నేలమీద బల్ల పరుపుగా ఉండే శ్రీచక్రము. దీన్ని బంగారము, వెండి, రాగి, లోహత్రయములతో చేసిన రేకుల మీదగాని, పట్టు వస్త్రము, భూర్జరీ పత్రము, కాగితముల మీద గాని వ్రాసిన శ్రీచక్రాన్ని భూప్రస్తారమంటారు. 'భూప్రస్తారం మహాదేవీ వశిన్యాత్మకముత్తమమ్'. దీనిలో వశిన్యాది దేవతలతాదాత్మ్యముంటుంది. అనగా వశిన్యాది దేవతలు ఎనిమిది మంది, యోగినులు పన్నెండు వెరసి ఇరవై మందిని దశారయుగ్మంలో

చూపటమే భూప్రస్తారంలోని విశేషము. అలాగే షోడశ నిత్యలలో ఇద్దరు, వశిన్యాది దేవతలలో ఒకరు చొప్పున అష్టకోణంలో అంతర్భావం చెందుతాయి. అంతేకాకుండా వశిన్యాది దేవతలు ఎనిమిది మంది, నిత్యలు పదహారు, యోగినులు పన్నెండు, వర్గులు ఎనిమిది (అ క చ ట త ప య శ) మొత్తం నలభై నాలుగు. వీటిలో మహా త్రిపురసుందరి బిందువు నందు, మిగిలిన నలభై మూడు శ్రీచక్రంలోని కోణములయందు అంతర్భావం చెందుతాయి. ఆకర్షణ దేవతలలో రూపాకర్షిణి, రసాకర్షిణి, స్పర్శాకర్షిణి, గంధాకర్షిణిలు శ్రీచక్రంలోని భూపురంలో నాలుగు ద్వారముల యందు ఉంటాయి.

ఇప్పుడు పైన చెప్పిన దేవతల వివరాలు చూద్దాం. ఖడ్గమాలలో ఇవి చెప్పబడ్డాయి.

**వశిన్యాది దేవతలు :**

| | | | |
|---|---|---|---|
| 1. వశిని | 2. కామేశ్వరి | 3. మోదిని | 4. విమల |
| 5. అరుణ | 6. జయిని | 7. సర్వేశ్వరి | 8. కౌళిని |

**షోడశ నిత్యలు :**

***శృణుదేవీ మహాజ్ఞానం నిత్యా షోడశకం తవ***
***ఏత ద్విజ్ఞాన మాత్రేణ శ్రీవిద్యా ఫలం లభేత్.***

పరమేశ్వరుడు షోడశ నిత్యలను వివరిస్తున్నాడు. వీటిని గురించి అనేక చోట్ల చెప్పబడింది. సామాన్యంగా దేవీ భక్తులు నిత్యం పఠించే వామకేశ్వర తంత్రంలోని ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

***కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నే, భేరుండే, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతే, త్వరితే, కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే, సర్వమంగళే, జ్వాలామాలినీ, చిత్రే, మహానిత్యే, పరమేశ్వర పరమేశ్వరి.***

ఇక్కడ నిత్యా దేవతల పేర్లు తెలుస్తూనే ఉన్నాయి. కాబట్టి మళ్ళీ విడిగా చెప్పటం లేదు. వీటిలో మహా త్రిపుర సుందరి ఆఖరున చెప్పబడింది. 'వసిష్ఠసంహిత'లో....

***శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ ।***
***న కస్య చిన్మయా ఽ ఖ్యాతం సర్వ మంత్రేషు గోపితం ॥***

ఓ పార్వతీ ! అతి రహస్యమైనటువంటి నిత్యా దేవతల వివరాలు నీకు చెబుతున్నాను. వినవలసినది.

*తత్రాదౌ ప్రథమా నిత్యా మహాత్రిపురసుందరీ*
*తతః కామేశ్వరీ నిత్యా నిత్యా చ భగమాలినీ*
*నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్ని వాసినీ*
*మహా విద్యేశ్వరీ, రౌద్రీ త్వరితా కులసుందరీ*
*నిత్యా నీలపతాకా విజయా సర్వ మంగళా*
*జ్వాలా మాలిని చిద్రూపా ఏతాని త్యాస్తు షోడశః*

ఇక్కడ మొదటి నిత్య మహా త్రిపుర సుందరిగా చెప్పబడింది. మహా వజ్రేశ్వరీ అనబడే నిత్యాదేవినే మహా విద్యేశ్వరి అని, చిత్రాదేవిని చిద్రూపా అని చెప్పబడింది. అని పాఠకులు గ్రహించగలరు.

**యోగినులు :**

యోగినులు పన్నెండు మంది.

*విద్యా చ రేచికా చైవ యోచికాత్వమృతాతథా।*
*దీపికా జ్ఞాన మాప్యాయ వ్యాపినీ మేధినీ తథా ॥*
*వ్యోమ రూపా సిద్ధరూపా చ లక్ష్మీయోగినీ థా ।*
*ఏతద్వాదశ యోగిన్యః భూప్రస్తారోస్తితిర్భవేత్ ॥*

1) విద్యా యోగిని, 2) రేచికా యోగిని, 3) యోచికా యోగిని, 4) అమృతా యోగిని, 5) దీపికా యోగిని, 6) జ్ఞాన యోగిని, 7) అప్యాయ యోగిని, 8) వ్యాపినీ యోగిని, 9) మేధా యోగిని, 10) వ్యోమ రూపాయోగిని, 11) సిద్ధ రూపాయోగిని, 12) లక్ష్మీయోగిని.

వీరందరూ కూడా పైన చెప్పినట్లుగా భూప్రస్తారంలో అంతర్భావం చెందుతారు.

శ్రీచక్రాన్ని మూడు రకాలుగా పూజిస్తారు. 1) సృష్టి క్రమము 2) స్థితి క్రమము 3) సంహార క్రమము. అయితే ఈ మూడు పూజలూ ఒకే శ్రీచక్రం మీద చేయరాదు.

*భూప్రస్తారే మహేశాని స్థితి పూజా మహోత్తమా ।*

భూ ప్రస్తారం మీద స్థితి పూజ మహా ఉత్తమమైనది. స్థితి పూజ అంటే శ్రీచక్రంలో అష్ట దళముతో ఆరంభించి భూపురానికి, తరువాత మన్వస్రము దగ్గర నుండి బిందువు వరకు పూజించటము. 'స్థితి క్రమో గృహస్తస్య' అనటం చేత ఈ పూజను గృహస్తులు మాత్రమే చెయ్యాలి.

'శక్తి సంగమ తంత్రం'లో శ్రీచక్రాన్ని వివరిస్తూ ......

**భూప్రస్తారోద్వివిధా దేవీ పాతాళోర్ధ్వ క్రమేణతు.**

అని చెప్పబడింది. అంటే భూప్రస్తారము మళ్ళీ రెండు విధాలుగా ఉంటుంది. 1. పాతాళ భూప్రస్తారము. 2) ఊర్ధ్వ భూప్రస్తారము

1. పాత భూప్రస్తారము అంటే రాగి, వెండి, బంగారము మొదలైన వాటితో చేసిన రేకు ఏదైనా తీసుకుని సన్నని ములికివంటి దానితో ఆ రేకు మీద శ్రీచక్రం గీసినట్లైతే, మొత్తం గాడిలాగా పడుతుంది. అంటే మిగిలిన రేకుకన్న రేఖలు లోతుగా ఉంటాయి. మనం సామాన్యంగా చూసే భూ ప్రస్తారాలు ఈ కోవకు చెందినవే.

2. ఊర్ధ్వ భూప్రస్తారము. దీనిలో మిగిలిన రేకుకన్న గీతలు ఎత్తుగా ఉంటాయి. అనగా నేల మీద పిండితో గాని, కుంకుమ, సింధూరాలతో గాని శ్రీచక్రాన్ని గీసినట్లైతే మిగిలిన భాగం కన్న రేఖలు ఎత్తుగా ఉంటాయి. ఇలాంటి చక్రాలు రాగి మొదలైన రేకులతో చేయటం చాలా అరుదు. ఇవి పోతపోసినట్లుంటాయి. మద్రాసు ప్రాంతంలో ఈ రకమైన శ్రీచక్రాలు దొరుకుతాయి.

## 2. మేరు ప్రస్తారము

ఇది శంఖం ఆకారంలో ఉంటుంది. అంటే ముందుగా భూప్రస్తారము, తరువాత షోడశ దళము ఆ పైన అష్టదళము ఒక దాని కన్న ఒకటి కొంచెం ఎత్తుగా బిందువు వరకూ ఉంటాయి. దీనిని తయారు చేసేటప్పుడు పొడవు, వెడల్పు, ఎత్తు ఒకే కొలత ఉండేటట్టు చూడాలి. ఉదాహరణకు ఐదు అంగుళాల శ్రీచక్రము అంటే పొడవు వెడల్పు ఎత్తు కూడా ఐదు అంగుళాలే ఉంటుంది. క్రొత్తగా చూసేవారికి ఇది దేవాలయ గోపురంలాగా కనిపిస్తుంది.

**మేరు ప్రస్తారకం యంత్రం నిత్యా తాదాత్మ్యకం స్మృతం**

మేరుప్రస్తారంలో షోడశ నిత్యల తాదాత్మ్యము చెప్పబడింది. ఇక్కడ షోడశ నిత్యలు అష్ట వర్గ స్వరూపాలై, అష్టదళ పద్మంలోని ఎనిమిది దళాలలోనూ ఉంటాయి. అలాగే అష్ట కోణంలోతూర్పు నుండి ఒక్కొక్క కోణానికి ఇద్దరు చొప్పున అంతర్భావం పొందుతున్నాయి. షోడశ నిత్యలే షోడశ దళంలోనూ, దశారయుగ్మంలోనూ కూడా ఉంటాయి. వీటిలో మొదటి రెండు నిత్యలూ త్రికోణము, బిందువు రూపాలలో ఉంటాయి. మిగిలిన పద్నాలుగు నిత్యలు

చతుర్దశ కోణంలో ఉంటాయి. ఈ రకంగా శ్రీచక్ర విద్యకు నిత్యలు అంగములై ఉంటాయి. ఈ విధంగా నిత్యా దేవతలు తాదాత్మ్యము చెందిన శ్రీచక్రాన్ని మేరుప్రస్తారము అంటారు. శ్రీచక్రార్చన చేసేటప్పుడు 'సృష్టిక్రమమం మేరుచక్రం' అని చెప్పటం చేత మేరువు సృష్టి క్రమంలో ఉంటుందని తెలుస్తోంది. పూజా విధానంలో .....

**మేరుచక్రేతు సంహారక్రమ పూజా న విద్యతే ।**
**సృష్టిక్రమేణ దేవేశి పూజనీయం ప్రయత్నతః ॥**

అని శ్రీవిద్యార్ణవ తంత్రంలో చెప్పబడింది. దీని ప్రకారము మేరువుకు సంహార క్రమంలో పూజ పనికి రాదు. సృష్టి క్రమంలోనే మేరువును పూజించాలి. సృష్టి క్రమము అంటే బిందువు నుంచి మొదలుపెట్టి భూపురము వరకు నవావరణలను అర్చించటము.

'శక్తి సంగమతంత్రం'లో....

**కైలాసాఖ్యస్తు ప్రస్తారో ద్వివిధ పరికీర్తితః ।**
**అర్ధకైలాస సంజ్ఞస్తు పూర్ణ కైలాసక స్తథా ।**
**తదైవ మేరుప్రస్తారః కీర్తితస్తు మయాతవ ॥**

కైలాసప్రస్తారాన్ని 1) అర్ధ కైలాసము, 2) పూర్ణ కైలాసము అని రెండు రకాలుగా విభజించారు. అలాగే మేరుప్రస్తారము కూడా విభజించబడినదని అని చెప్పబడింది. దీనిని బట్టి మేరుప్రస్తారము రెండు విధాలుగా ఉంటుంది. 1) పూర్ణ మేరువు. 2) అర్ధ మేరువు.

1) పూర్ణమేరువు అంటే భూపురం దగ్గర నుండి బిందువు వరకు తొమ్మిది ఆవరణలు ఒక దానిపై భాగంలో ఒకటి చొప్పున ఎత్తుగా ఉంటాయి.

2) అర్ధమేరువు అంటే భూపురం నుంచి అష్టదళము వరకు ఒకదానిపైన ఒకటి ఉంటాయి ఆ తరువాత కోణాలన్నీ అష్టదళం పైభాగంలో బల్లపరుపుగా ఉంటాయి. శ్రీచక్రార్చనలో మేరువును సృష్టి క్రమంలో పూజించాలి అని చెప్పబడింది కాని .....

**"కైలాసంచార్ధ మేరుకమ్ సంహారాఖ్యం మహేశాని"**

అని చెప్పటంవల్ల అర్ధమేరువును కూడా సంహార క్రమంలోనే పూజించాలి అని తెలుస్తోంది.

## 3. కైలాస ప్రస్తారము

కైలాస ప్రస్తారము మూడు అంతస్తులుగా ఉంటుంది.

1) భూపురము, షోడశదళము, అష్టదళము ఒకే సమతలంలో ఉంటాయి.

2) చతుర్దశ కోణము, బహిర్దశారము, అంతర్దశారము ఒకే సమతలంలో ఉంటాయి. కాగా

3) అష్టకోణము, త్రికోణము, బిందువులు ఒకే సమతలంలో ఉంటాయి.

ఈ మూడు అంతస్తులుగా కైలాస ప్రస్తారము ఉంటుంది. అని కొందరి అభిమతము. కాని కైలాస ప్రస్తారము మేరువు లాగానే ఉంటుంది. కాకపోతే బిందువు ఉపరితలంమీద శివశక్తులు ఆశీనులై ఉంటారు. అది కూడా శివుని వామాంకము పైన ఆసీనయైన శక్తి ఉంటుందని కొందరి అభిమతము. ఈ రకంగా కైలాస ప్రస్తారంలో భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే కైలాస ప్రస్తారము రెండు రకాలుగా ఉంటుంది. అని 'శక్తి సంగమ తంత్రం'లో చెప్పబడింది.

***కైలాసాఖ్యస్తు ప్రస్తారో । ద్వివిధః పరికీర్తితః ।***
***అర్ధకైలాస సంజ్ఞస్తు । పూర్ణ కైలాసకస్తథా ॥***

1) అర్ధకైలాసము 2) పూర్ణ కైలాసము. పైన చెప్పబడినది పూర్ణకైలాసము. కాని అర్ధకైలాసము ఏ రకంగా ఉంటుందో తెలియలేదు. దాని చిత్రం కూడా ఎక్కడా లభించలేదు. ఇక కైలాస ప్రస్తారము విశేషం ఏమిటంటే .....

***మాతృకాయాస్తు కైలాస ప్రస్తారాఖ్యా సురేశ్వరీ ॥***

ఇందులో మాతృకల యొక్క తాదాత్మ్యముంటుంది. మాతృకలు అంటే అక్షరములు.

***కైలాసం చ అర్ధమేరుకమ్ సంహారాఖ్యం మహేశాని***

అనటం చేత కైలాస ప్రస్తారము సంహార పూజకు ఉపకరిస్తుంది. శ్రీచక్రార్చన చేసేటప్పుడు ....

***మేరుచక్రేతు సంహార క్రమ పూజా న విద్యతే ॥***

మేరు చక్రం మీద సంహార పూజ చేయరాదు.

**సంహార పూజ కైలాస ప్రస్తారే ౽ త్ర విధేయతే ।**

సంహార పూజ కేవలం కైలాస ప్రస్తారానికి. మాత్రమే చెయ్యాలి. సంహార పూజ అంటే శ్రీచక్రంలోభూపురం దగ్గర నుండి బిందువు వరకు అర్చించటము.

పైన చెప్పినట్లుగా కైలాస ప్రస్తారంలో మాతృకాతాదాత్మ్యం చెప్పబడింది. మాతృకలు అంటే అక్షరములు.

శ్రీవిద్యలో గల పదహారు అక్షరాలు షోడశ నిత్యలకు ప్రతీకలు. శ్రీవిద్య అంటే పంచదశీ మహామంత్రంలో పదిహేను అక్షరాలు ఉంటాయి. అయితే పంచదశీ మహామంత్రానికి శ్రీం బీజము గనక కలిసినట్లైతే షోడశి మహామంత్రమవుతుంది. అదే శ్రీవిద్య అని పిలవబడుతుంది.

**కామరాజ మంత్రాంతే శ్రీ బీజేన సమన్వితా ।**
**షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి పరికీర్తితా ॥**

ఇప్పుడు శ్రీవిద్యలో ఉండే పదహారు అక్షరాలు షోడశ నిత్యల స్వరూపాలు. అయితే మహాషోడశిలో ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి. అయితే ....

**అష్టౌ బీజాక్షరాణ్యాద్యౌ పశ్చాత్పంచదశీ తతః ।**
**పంచ బీజాక్షరాప్యేషా శ్రీ మహాషోడశీ మతా ॥**

పంచదశీ మహామంత్రానికి ముందు ఎనిమిది బీజాలు, తరువాత ఐదు బీజాలు కలపాలి. అప్పుడు పదమూడు బీజాక్షరాలవుతాయి.పంచదశీ మహామంత్రంలోని మూడు కూటములను మూడు బీజాలుగా లెక్క పెట్టాలి. అప్పుడు ఇరవై ఎనిమిది అక్షరాల షోడశీలో కూడా, లెక్కించినట్లైతే పదహారు అక్షరాలే ఉంటాయి. ఈ పదహారు అక్షరాలు నిత్యాదేవతలకు ప్రతీకలు. ఇవి షోడశారంలో ఉంటాయి.

షోడశ నిత్యలు చంద్రవిద్యకు అంగభూతములు. ఇవి స్వరాత్మకములు. ఇవి అక్షర రూపంలో అకారాది సర్గాంతము, సకారము ఈ రెండింటిచేత సంగృహీతలై జీవకళా రూపంలో బైందవ స్థానంలో ఉన్నాయి. అలాగే క కారము నుండి మ కారము వరకు అంటే 'క చ ట త ప' అనబడే ఐదు వర్గులు. వీటిలో ఇరవై ఐదు అక్షరాలుంటాయి. ప్రతి వర్గులోనూ చివరి అక్షరాన్ని వదలివేసినట్లైతే ఇరవై అక్షరాలవుతాయి. ఇవి పాశాంకుశ బీజములతో కూడినవై దశారయుగ్మంలో ఉంటాయి. 'య ర ల వ శ ష స హ ళ' అనబడే తొమ్మిది

అక్షరాలు రెండు ఆవృత్తులుగా అనగా పద్దెనిమిది అక్షరాలయి, చతుర్దశారంలో పద్నాలుగు, శివ చక్రాలయందు నాలుగు ఉంటాయి. అష్టకోణంలో ఎనిమిది వర్గులు ఉంటాయి. ఈ రకంగా అక్షరములు అంతర్భావం చెందటమే కైలాస ప్రస్తారము యొక్క విశేషము.

సృష్టి ఆరంభంలో బిందువు నుంచి త్రికోణము పుట్టింది. దాని నుంచి అష్టకోణము తరువాత దశాయుగ్మము ఈ రకంగా శ్రీచక్రం పుట్టింది. సృష్టిలో ముందుగా ఆకాశము ఉత్పన్నమైనది. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి నీరు, నీటి నుంచి భూమి ఉద్భవించినాయి. భూమి మీద ప్రాణి బ్రతకటానికి కావలసిన ఆహారము ఏర్పడిన తరువాత ప్రాణులు ఉద్భవించినాయి. అలాగే రెండవవైపు మాతృకలు ఉద్భవించినాయి. షట్చక్రాలలోనూ ఈ అక్షరాలు చెప్పబడుతున్నాయి.

1) విశుద్ధి చక్రము - అ నుంచి అః వరకు 16 అక్షరాలు

2) అనాహతము - క నుంచి ఠ వరకు 12 అక్షరాలు

3) మణి పూరము - డ నుంచి ఫ వరకు 10 అక్షరాలు

4) స్వాధిష్ఠానము - బ నుంచి ల వరకు 6 అక్షరాలు

5) మూలాధారము - వ శ ష స 4 అక్షరాలు

6) ఆజ్ఞా చక్రము - హ, క్ష 2 అక్షరాలు

ఈ రకంగా సంస్కృత భాషకు ఉన్న యాభై అక్షరాలు షట్చక్రాలయందే ఉద్భవించినాయి. ఇక సహస్రారమునందు అన్ని అక్షరములూ ఉంటాయి. ఈ రకంగా మానవ దేహంలోనే అక్షరములు చెప్పబడ్డాయి. మానవ దేహమే శ్రీచక్రము. అందుచేతనే శ్రీచక్రంలో మాతృకాతాదాత్మ్యం చెప్పబడినది.

సంస్కృత భాషకు అక్షరాలు యాభై - అక్షరము అంటే క్షరము (నాశనము) లేనిది. అ నుండి క్ష వరకు ఉండే వర్ణ సమామ్నాయము. ఈ యాభై అక్షరాలు పంచదశీ మహామంత్రంలో అంతర్భూతములు. ఈ విషయాన్ని నాచే వ్రాయబడిన '**శ్రీవిద్యా పంచదశి**'లో వివరించటం జరిగింది.

ఈ రకంగా మాతృకాతాదాత్మ్యము పొందినటువంటి శ్రీచక్రనగర సామ్రాజ్ఞి అయిన పరదేవతను పూజించాలి.

మాతృకావశినీయుక్తాం । యోగినీభిస్సమన్వితామ్ ।
గంధద్వారాది సహితాం । సంస్మరే త్రిపురాంబికామ్ ॥

ఈ మాతృకలకు అనగా అక్షరములకు ప్రత్యేక శక్తులున్నాయని చెప్పబడుతోంది. వాటికి రూపము, ఆయుధములు, ముద్రలు కూడా ఉన్నాయి. **'సనత్కుమార సంహిత'**లో అక్షర శక్తులను వివరించటం జరిగింది.

1) స్వరాత్మిక శక్తులు ఎనిమిది భుజములు కలిగి పాశము, అంకుశము, అభయ, వరద ముద్రలు, పుస్తకము, అక్షమాల, కమండలము, వ్యాఖ్యా ముద్రలను ధరించి ఉంటాయి.
2) వ్యంజన శక్తుల చేతులలో పాశము, అంకుశము, అక్షమాల, కమండలము ఉంటాయి.
3) య ర ల వ శక్తుల చేతులలో పాశము, అంకుశము, అభయ వరద ముద్రలు ఉంటాయి.
4) శ ష స హ శక్తుల చేతులలో పాశము, అంకుశము, అక్షమాల, వరద ముద్రలు ఉంటాయి.
5) ళ, క్ష శక్తుల చేతులలో పాశము, అంకుశము చెరకుగడ, పుష్పబాణము ఉంటాయి.

ఇవి పంచాశద్వర్ణాత్మికలయిన శక్తులు.

| | | |
|---|---|---|
| విశుద్ధి చక్రంలో ఉన్న అకారాది శక్తులు | - | ధూమ్ర వర్ణములు |
| అనాహతంలో ఉన్న క నుంచి ఠ వరకు శక్తులు | - | సింధూర వర్ణములు |
| మణిపూరంలో ఉన్న డ నుంచి ఫ వరకు శక్తులు | - | గౌరవర్ణములు |
| స్వాధిష్ఠానంలో ఉన్న బ నుంచి ల వరకు శక్తులు | - | అరుణ వర్ణములు |
| మూలాధారంలో ఉన్న వ నుంచి స వరకు శక్తులు | - | కనక వర్ణములు |
| ఆజ్ఞా చక్రంలో ఉన్న ఉక్ష హక్ష శక్తులు | - | విద్యుద్వర్ణములు |

ఈ శక్తులకు పరిధులు కూడా చెప్పబడినాయి.

| | |
|---|---|
| అకారశక్తి మండల విస్తీర్ణము | - ఎనభై లక్షల యోజనాలు |
| ఆకారశక్తి మండల విస్తీర్ణము | - నూట అరవై లక్షల యోజనాలు |
| ఇకారశక్తి మండల విస్తీర్ణము | - తొంభై లక్షల యోజనాలు |

| | |
|---|---|
| ఈకారశక్తి మండల విస్తీర్ణము | - నూట ఎనభై లక్షల యోజనాలు |
| ఉకారశక్తి మండల విస్తీర్ణము | - కోటి యోజనాలు |
| ఊకారశక్తి మండల విస్తీర్ణము | - రెండు కోట్ల యోజనాలు |
| ఋకార శక్తి మండల విస్తీర్ణము | - యాభై లక్షల యోజనాలు |
| ౠకార శక్తి మండల విస్తీర్ణము | - కోటి యోజనాలు |
| కార శక్తుల మండల విస్తీర్ణము | - అనంతము |
| ఏ ఐ కారశక్తుల మండల విస్తీర్ణము | - నూట యాభై లక్షల యోజనాలు |
| ఓ ఔ కార శక్తుల మండల విస్తీర్ణము | - నూట యాభై లక్షల యోజనాలు |
| అం అః కార శక్తుల మండల విస్తీర్ణము | - మూడు వందల ఇరవై లక్షల యోజనాలు |
| వ్యంజన శక్తుల మండల విస్తీర్ణము | - నలభై లక్షల యోజనాలు |
| యోజనము అనగా | - ఎనిమిది మైళ్ళ దూరము |

వశిన్యాదిశక్తులు, అష్టవర్గులు తమ తమ ఆయుధములతో ఉన్నట్లు భావన చెయ్యటం వల్లనే శ్రీచక్రానికి మూడు ప్రస్తారాలు వచ్చినాయి. అలాగే నిత్యలు, వర్ణములు కలసి మంత్రాక్షరములతో యోజింపబడినట్లైతే మేరు కైలాస ప్రస్తారాలు వస్తాయి. అంటే నిత్యాతాదాత్మ్యము మేరువని, మాతృకా తాదాత్మ్యము కైలాస ప్రస్తారమని అర్థము. బింద్వాత్మకంగా వశిన్యాదులను యోజించినట్లైతే భూప్రస్తారము వస్తుంది. అనగా భూప్రస్తారము వశిన్యాదులతాదాత్మ్యము.

ఈ మూడు ప్రస్తారాలను వివరిస్తూ గౌడ పాదాచార్యుల వారు తమ 'సుభగోదయస్తుతి' లో ఈ విధంగా అన్నారు.

> ***వశిన్యాద్యానిత్యా అ క చ ట త పాద్యాః ప్రకృతయః***
> ***స్వవర్గస్థాః స్వస్వాయుధకలిత హస్తాః స్వ విషయాః ।***
> ***యథావర్గం వర్ణప్రచురతనవో యాభిరభవం***
> ***స్తవ ప్రస్తారాస్త్రేతయ ఇతి జగుస్తే సమయినః ॥***
> ***ఇమానిత్యావర్ణా స్తవచరణ సమ్మేళనవశా***
> ***న్మహామేరుస్థాః న్యుర్మను మిలనకైలాస వపుషః ।***

వశినాద్యా ఏతా అపితవస బింద్వాత్మకతయా
మహీప్రస్తారోఽయం క్రమ ఇతి రహస్యం సమయినామ్ ॥

**మరికొన్ని రకాలు :**

శ్రీచక్రంలో ఇంకొన్ని రకాలున్నాయి.

**1) కూర్మ ప్రస్తారము :** ఇది తాబేలు ఆకారంలో ఉంటుంది. దీనిలో తొమ్మిది అంతస్తులు ఉంటాయి. నవావరణలను కొద్దిపాటి తేడాతో పైపైకి పెంచుకుంటూ పోతారు.

**2) మేరువు అధోదళము:** ఇది చూడటానికి పూర్ణమేరువే. కాని అందులోని అష్టదళము, షోడశదళములలోని దళాలు క్రిందికి వంగి ఉంటాయి. ఇది వామాచార పరుల దగ్గర కనిపిస్తోంది.

**3) మేరువు ఊర్ధ్వదళము :** ఇది కూడా పూర్ణ మేరువే. కాని అష్టదళము, షోడశ దళములలోని దళాలు దొప్పలులాగా పైకి లేచి ఉంటాయి. ఇలాంటివి దేశంలో చాలా తక్కువగా ఉన్నాయని పండితుల అభిప్రాయం. ఇది పుష్పగిరి పీఠంలో ఉన్నది.

**4) ద్వాదశ దళము :** అష్టదళము తరువాత ద్వాదశ దళము గీసిన శ్రీచక్రం ఉన్నది. ఇక్కడ ద్వాదశ దళాలూ ద్వాదశాదిత్యులకు ప్రతీకలు అని చెప్పబడినది.

**5) ముప్పై రెండు దళాలు :** షోడశ దళం తరువాత ముప్పై రెండు దళాలు గీసిన శ్రీచక్రం ఉన్నది. షోడశి మంత్రంలో పదహారు అక్షరాలున్నాయి. అదులోని ప్రతి అక్షరంలోనూ శివశక్తులున్నారు. ఈ రకంగా పదహారుజతలకు ప్రతీకగా ముప్పై రెండు దళాలున్నాయి.

**6) ఆవరణలు విడివిడిగా :** ఇది మేరు ప్రస్తారము. ఇందులో నవావరణలు విడివిడిగా తయారుచేసి ఒకచోట చేర్చటం జరిగింది. ఇది ఒక స్వామివారి పీఠంలో ఉన్నది. చెక్కతో చేసిన ఈ రకమైన శ్రీచక్రాలు చాలా ఉన్నాయి.

**7) ద్వారాలు లేనిది :** శ్రీచక్రంలోని భూపురానికి నాలుగు వైపులా నాలుగు ద్వారాలుంటాయి. అవి చతుర్వేదాలకూ ప్రతీకలు. ఆ ద్వారములలో గనక ప్రవేశించగలిగినట్లైతే పరదేవత సాక్షాత్కరిస్తుంది. **"ద్వార ప్రవేశనైవ భవతి పరదేవతా సాక్షాత్కార:".** అయితే స్వామి ప్రణవానందులవారి శ్రీచక్రానికి ద్వారాలు లేవు.

**8) వైష్ణవ సంప్రదాయంలో శ్రీ చక్రం :** ఇది మైసూరు వారి ప్రతి. బజారులో దొరుకుతుంది. దీన్ని కృష్ణ దేవరాయల వారి గురువైన తాతాచార్యులవారు గీయించారని

అంటారు. దీనికి పైన ఐదు శిఖరాలుంటాయి. నాలుగు వైపులా బాల, భువనేశ్వరి, గణపతి, సుబ్రహ్మణ్య మంత్రాలుంటాయి. వీటితో పాటుగా శంఖము, చక్రము కూడా ఉంటాయి. దీనిలో మరొక విశేషమేమంటే కోణాల తరువాత దశావతారాలకి ప్రతీకగా పది ఆవరణలుంటాయి. కోణాలలో త్రికోణంగాని, మధ్యన బిందువుగాని ఉండదు.

ఈ రకంగా అనేక రకాలయిన శ్రీచక్రాలు కనిపిస్తున్నాయి. ఇవి ఏ గ్రంథంలో చెప్పబడ్డాయో, వాటి పూజా విధానము, వాటి ఇతర వివరాలు తెలియవు.

**సంప్రదాయబద్ధమైన శ్రీచక్రము :**

శ్రీచక్రాన్ని తెచ్చుకోదలచుకున్నవారు తమ గురువుగారి దగ్గర తీసుకోవటం మంచిది. అది గనక సాధ్యం కాకపోతే రాఘవేంద్రా పబ్లిషర్స్, విజయవాడ వారు ముద్రించిన శ్రీ చక్రాన్ని తెచ్చుకోవచ్చు. ఇందులో దళాలు, కోణాలు, ద్వారాలతో పాటుగా అక్కడ ఉండే దేవతల పేర్లు కూడా వ్రాయటం జరిగింది. ఇది అత్యంత ఆమోదమైనదని పండితాభిప్రాయము. ఇది రంగురంగులలో 15 × 12, 10 × 8 సైజులలో దొరుకుతుంది.

పాఠకుల సౌకర్యం కోసం వివిధ శ్రీచక్రముల ఫొటోలు ఇక్కడ ఇవ్వటం జరుగుతున్నది.



## సంహారచక్రము - కౌళమతానుసారము



## సృష్టిచక్రము - సమయమతానుసారము



## సబీజచక్రము



## సమయమతంలో ఇంకొకరకమైన శ్రీచక్రము



"सकलमू भेंद्र मश्नुते"

## నవావరణలు


భూపురము
ప్రథమావరణము


షోడశదళ పద్మము ద్వితీయావరణము


అష్టదళ పద్మము
తృతీయా వరణము


చతుర్దశారము
చతుర్థావరణము


బహిర్దశారము
పంచమావరణము


అంతర్దశారము
షష్ఠావరణము


అష్ట
కోణ
చక్రము
సప్తమా
వరణము


త్రికోణము
బిందువు
అష్టమ
నవమా
వరణ
ము

# 7. తత్త్వములు

తత్త్వము అంటే స్వభావము అని అర్థం. శ్రీచక్రము చరాచరజగత్తుకూ ప్రతీక. ఈ జగత్తును సృష్టించటానికి అవసరమైన వస్తువుల స్వభావాలన్నీ శ్రీచక్రంలో ఇమిడిఉన్నాయి. అసలు తత్త్వములు ఎన్ని ? అన్నప్పుడు భిన్నాభిప్రాయాలు వినిపిస్తాయి. ఒక మతం ప్రకారము తత్త్వాలు యాభై ఒకటి అవి .....

*పంచ భూతాని తన్మాత్ర పంచకం చేంద్రియాణి చ ।*
*జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ ॥*
*త్వగాది ధాత వస్సప్త పంచ ప్రాణాదివాయవః ।*
*మనశ్చాహంకృతిః ఖ్యాతి ర్గుణాః ప్రకృతి పూరుషౌ ॥*
*రాగో విద్యా కలాచైవ నియతిః కాల ఏవ చ ।*
*మాయా చ శుద్ధ విద్యా చ మహేశ్వర సదాశివౌ ॥*
*శక్తిశ్చ శివతత్త్వం చ తత్త్వాని క్రమశో విదుః ।*

| | | |
|---|---|---|
| పంచ భూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| త్వగాది ధాతువులు | - | 7 |
| (చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లము) | | |
| ప్రాణములు | - | 5 |
| మనస్సు | - | 1 |
| అహంకారము | - | 1 |
| ఖ్యాతి | - | 1 |
| గుణములు | - | 3 |
| ప్రకృతి (మూలప్రకృతి) | - | 1 |

| | | |
|---|---|---|
| పురుషుడు (జీవుడు) | - | 1 |
| రాగము (ఇచ్ఛ) | - | 1 |
| విద్య | - | 1 |
| కళలు | - | 1 |
| నియతి (నియామికా శక్తి) | - | 1 |
| కాలము | - | 1 |
| మాయ | - | 1 |
| శుద్ధ విద్య (మోక్ష జ్ఞానము) | - | 1 |
| మహేశ్వరుడు (రజోగుణ ప్రధానుడైన సృష్టికర్త) | - | 1 |
| సదాశివుడు (సృష్టికర్త) | - | 1 |
| శక్తి (సృష్టి స్థితి లయకారిణి) | - | 1 |
| శివతత్త్వము (శుద్ధ బుద్ధ ముక్తి స్వరూపము) | - | 1 |
| మొత్తం తత్త్వాలు | | 51 |

అయితే ఈ తత్త్వాలు ముప్పై ఆరు మాత్రమే అని కొందరి వాదన.

**తత్త్వాని శివశ్శక్తిశ్చ సదాశివ మహేశ్వరా ।**
**విద్యేతి పంచశుద్ధాని శుద్ధాశుద్ధాని సప్తచ ।**
**మాయాకళా విద్యారాగః కాలో నియతి రేవ చ ।**
**పురుషశ్చాధా శుద్ధాని ప్రకృతి ర్బుద్ధ్యహంకృతీ ।**
**మనశ్చేంద్రియ దశకం తన్మాత్ర భూత పంచకం ॥**

ఈ రకంగా తత్త్వాలు ముప్పై ఆరు అని చెప్పబడ్డాయి. అయితే కాశ్మీరు వాసులు తత్త్వములు ముప్పై ఆరు అంటారు. అవి :

| | | |
|---|---|---|
| పంచ భూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |

| | | |
|---|---|---|
| కర్మేంద్రియాలు | - | 5 |
| త్వగాది ధాతువులు | - | 7 |
| మనస్సు | - | 1 |
| ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | - | 4 |
| మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుడు, సదా శివుడు | - | 4 |
| వెరసి మొత్తం | | 36 |

అయితే ఈ తత్త్వాలు కొన్ని మిగిలిన తత్త్వములందు ఇమిడిపోతున్నాయి. ముందుగా యాభై ఒక్క తత్త్వాలను పరిశీలిద్దాం.

1) త్వగాది ధాతువులు - పంచ భూతాలయందు
2) పంచ ప్రాణములు - వాయువు నందు
3) అహంకారము - మనస్సు నందు
4) ఖ్యాతి - విద్య యందు
5) గుణములు - ప్రకృతి యందు
6) ప్రకృతి - శక్తి యందు
7) పురుషుడు - మహేశ్వరుని యందు
8) కళ - శుద్ధవిద్య యందు
9) కాలము - మహేశ్వరుని యందు
10) నియతి - శక్తి యందు
11) శక్తి - శుద్ధ విద్యయందు
12) శివ తత్త్వము - సదా శివతత్త్వమందు

అంతర్భావం చెంది మొత్తం తత్త్వాలు ఇరవైఐదు అవుతాయి.

కాశ్మీరు దేశంలో ముప్పై ఆరు తత్త్వాలు చెప్పినప్పటికీ వాటిలో కూడా కొన్ని తత్త్వాలు మరికొన్నింటియందు అంతర్భావం చెందుతాయి. అవి ....

1) త్వగాది ధాతువులు - పంచ భూతాలయందు

2) ప్రాక్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు - వాయువు నందు అంతర్భావం చెందుతాయి. ఇప్పుడు మిగిలేది కేవలం ఇరవైఐదు తత్త్వాలు మాత్రమే. అవి ....

| | | |
|---|---|---|
| పంచ భూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| మనస్సు | - | 1 |
| మాయ, శుద్ధ విద్య మహేశ్వరుడు, సదాశివుడు | - | 4 |
| మొత్తం తత్త్వాలు | | 25 |

గౌడపాదులవారు తమ "సుభగోదయస్తుతి"లో ఈ విధంగా అన్నారు.

*పృథివ్యాపస్తేజః పవనగగనే తత్రప్రకృతయః ।*
*స్థితాస్తన్మాత్రాస్తా విషయ దశకం మానసమితి ।*
*తతో మాయావిద్యా తదనుచ మహేశః శివ ఇతి ।*
*పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥*

పంచ-భూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు, మనస్సు, మాయాదులు మొత్తం ఇరవై ఐదు తత్త్వాలు. మహేశ్వరునితో కలిసిన మాయ జీవ భావము పొందుతుంది. హిరణ్యాగర్భుడను సదాశివునితో కలిసిన శుద్ధవిద్య సాదాఖ్య కళ. ఇదే ఇరవై ఆరవ తత్త్వము.

శ్రీచక్రాన్ని గురించి వివరించేటప్పుడు

*శ్రీచక్రం త్రిపుర సుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ ।*
*పంచ భూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవ చ*
*ఇంద్రియాత్మక మేవం చ మనస్తత్త్వాత్మకం తథా*
*మాయాది తత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవమ్ ॥*

ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రాన్ని గురించి వివరిస్తున్నాను. వినవలసినదని ఈశ్వరుడు చెబుతున్నాడు. శ్రీచక్రము అనేది చరాచర జగత్తుకూ ప్రతీక. ఎందుచేతనంటే సృష్టికి అవసరమయిన పంచభూతాలు, తన్మాత్రల యొక్క తత్త్వాలు అందులో ఇమిడి ఉన్నాయి. అంతే కాదు. శ్రీచక్రము విశ్వ మానవాళికి ప్రతీక. మానవ దేహంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క తత్త్వాలు కూడా అందులో ఇమిడి ఉన్నాయి. మహేశ్వరునితో కలిసిన మాయ జీవభావము పొందుతుంది. హిరణ్యాగర్భుడను సదాశివునితో కలిసిన శుద్ధవిద్యయే సాదాఖ్య కళ. అదే ఇరవై ఆరవ తత్త్వము. దీనినే పరమాత్మ, పరాకళ, కుండలిని అంటారు.

# 8. శ్రీచక్రము - ముద్రాశక్తులు

శ్రీచక్ర పూజలో ప్రతి ఆవరణలోనూ ఒక్కొక్క ముద్రను ప్రదర్శించటము, పూజించటము జరుగుతుంది. ఈ రకంగా తొమ్మిది ఆవరణలలోనూ తొమ్మిది ముద్రలు, అన్ని ఆవరణలకు కలిపి ఒకటి, మొత్తం పది ముద్రలున్నాయి. వీటినే దశముద్రలు అంటారు. అవి ......

1) సర్వ సంక్షోభిణీ ముద్ర, 2) సర్వ విద్రావిణీ ముద్ర, 3) సర్వాకర్షిణీ ముద్ర, 4) సర్వవశంకరీ ముద్ర, 5) సర్వోన్మాదినీ ముద్ర, 6) సర్వ మహాంకుశ ముద్ర, 7) సర్వ ఖేచరీ ముద్ర, 8) సర్వ బీజముద్ర, 9) సర్వయోని ముద్ర, 10) సర్వ త్రిఖండ ముద్ర.

ఈ ముద్రలు పరమేశ్వరికి ప్రతిరూపమైన శక్తులుగా భావించి, ఆయా ఆవరణలలో పూజించాలి.

**ముద్రారూపాలు :** ముద్రల యొక్క రూపాలు వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా చెప్పబడుతున్నాయి. అందుచేత వాటిని సంప్రదాయానుసారము గురుముఖతః తెలుసుకోవటం మంచిది.

## సర్వ సంక్షోభిణీ ముద్ర



శ్రీచక్రాన్ని క్రింద నుంచి పైకి అర్చించినప్పుడు మొదటగా వచ్చేది భూపురము. అందులో పూజింపబడేది సర్వసంక్షోభిణీ ముద్ర

యోని ప్రాచుర్యతస్సైషా సర్వసంక్షోభికా పునః
వామాశక్తి ప్రధానేయం ద్వారచక్రే స్థితా భవేత్ ॥

క్రియాశక్తి అయిన ఆ త్రిపుర సుందరి అనేక యోనులుగా, అంటే మానవ, పశు, పక్షి, క్రిమి, కీటకాలలో జరుగుతున్న సృష్టిగా మారి, సర్వసంక్షోభిణీ ముద్రారూపము పొందుతున్నది. ఈ ముద్రాశక్తి శ్రీచక్రంలోని భూపురాన్ని పాలిస్తున్నది. అసలు సృష్టి అనేదే సంక్షోభము. ఈ ముద్రలో వామాశక్తి ప్రధానమైనది. ఈ శక్తి మూడు చతురస్రములు, నాలుగు ద్వారములు కలిగిన భూపురము అనబడే త్రైలోక్య మోహన చక్రాన్ని పాలిస్తున్నది. వామాశక్తి ప్రధానమైనది. వామాశక్తికి ఇచ్ఛాశక్తి ఉపలక్షణము. అంటే ఇచ్ఛాశక్తికి బదులు వామాశక్తి గ్రహించబడినది.

## సర్వ విద్రావిణీ ముద్ర



భూపురం దాటిన తరువాత ఉండేది షోడశ దళము. ఈ ఆవరణలో ఉండేది సర్వ విద్రావిణీ ముద్ర.

క్షుబ్ధ విశ్వస్థితి కర జ్యేష్ఠా ప్రాచుర్యమాస్థితా
స్థూల నాదకలారూపా సర్వానుగ్రహకారిణీ
సర్వాశా పరి పూరకాఖ్యేతు సైషా స్ఫురిత విగ్రహా ॥

సృష్టించబడిన జగత్తుకు స్థితి కలిగించేది విమర్శాంశ. అందుచేతనే ఇక్కడ స్థితి కారకమైన జ్యేష్ఠాశక్తి ఉంటుంది. జ్ఞానాశక్తికి జ్యేష్ఠాశక్తి ఉప లక్షణము. జ్ఞానశక్తి విమర్శాంశ భావము. ఈ ముద్రలో నాలుగు వ్రేళ్ళ ఋజుత్వము వలన మిగిలిన వ్రేళ్ళు ఎక్కువగా కలిసి ఉన్నప్పటికీ అది జ్యేష్ఠాశక్తి సమూహమవుతున్నది. ఋజుత్వము అంటే వంకర లేకుండా నిటారుగా ఉండుట. సృష్టికి వక్రత్వము, స్థితికి ఋజుత్వము సంప్రదాయ సిద్ధము.

అకారాది పదహారు స్వరముల రూపము గలది, సాధకుని యొక్క అన్ని కోర్కెలు తీర్చేది, సర్వానుగ్రహకారిణి అయిన త్రిపురసుందరి సర్వ విద్రావిణీ రూపము పొంది సర్వాశా పరిపూరకమనే షోడశారమునందు ప్రకాశించుచున్నది.

## సర్వాకర్షిణీ ముద్ర



నవావరణలలో మూడవదయిన అష్టదళమునందు ఉండేది సర్వాకర్షిణీ ముద్రాశక్తి.

*జ్యేష్ఠా వామా సమత్వేన సృష్టేః ప్రాధాన్యమాశ్రితా ।*
*ఆకర్షిణీ తు ముద్రేయం సర్వ సంక్షోభణేస్మృతా ॥*

సృష్టిరూపము వామాశక్తి. స్థితిరూపము జ్యేష్ఠాశక్తి. ఈ రెండింటికీ సామాన్యమైనది. సర్వాకర్షిణీ ముద్ర. వామాశక్తి అంశచేత వంచబడిన తర్జనీ, మధ్యమలు, జ్యేష్ఠాశక్తి అంశచేత నిటారుగా ఉన్న అనామికా కనిష్ఠికలు. వీటన్నిటికీ పైన వంచబడిన అంగుష్ఠము గలది.

## సర్వ వశంకరీ ముద్ర : (మన్మస్త్రము)



శ్రీచక్రంలో నాల్గవ ఆవరణ అయిన మన్వస్రము లేక చతుర్దశారమునందు సర్వవశంకరీ ముద్రను పూజించటం జరుగుతుంది.

*వ్యోమ మధ్యయాంతరాళస్థం బిందు రూపామహేశ్వరీ*
*శివశక్త్యాత్మక సంశ్లేషాద్ధివ్యావేశకరీస్మృతా*
*చతుర్దశారచక్రస్థా సంవిదానంద విగ్రహా ।*

**ఆకాశము రెండు రకాలు :** 1) చిదాకాశము - సహస్రారానికి పైన ఉండేది. 2) భూతాకాశము - సహస్రారమునందుండేది. ఈ రెండిటికీ మధ్యన బ్రహ్మరంధ్ర మందు బిందు స్థానమున్నది. పూజచేసేటప్పుడు భూతశుద్ధి చెయ్యాలి. ఆ సమయంలో బ్రహ్మరంధ్ర పర్యంతము ఆకాశము యొక్క భావన, బ్రహ్మరంధ్రం పైన చిదాకాశ భావన చెయ్యాలి. ఈ రెంటికీ మధ్య గల బ్రహ్మ రంధ్రంలోని బిందు స్థానంలో శివశక్తులు కలిసి ఉండటం చేత ఆనంద స్వరూపులవుతున్నారు. ఇక్కడ క్రియాశక్తి కన్న వేరుకానటువంటి త్రిపురసుందరి ప్రకాశిస్తూ సర్వవశంకరీ ముద్రా రూపంలో ఉండి, సర్వ సౌభాగ్యదాయక చక్రమైన చతుర్దశారమును పరిపాలిస్తున్నది. ఈ ముద్రలో వామ, జ్యేష్ఠా శక్తులు ప్రధానంగా ఉంటాయి.

## సర్వోన్మాదినీ ముద్ర : (బహిర్దశారము)



శ్రీచక్రంలో ఐదవ ఆవరణ బహిర్దశారము. ఇది పది కోణములు గల వెలుపలి చక్రము. దీనిలో సర్వోన్మాదినీ ముద్రా శక్తి ఉంటుంది.

*బింద్వంతరాళ విలసత్సూక్ష్మ రూపశిఖామయీ*
*జ్యేష్ఠాశక్తి ప్రధానాతు సర్వోన్మాదనకారిణీ*
*దశార చక్రమాస్థాయ సంస్థితా వీరవందితే ॥*

మూలధారంలో ఒక త్రికోణమున్నది. అలాగే బ్రహ్మరంధ్రంలో ఒక త్రికోణమున్నది. ఈ రెండు త్రికోణాలలోనూ బిందువులున్నాయి. మూలాధారంలో ఉన్నది స్వయంభూ లింగము. బ్రహ్మరంధ్రంలో ఉన్నది పరాలింగము. ఈ రెండింటి లోపల నుండి బిసతంతువు. (తామర తూడులోని సన్నని దారము వంటి రేఖ) ఉంటుంది. ఈ రేఖ యొక్క శిఖ అంబికా, శాంతా శక్తులతో కలసి ఉండి జ్యేష్ఠా శక్తితో మిక్కుటమైనదై సర్వోన్మాదిని అవుతున్నది. ఇది అందరినీ ఉన్మత్తులను చేస్తుంది. అనగా అన్ని పనులు వదలి పరాన్ముఖులై శివశక్తుల సామరస్యాను సంధాపరులయ్యేటట్లు చేస్తుంది.

మూలాధారం నుండి బ్రహ్మరంధ్రం చివరిదాకా అనగా సుషుమ్నానాడి జ్యేష్ఠాశక్తి ప్రధానమైనది. అందుచేతనే ఋజువుగా ఉంచిన అనామిక తర్జనిల జంటలచే నిర్దేశింపబడిన దేవతయే సర్వోన్మాదినీ ముద్ర. ఉన్మాదము అంటే తమ తమ పనులు వదలిపెట్టి, అంతర్ముఖులై ఉండటము. ఈ రకంగా సర్వార్థ సాధక చక్రమనబడే బహిర్దశారాన్ని ఈ ముద్రాశక్తి పాలిస్తున్నది.

## సర్వ మహాంకుశముద్ర : (అంతర్దశారము)



శ్రీచక్రంలోని ఆరవ ఆవరణ అంతర్దశారము. దానిలో ఉండే ముద్రాశక్తి సర్వమహాంకుశ.

**వామాశక్తి ప్రధానాతు మహాంకుశమయీ పునః**
**తద్వద్విశ్వం వమంతీ సాద్వితీయే తు దశారకే**
**సంస్థితా యోదనపరాముద్రా రూపత్వ మాస్థితా ।**

విశ్వమును వమనము చేయు (బయటకు పంపివేయు) క్రియా శక్తి కన్న వేరు కానటువంటి సంవిత్తే సర్వమహాంకుశ ముద్రా రూపము పొంది సర్వ రక్షాకర చక్రమైన అంతర్దశారమును పాలిస్తున్నది.

**సర్వ ఖేచరీ ముద్ర : (అష్ట కోణము)**



శ్రీచక్రంలో ఏడవదైన సర్వరోగహర చక్రము నందు ఉంటుంది.

*ధర్మాధర్మస్య సంఘట్టా దుత్థితా విత్తిరూపిణీ*
*వికల్పోత్థ క్రియాలోప రూపదోష విఘాతినీ*
*వికల్పరూప రోగాణాం హారిణీ ఖేచరీ పరా*
*సర్వరోగహరా ఖ్యేతు చక్రే సంవిస్మయీ స్థితా.*

జగత్తులో సృష్టి, స్థితి, లయాలన్నీ కొన్ని ధర్మాలకు లోబడి ఉంటాయి. కాబట్టి వాటిని నిర్వహించే శక్తి ధర్మము అని చెప్పబడుతోంది. పరమేశ్వరుడు సృష్టి స్థితి లయాలకు అతీతుడు. అతడికి ఏ ధర్మాలూ లేవు. అతడు అతీతుడు. అధర్ముడు. ఈ రకంగా చూసినట్లైతే ధర్మము శక్తి. అధర్మము శివుడు. ధర్మా ధర్మాల సమ్మేళనమే సామరస్యము. ఈ సామరస్యము నుండి ఉద్భవించినదే సంవిద్రూపిణి, జ్ఞాన రూపిణి. అటువంటి పరమేశ్వరి గురువు యొక్క అనుగ్రహం ద్వారానే పొందతగినది. తంత్ర సాధన చేత మాత్రమే పొందతగినది. అందుచేతనే పరమేశ్వరి సంశయాలను, ధర్మాలలోని లోపాలను, అశ్రద్ధ, అనాదరణ, వేద పండితుల అనుచిత ప్రవర్తన మొదలైన వాటిని పోగొడుతుంది. కౌళాచారంలో ఉండే దోషాలను ఆమె పోగొడుతుంది. సమయాచారంలోని లోపాలను

ఆవరణ దేవతలు సరిచేస్తారు. క్రియాశక్తి స్వరూపిణి, చిద్రూపిణి అయిన పరమేశ్వరి ఖేచరీ ముద్రా రూపిణి అయి సర్వరోగ చక్రమని పిలవబడే అష్ట కోణమును పాలించుచున్నది. ఈ ముద్ర శివశక్తుల యొక్క సంయుక్త రూపము. వామా జ్యేష్ఠా శక్తులు ప్రధానముగా కలది.

## సర్వ బీజ ముద్ర : (త్రికోణము)



శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణము నందుండే ముద్రాశక్తి పేరు సర్వ బీజముద్ర.

*శివశక్తి సమాశ్లేషస్ఫుర ద్వ్యోమాంతరేపున:*
*ప్రకాశయంతీ విశ్వం సా సూక్ష్మ రూపం స్థితం సదా*
*బీజరూప మహాముద్రా సర్వసిద్ధి మయేస్థితా ॥*

విత్తనము చిన్నగా ఉన్నప్పటికీ అందులో దాగి ఉండే మహావృక్షము చాలా పెద్దది. అలాగే శివశక్తుల కలయిక వల్ల ప్రకాశమానగర్భమందు సూక్ష్మ రూపంలో ఉన్న విశ్వము ప్రకాశిస్తున్నది. జ్ఞాన రూపము మొదట భావ వికారముగా ప్రకాశిస్తుంది. క్రియాశక్తి కన్న వేరు కానటువంటి సంవిత్తే బీజరూపమైన ఈ మహా ముద్రగా సర్వసిద్ధిప్రద చక్రమైన త్రికోణ మందున్నది.

## సర్వ యోని ముద్ర : (బిందువు)

శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ అయిన బిందువు నందుండే ముద్రాశక్తిని సర్వయోని ముద్ర అంటారు.



**సంపూర్ణ స్వప్రకాశస్య లాభ భూమిరియం వపుః**
**యోనిముద్రా కలారూపా సర్వానందమయే స్థితా ॥**

శివశక్తుల సామరస్యము కలిగి పరమానంద మయమైన పరబ్రహ్మ నుపాశించే స్థానమే బిందువు. సర్వానందమయ చక్రమైన బిందు స్థానమునందు సర్వయోని ముద్రాశక్తి పాలించుచున్నది.

## సర్వ త్రిఖండ ముద్ర



ఇది త్రిపుర సుందరీ రూపము. త్రిపుర సుందరి శ్రీచక్రమంతా వ్యాపించి ఉంటుంది. కాబట్టి ఈ ముద్ర ఆ దేవి సన్నిధిని కలుగ చేస్తుంది. ఈ ముద్ర పరమేశ్వరీ స్వరూపం కాబట్టి శ్రీచక్రంలోని అన్ని ఆవరణలయందూ వ్యాపించి ఉన్నది. అందుచేతనే బిందువులో ఉన్న త్రిపుర సుందరితో పాటుగా, అన్ని ఆవరణల దేవతలను ఆహ్వానించటానికి త్రిఖండా ముద్ర ఉపయోగపడుతుంది.

ముద్రాఖ్యాసా యదా సంవిదంబికా త్రికమలామయీ
త్రిఖండారూపమాపన్నా తథా సన్నిధికారిణీ
సర్వస్య చక్ర రాజస్య వ్యాపికా పరికీర్తితా ॥

క్రియాశక్తి కన్న వేరుకానిది, జ్ఞాన స్వరూపిణి అయిన త్రిపురసుందరి మూడు కళలతో కూడినది. సృష్టి ఆరంభంలో వామా, జ్యేష్ఠా, రౌద్రిల సమిష్టి రూపమైన అంబిక గానూ, ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల సమిష్టి రూపమైన శాంతగానూ ఆవిర్భవిస్తోంది. అప్పుడు పరమేశ్వరి త్రిఖండా రూపము పొందుతున్నది. విమర్శ శక్తి శివాదిక్షితి పర్యంతమైన విశ్వ రూపంతో విహరించదలచినప్పుడు, క్రియాశక్తిగా మారి, తన యొక్క వికారమే అయిన విశ్వము యొక్క పరచిదానంద లక్షణమైన మోదనము చేత, ఆ సంబంధమైన ఏకర లక్షణము చేత, అనగా ద్రావణము చేత ముద్రా అని పేరు పొందుతున్నది.



# 9. శ్రీచక్రము - పంచదశీ మహా మంత్రము

శ్రీవిద్యలో మహోన్నతమైనది పంచదశీ మహా మంత్రము. ఇది కేవలము పదిహేను అక్షరములు గల మంత్రము. ఈ మంత్రము మొత్తం మూడు ఖండాలుగా ఉంటుంది. మొదటి ఖండంలో నాలుగు, రెండవ ఖండంలోఐదు, మూడవ ఖండంలో మూడు బీజాక్షరాలుంటాయి. ప్రతి ఖండానికీ చివర హ్రీం కారముంటుంది. ఈ రకంగా పన్నెండు బీజాక్షరములు, మూడు హ్రీంకారములు వెరసి పదిహేను బీజములతో పంచదశీ మహా మంత్రం మీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన **"శ్రీవిద్యాపంచదశి"** చూడగలరు.

పరదేవత యొక్క యంత్ర రూపము శ్రీచక్రమైతే, మంత్ర రూపము పంచదశీ మహా మంత్రము. కాబట్టి ఈ రెండూ ఒక్కటే వేరుకాదు. పంచదశీ మహామంత్రానికి కౌళికార్థము వివరించేటప్పుడు ఈ విషయం చెప్పటం జరిగింది. భాస్కరరాయలవారు తమ 'వరివస్యా రహస్యం'లో ఈ విధంగా అన్నారు.

***కత్రితయాదీ కారాత్ బిందుర్జాత స్తదగ్రియే చక్రే ।***
***హృల్లేఖా భిస్తత్పర చక్ర త్రితయం హకారాభ్యాం ॥***
***ఏకారేణ చ తత్పర చక్రే జాతే సకారాభ్యాం ।***
***చతురస్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్ర జనిః***

శ్రీచక్రము పంచదశీ మహామంత్రము నందలి బీజాక్షరముల వల్లనే ఉద్భవించినది.

1. మూడు **క** కారములు, **ఈ** కారము వలన - శ్రీచక్రంలోని బిందువు.
2. మూడు **హ్రీం** కారముల వలన - త్రికోణము, అష్టకోణము.
3. రెండు **హ** కారములు, **ఏ** కారము వలన - అంతర్దశారము, బహిర్దశారము, చతుర్ద శారము.
4. రెండు **స** కారముల వలన - అష్టదళము, షోడశ దళము.
5. మూడు **ల** కారముల వలన - భూపుర త్రయము పుట్టినాయి.

ఈ రకంగా శ్రీచక్రము పంచదశీ మహామంత్రము నుంచే ఉద్భవించింది.

శ్రీచక్రం గురించి జ్ఞానార్ణవతంత్రంలో ఈ రకంగా చెప్పటం జరిగింది.

భూమి శ్చంద్ర: శివో మాయా శక్తి: కృష్ణాధ్వమాదనౌ ।
అర్థ చంద్రశ్చ బిందుశ్చ నవార్ణో మేరు రుచ్యతే ॥
శ్రీచక్రమపి దేవేశి మేరురూపం న సంశయ: ।
లకార: పృథివీబీజం తేన భూబింబ ముచ్యతే ॥
సకార శ్చంద్రమాభద్రే కళాషోడశ కాత్మకం ।
తన్మాత్షోడశపత్రం తుహకార: శివ ఉచ్యతే ॥
అష్టమూర్తి: సదాభద్రే తస్మా ద్వసుదళం భవేత్ ।
ఈకారస్తు మహామాయా భువనాని చతుర్దశ ॥
పాలయంతీ పరా తస్మాచ్చ క్రకోణం భవేత్ప్రియే ।
శక్తి రేకాదశస్థానే స్థిత్వా సూతే జగత్త్రయమ్ ॥
విశ్వయోని రితి ఖ్యాతా సా విష్ణు ర్దశరూపకం ।
రకారాత్పరమేశాని చక్రం వ్యాప్య విజృంభతే ॥
దశకోణకరీ యస్మా ద్రకారో జ్యోతి రవ్యయె ।
కళాదశా న్వితో వహ్ని ర్దశకోణ ప్రవర్తక: ॥
కకారోమదనో దేవి శివశ్చాష్ట స్వరూపక:
యోనివశ్యం తదా చక్రే వసుయో న్యంకితం భవేత్ ॥
అర్థ మాత్రా గుణాన్ సూతే నాదరూపాయతస్తత:
త్రికోన రూపాయోనిస్తు బిందునా బైందవం భవేత్
కామేశ్వర స్వరూపంతు విశ్వాకార స్వరూపకం
శ్రీచక్రంతు వరారోహే శ్రీవిద్యా వర్ణ సంభవమ్ ॥

విశ్వాకారానికి ప్రతీకలైన, కామేశ్వరీ కామేశ్వరుల స్వరూపంగా శ్రీ చక్రము పంచదశీ మహా మంత్రం నుంచే ఉద్భవించింది.

శ్రీవిద్యా మహామంత్రమయిన పంచదశీ మహామంత్రంలో ఉండే అక్షరాలు మొత్తం తొమ్మిది అని చెప్పబడుతోంది. అవి ......

1. భూమి - అ
2. చంద్ర - స
3. శివ - హ
4. మాయా - ఈ
5. శక్తి - ఏ
6. కృష్ణమాద్య - రేప
7. మాదన - క
8. అర్థ చంద్ర - నాదము
9. బిందువు - బిందువు

ఈ తొమ్మిది అక్షరముల సముదాయమే పంచదశీ మహామంత్రము.

ఈ మంత్రంలో ఒకసారి వచ్చిన అక్షరాలను మళ్ళీ లెక్క పెట్టకుండా వదిలేసినట్లైతే ఈ రకంగా మంత్రానికి తొమ్మిది అక్షరాలే అవుతాయి. ఈ అక్షరముల వల్లనే శ్రీ చక్రము ఉత్పత్తి అయింది. అది ఏ విధంగా అంటే.

1. ల కారము పృధివీ బీజము. దీని వలన భూపురము పుట్టింది.
2. సకారము చంద్రబీజము. దీనివల్ల షోడశదళం పుట్టింది. ఈ షోడశదళాలోనూ చంద్ర కళలు ఉంటాయి.
3. హకారము శివ బీజము. అష్ట మూర్త్యాత్మకము. దీనిని వలన అష్ట దళము పుట్టింది.
4. ఈ కారము మాయా బీజము. అదుచే తనే చతుర్దశ భువనాలకు ప్రతీకగా చతుర్దశారము పుట్టింది.
5. ఏ కారము శక్తి బీజము. దీని వలన విష్ణువు యొక్క దశావతారాలకు ప్రతీకగా బహిర్దశారము పుట్టింది.
6. రకారము అగ్ని బీజము. దీని వలన అగ్ని కళలుతో కూడిన అంతర్దశారము పుట్టింది.
7. కకారము మన్మథ బీజము. వసుకోణాత్మకము. అంటే అష్టవసువులకు ప్రతీకగా ఎనిమిది కోణాలు గల అష్టకోణము పుట్టింది.
8. అర్థ చంద్రము త్రిగుణాత్మకము. దీనివన త్రికోణము పుట్టింది.
9. బిందువు పరబ్రహ్మాతకము. దీనివలన తొమ్మిదవ ఆవరణ అయిన బిందువు పుట్టింది. ఈరకంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రము పుట్టటం జరిగింది.

# 10. శ్రీచక్రము - గణేశాది రూపాలు

పంచదశీ మహా మంత్రానికి వివిధ రకాలయిన అర్థాలను వివరిస్తూ, భాస్కర రాయల వారు కౌళికార్థంలో శ్రీచక్రానికి గణేశాది రూపాలున్నాయని వివరించారు. ముందుగా ....

**1. గణేశ రూపము :**

*రేఖా దళకోణ గణైర్ఘటనా చక్రే గణేశత్వమ్ ।*

శ్రీచక్రానికి గణేశ రూపము చెబుతున్నారు. గణములకు అధిపతి కావటం చేత శ్రీ చక్రానికి గణేశత్వము వచ్చింది. గణములు అంటే ఇక్కడ భూపురంలోని మూడు రేఖలు, అష్ట దళము, షోడశ దళములోని దళాలు, శక్తి చక్రాలలో ఉన్న 45 కోణాలు. ఈ గణములు సమూహంగా కలది కాబట్టి శ్రీ చక్రానికి గణేశ రూపం చెప్పబడింది.

**2. యోగినీ రూపము :**

*స్థితి సంహృతి చక్రేద్వే పద్మేద్వే వృత్త భూగృహేచద్వే*
*ఏవం షడ్భిర్యోగాత్ శ్రీచక్రం యోగినీ రూపకం.*

శ్రీచక్రము మూడు రకాలుగా విభజింపబడుతోంది.

1) సృష్టి చక్రము 2) స్థితి చక్రము 3) సంహార చక్రము. ఇందులో ....

1. అష్ట దళము, షోడశ దళము, భూపురము - సృష్టి చక్రము.
2. అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము - స్థితి చక్రము.
3. బిందువు, త్రికోణము, అష్ట కోణము - సంహార చక్రము.

వీటిలో స్థితి చక్రము, సంహార చక్రము, అష్ట దళము, షోడశ దళము, షోడశ దళము తరువాత వృత్తము, భూపురము మొత్తం కలిసి ఆరు. యోగినుల సంఖ్య ఆరు. శరీరంలో షట్చక్రాలున్నాయి. వాటి అధిదేవతలు ఆరుగురు. వారి పేర్లు .....

| | | |
|---|---|---|
| 1) వజ్రేశ్వరి | 2) వామ దేవీ | 3) వయోవస్థా వివర్జితా |
| 4) సిద్దేశ్వరీ | 5) సిద్ధ విద్యా | 6) సిద్ధ మాతా |

వీరినే యోగినులు అంటారు. వారు వరుసగా ....

| | | |
|---|---|---|
| 1) డాకిని | 2) రాకిని | 3) లాకిని |
| 4) కాకిని | 5) సాకిని | 6) హాకిని |

ఈ రకంగా పైన చెప్పిన చక్రాలు ఆరు. యొగినుల సంఖ్య కూడా ఆరు. కాబట్టి శ్రీచక్రానికి యోగినీ రూపం చెప్పబడింది.

**3. నవ గ్రహత్వము :**

*త్రైలోక్య మోహనాద్యై ర్నవభిశ్చక్రై ర్గ్రహత్వం చ*

శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. వీటినే విడివిడిగా చక్రాలు అంటారు. అవి

1. భూపురము - త్రైలోక్య మోహన చక్రము.
2. షోడశ దళము - సర్వాశాపరిపూరక చక్రము
3. అష్ట దళము - సర్వ సంక్షోభణ చక్రము.
4. చతుర్దశారము - సర్వ సౌభాగ్య దాయక చక్రము.
5. బహిర్దశారము - సర్వార్థ సాధక చక్రము.
6. అంతర్దశారము - సర్వ రక్షాకర చక్రము.
7. అష్ట కోణము - సర్వ రోగహర చక్రము.
8. త్రికోణము - సర్వ సిద్ధి ప్రదచక్రము.
9. బిందువు - సర్వానందమయ చక్రము

అలాగే గ్రహాలు తొమ్మిది. కాబట్టి శ్రీచక్రానికి గ్రహత్వం చెప్పబడింది.

**4. రాశి స్వరూపము**

*పంచ చతుశ్చక్ర్యనలాబిందుః వృత్తం చ భూబింబమ్ ।*
*ఏవం ద్వాదశ సంఖ్యై ర్ఘటనా చ్చక్రస్య రాశిత్వమ్ ॥*

శ్రీచక్రంలో క్రింది వైపు కోణాలు ఐదు, పైవైపు కోణాలు నాలుగు, వృత్త త్రయము ఒకటి, భూపురము ఒకటి, బిందువు ఒకటి వెరసి పన్నెండు. మేషాది రాశులు పన్నెండు. ఈ రకంగా శ్రీచక్రానికి రాశి స్వరూపము చెప్పబడింది.

**5. నక్షత్ర స్వరూపము :**

*వృత్త త్రయ ధరణీత్రయ మన్వశ్రాణాం విభజ్య గణేన*
*సప్తభిరితరై శ్చక్రైశ్చక్రే నక్షత్రరూపత్వమ్ ॥*

శ్రీచక్రంలో వృత్తాలు మూడు, భూపుర రేఖలు మూడు, చతుర్దశారంలో కోణాలు పద్నాలుగు, మిగిలిన ఇతర చక్రాలు ఏడు. అవి బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్ద శారము, అష్టదళము, షోడశ దళము వెరసి ఇరవై ఏడు. అశ్విని మొదలైన నక్షత్రాలు ఇరవై ఏడు. ఈరకంగా శ్రీచక్రానికి నక్షత్ర రూపం చెప్పబడింది.

ఇలా చెప్పటం చేత చరాచర జగత్తులోని గణాలు, గ్రహాలు, రాశులు, నక్షత్రాలు, మానవ శరీరంలోని షట్చక్రాలలోని యోగినులు అన్నీ శ్రీచక్రంతో పోల్చబడ్డాయి. అంటే శ్రీచక్రం విశాల విశ్వానికి విశ్వమానవాళికీ ప్రతీక అని మరొకసారి చెప్పబడింది.

# 11. శ్రీచక్ర న్యాసము

మంత్రమును చదివేటప్పుడు శరీరమందలి. అవయవములయందు మంత్ర బీజాక్షారాలను ఉంచటాన్ని న్యాసము అంటారు. **'మంత్రాధీనంతు దైవతమ్'** అని చెప్పబడుతోంది. చరాచర జగత్తు అంతా కూడా భగవంతుని ఆధీనంలో ఉంటుంది. అటువంటి భగవంతుడు మంత్రానికి ఆధీనుడై ఉంటాడు. కాబట్టి భగవదనుగ్రహం కావాలంటే మంత్ర జపం చెయ్యాలి. **"నా విష్ణుర్ పృథివీ పతిః"** రజోగుణ ప్రధానుడైన విష్ణుమూర్తి యొక్క అంశ లేకుండా రాజు ఏ విధంగా కాలేడో, అదే విధంగా **'నారుద్రో రుద్ర మర్చయేత్'** రుద్రుడు కానివాడు రుద్రుని అర్చించ లేడు. అంటే భగవంతుణ్ణి అర్చించాలి అంటే సాధకుడికి భగవంతుడి అంశ తప్పని సరిగా ఉండాలి. అందుచేతనే సాధకుడు మంత్ర జపం చేసేటప్పుడు అంగన్యాస కరన్యాసముల ద్వారా ఆ మంత్రాధిష్టాన దేవతను, తన శరీరం మీదకు ఆవాహన చేసుకుంటాడు. ఈ రకంగా తను కుడా పరదేవత యొక్క అంశే. ఇప్పుడు తాను, ఆ పరదేవతా ఇద్దరూ ఒక్కటే అనే భావనను పొంది జపం చెయ్యటం జరుగుతుంది. ఈ రకంగా చేస్తేనే మంత్ర సిద్ధి కలుగుతుంది.

న్యాసము రెండు రకాలుగా చెప్పబడుతుంది. 1) లఘు న్యాసము, 2) దీర్ఘ న్యాసము.

**I. లఘు న్యాసము :** జపాన్ని ఆరంభించేటప్పుడు సాధకుడు అంగన్యాస కరన్యాసముల ద్వారా దేవతను తన శరీరం మీదకు ఆవాహన చేస్తాడు. లఘు న్యాసము ఈ విధంగా ఉంటుంది.

**కరన్యాసము :**

1. అంగుష్ఠాభ్యాం నమః
2. తర్జనీభ్యాం నమః
3. మధ్యమాభ్యాం నమః
4. అనామికాభ్యాం నమః
5. కనిష్టికాభ్యాం నమః
6. కరతలకరపృష్టాభ్యా నమః

**అంగన్యాసము :**

1. హృదయాయ నమః
2. శిరసే స్వాహా
3. శిఖాయై వౌషట్
4. కవచాయహుం
5. నేత్రత్రయాయ వౌషట్
6. అస్త్రాయ ఫట్

బ్రహ్మ భూర్భువస్సువరోం । ఇతి దిగ్బంధః

అని ఆ దేవతను శరీరం మీద ఆవాహన చేసుకుని బంధించిన తరువాత మాత్రమే మంత్ర జపం చేస్తారు.

**2. దీర్ఘన్యాసము :** దేవత యొక్క మంత్రాన్ని సాధకుని శరీరంలోని కొన్ని భాగాలకే కాకుండా, అన్ని భాగాలలోనూ ఆవాహన చేసినట్లైతే దాన్ని దీర్ఘ న్యాసము లేదా మహాన్యాసము అంటారు. దీనిలో మంత్రాన్ని సాధకుడి సర్వావయవములలోనూ ఆవాహన చేస్తాడు. శిరస్సు, ముఖము, కళ్ళు, ముక్కు, చెవులు, నోరు, పళ్ళు, కంఠము, భుజాలు, బాహువులు, ఈ రకంగా శరీరంతోని అన్ని భాగాల యందు మంత్ర స్వరూపిణి అయిన దేవతను ఆవాహన చేస్తారు. శివునికి అభిషేకము చేసేటప్పుడు చెప్పే మహాన్యాసము ఈ కోవకు చెందినదే.

అదే విధంగా శ్రీచక్రాంతర్గతమైన పరదేవతను ఆరాధించేటప్పుడు శ్రీ చక్ర న్యాసము చెప్పటం జరుగుతుంది. అంటే శ్రీ చక్రంలోని నవావరణలనూ, వివిధ దేవతలనూ సాధకుని శరీరం మీదకు ఆవాహన చెయ్యటం. తంత్రాలలో శ్రీచక్రన్యాసము ఈ విధంగా చెప్పబడింది.

*శరీరం చింతయే దాదౌ నిజం శ్రీ చక్రరూపకం ।*
*త్వగాద్యాకారనిర్ముక్తం జ్వలత్కాలాగ్ని సన్నిభమ్ ॥*
*తత శ్చన్యాసయోగేన శ్రీచక్రం పరిచింతయేత్ ।*
*షట్చక్రేషు లలాటే చ సీమంతే చ శిరోబిలే ॥*
*నవ స్థానాని సంకల్ప్య న్యసే ద్దేవి తతః పరం ।*
*ప్రకటాద్యా న్యసే త్వశ్చా దాధారాదిషు మంత్రవిత్ ॥*
*బైందవం బ్రహ్మరంధ్రే చ మస్తకే చ త్రికోణకం ।*
*లలాటే వసుకోణం చ భ్రువోర్మధ్యే దశారకమ్ ॥*
*బహిర్దశారం కంఠే చ హృదయే మనుకోణకం ।*
*నాభౌ హ్యష్టదళం పద్మం స్వాధిష్ఠానే కళాశ్రకమ్ ॥*
*ఆధారే చతురశ్రం స్యా దేవం చక్రం విభావయేత్ ॥*
*సర్వా న్న్యాసాన్ శిష్య దేహే సంభావ్యైవ మతః పరః*
*అథ వేధమయీం కుర్యా ద్దీక్షాం షట్చక్రభేదినీమ్ ॥*

శ్రీచక్రంలో సృష్టి స్థితి సంహారాలున్నాయని ముందే చెప్పటం జరిగింది. కాబట్టి దాని న్యాసము కూడా సృష్టి స్థితి సంహారాలకు విడివిడిగా చెప్పబడింది. అయితే సృష్టి స్థితి సంహారాలు ఏ విధంగా చెప్పబడతాయి అంటే - శివాదిక్షితి పర్యంతము తత్త్వాలు

చెప్పబడుతున్నాయి. అలాంటప్పుడు శివుని (పరమేశ్వరుని) దగ్గర నుండి క్షితి (భూమి) దాకా వస్తే సృష్టి. భూమి దగ్గర నుండి శివుని దగ్గరకు వెళితే సంహారము. ఈ రెండింటికీ మధ్యలోది స్థితి. అందుచేత సృష్టి స్థితి సంహారాలకు న్యాసము విడివిడిగా చెప్పబడింది.

**సృష్టిన్యాసము :**

*బ్రహ్మరంధ్రే లలాటే చ నేత్రయోః కర్ణయో ర్నసోః ।*
*గండ దంతోష్ఠ జిహ్వాసు ముఖకూపే చ పృష్ఠతః ॥*
*సర్వాంగే హృదయే న్యస్యే త్స్తనకుక్షి ధ్వజేషు చ ।*
*ఏకైకార్ణ మథోమూర్ధ్ని సర్వేణ వ్యాపకం చరేత్ ॥*

**స్థితిన్యాసము :**

*సృష్టిన్యాసం విధాయైవం స్థితిన్యాస మథాచరేత్ ।*
*కరాంగుష్ఠా ద్యంగులీషు బ్రహ్మరంధ్రే ముఖేహృది ॥*
*నాభ్యాది పాదపర్యంతం నాభ్యంతం కంఠ దేశతః ।*
*బ్రహ్మరంధ్రాచ్చ కంఠాంతం పాదాంగులిషు పంచ చ ॥*

**సంహారన్యాసము :**

*త్రైలోక్య మరుణం ధ్యాయే చ్ఛ్రీవిద్యాం మనసి స్మరేత్ ।*
*పాదయో ర్జంఘయోర్న్యస్యే జ్జాన్వోశ్చ కటిభాగయో : ॥*
*లింగే పృష్ఠే నాభిదేశే పార్శ్వయో స్తనయో రపి ।*
*అంసయోః కర్ణయో ర్బ్రహ్మరంధ్రే వక్త్రే చ నేత్రయోః ॥*
*కర్ణయోః కర్ణవేష్టే ऽపి మూలస్యైకైక మక్షరం ।*
*సంహార న్యాస ఉక్తో ऽయం తతో వాగ్దేవతాన్యసేత్ ॥*

'వామకేశ్వర తంత్రం'లో శ్రీచక్ర న్యాసము సృష్టి సంహార క్రమాల్లో వివరించటం జరిగింది. గతంలో చెప్పినట్లుగా సృష్టి క్రమముఅంటే శివాదిక్షితి పర్యంతము అనగా బిందువు నుండి భూపురం వరకు. అలాగే సంహార క్రమము అంటే క్షితి నుండి శివునిలో లీనమవటము. అంటే భూపురం నుండి బిందువు వరకు ఈ రకంగా న్యాసము చెప్పబడింది.

**సంహార న్యాసము :**

పరమేశ్వరుడు, పరమేశ్వరికి శ్రీచక్రన్యాసము వివరిస్తున్నాడు.

మహాత్రిపుర సుందర్యా శ్చక్రన్యాసం శృణుప్రియే ।
యన్నకస్య విదాఖ్యాతం తనుశుద్ధికరం పరమ్ ॥

జగన్మోహనాకారవైన ఓ పరమేశ్వరీ ! శ్రీచక్ర న్యాసము విన్నంత మాత్రం చేతనే శరీర శుద్ధి కలుగుతుంది. కాబట్టి శ్రీచక్రన్యాసము వినవలసినది. అని శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలకు న్యాసము చెబుతున్నాడు. ముందుగా .....

**త్రైలోక్య మోహన చక్రన్యాసము :**

చతురస్రాద్య రేఖాయై నమ ఇత్యాదితో న్యసేత్ ।
దక్షాంసపృష్ఠపాణ్యగ్ర స్ఫిక్స్ పాదాంగులీ ష్వధ ॥
వామాంఘ్ర్యంగులిషు స్ఫిక్యే పాణ్యగ్రే చాంసపృష్ఠకే ।
సమూలీ మూలపృష్ఠేషు వ్యాపకత్వేన సుందరి ।
అత్రైవ స్థానదశకే ష్వణిమాద్యా దశ న్యసేత్ ।
సిద్దీ స్తదంతశ్చ తను వ్యాపకత్వేన సుందరి ॥
చతురస్రమధ్య రేఖాయై నమ ఇత్యపివల్లభే ।
విన్యస్య తస్యా: స్థానేషు బ్రహ్మాణ్యాద్యా స్తథాష్టసు ॥
పాదాంగుష్ఠద్వయే పార్శ్వే దక్షే మూర్ధన్యపార్శ్వకే ।
వామ దక్షిణజాన్వోశ్చ బహిరంస ద్వయే తథా ॥
న్యస్తవ్యా శ్చతురస్రాంత్య రేఖాయై నమ ఇత్యపి ।
విన్యసే ద్వ్యాపకత్వేన పూర్వోక్తాంతశ్చ విగ్రహే ॥
తస్యా: స్థానేషు దశసు ముద్రాణాం దశకం న్యసేత్ ।
బ్రహ్మాణ్యాద్యష్ట స్థానాంత స్తాసా మష్టౌ న్యసేదధ ॥
శిష్టే ద్వే ద్వాదశాంతే చ పాదాంగుష్ఠే చ విన్యసేత్ ॥

**సర్వాశాపరిపూరక చక్రన్యాసము :**

తదంత: షోడశదళ పద్మాయ నమ ఇత్యపి ।
విన్యస్య తద్దళే కామా కర్షిణ్యాద్యాశ్చ విన్యసేత్ ॥
దళాని దక్షిణశ్రోత్ర పృష్ఠ మం సంచకూర్పరం ।
కరపృష్ఠం చోరుజాను గుల్ఫపాదతలం తథా ॥
వామపాద తలాద్యేన మేత దప్యష్టకం మతమ్ ॥

సర్వ సంక్షోభణ చక్రన్యాసము :

తదంతరే చాష్టదళ పద్మాయ నమ ఇత్యపి ।
విన్యస్య తద్దళే ష్వేషు దక్షశంఖే చ జత్రుణి ॥
ఊర్ధ్వం తద్గుల్ఫ్యోర్గుల్ఫోరు జత్రు శంఖే చ వామత: ।
అనంగకుసుమాద్యాస్తు శక్తీరష్టౌ ప్రవిన్యసేత్ ॥

సర్వసౌభాగ్యదాయక చక్రన్యాసము :

తదంత శ్చతుర్దశార చక్రాయ నమ ఇత్యపి ।
విన్యస్య తస్యకోణేషు న్యసే చ్ఛక్తీ శ్చతుర్దశ ॥
సర్వసంక్షోభిణీ కాద్యా స్తస్య కోణాని వచ్మ్యహం ।
లలాటే దక్షభాగే చ దక్షగండాంస మధ్యత: ॥
పార్శ్వాంతరూరు జంఘాంత ర్వామజంఘాది పార్వతి ।
వామోర్వంత ర్వామపార్శ్వే వామాంసే వామగండకే ॥
లలాటవామభాగే చ తథా వై పృష్ఠ ఇత్యపి ॥

సర్వార్థసాధక చక్రన్యాసము :

తతో దశారచక్రాయ నమ ఇత్యపి పార్వతి ।
తస్య కోణాని దక్షాక్షి నాసామూలాన్య నేత్రకే ॥
కుక్షీశ వాయుకోణేషు జానుద్వయ గుదేషు చ ।
కుక్షినైర్ఋత వహ్న్యాఖ్య కోణయోశ్చ న్యసేత్పున: ॥
సర్వసిద్ధి ప్రదాద్యానాం శక్తీనాం దశకం ప్రియే ॥

సర్వరక్షాకర చక్రన్యాసము :

తదంతశ్చ దశారాది చక్రాయ నమ ఇత్యపి ।
విన్యస్య తస్యకోణేషు సర్వజ్ఞాద్యా దశ న్యసేత్ ॥
దక్షనాసా సృక్కిణీ చ స్తనం వృషణ మేవ చ ।
సీవినీ వామముష్కం చ స్తనసృక్కిణి నాసికం ॥
నాసాగ్రం చైవ విజ్ఞేయం కోణానాం దశకం తథా ॥

సర్వరోగహర చక్రన్యాసము :

తదంత శ్చాష్టకోణాది చక్రాయనమ ఇత్యపి ।
విన్యస్య తస్యకోణేషు వశిన్యాద్యష్టకం న్యసేత్ ॥
చిబుకం కంఠహృదయ నాభీనాం చైవ దక్షిణం ।
జ్ఞేయం పార్శ్వచతుష్కం చ మణిపూరాది వామకం ॥
చతుష్టయం చ పార్శ్వానా మేతత్కోణాష్టకం పునః ॥

సర్వసిద్ధిప్రద, సర్వానందమయ చక్రన్యాసము :

హృదయస్థ త్రికోణస్య చతుర్దిక్షు బహిర్న్యసేత్ ।
శరచాపౌ పాశసృణీ త్రికోణాయ నమ స్తథా ॥
విన్యస్య తస్యకోణేషు అగ్రదక్షోత్తరేషు చ ।
కామేశ్వర్యాది దేవీశ్చ మధ్యే దేవీం చ విన్యసేత్ ॥

సృష్టి న్యాసము :

మూలదేవ్యాదికం న్యాస మణిమాంతం పునర్న్యసేత్ ।
త్రికోణస్థే మహాబిందౌ మహాత్రిపుర సుందరీమ్ ॥
శిరస్త్రికోణే పూర్వాదీ కామేశ్వర్యాది కాన్యసేత్ ।
బాణా న్నేత్రే భ్రువోశ్చాపౌ కర్ణే పాశద్వయం పునః ॥
సృణిద్వయంతు నాసాగ్రే దక్షిణాద్యంతు విన్యసేత్ ।
ముండమాలా క్రమేణైవ న్యసేద్వాగ్దేవతాష్టకమ్ ॥
బైందవాదీని చక్రాణి న్యస్తవ్యాని వరాననే ।
నేత్రమూలే త్వపాంగే చ కర్ణ పూర్వోత్తరే పునః ॥
చూడాదికే చ నిమ్నార్ధే శేషార్ధే కర్ణపృష్ఠకే ।
కర్ణపూర్వే త్వపాంగే చ తస్యమూలే చ విన్యసేత్ ॥
సర్వసిద్ధ్యాదికం కంఠే ప్రాదక్షిణ్యేన విన్యసేత్ ।
హృదయే మనుకోణస్థాః శక్తయోపి చ పూర్వవత్ ॥
నాభౌ త్వష్టదళం తత్ర వంశే వామే చ పార్శ్వకే ।
ఉదరే సవ్యపార్శ్వే చ న్యసే దాది చతుష్టయం ॥

స్వాధిష్ఠానే న్యసే త్స్వస్య పూర్వా ద్దక్షావసానకం ।
మూలాధారే న్యసే న్ముద్రాదశకం సాధకోత్తమః ॥
పురః సవ్యే చ వంశే చ వామే చైవాంతరాళకే ।
ఊర్ధ్వాధో దశముద్రాశ్చ ఊర్ధ్వాధో వర్జితం పునః ॥
బ్రహ్మాణ్యాద్యష్టకం దక్ష జంఘాయాంతాశ్చ పూర్వవత్ ।
వామజంఘాంస మారభ్య వామాది క్రమతోపి చ ॥
సిద్ధ్యష్టకం న్యసే త్తేషు ద్వయం పాదతలే న్యసేత్ ।
కారణా త్ప్రస్రుతం న్యాసం ద్దీపాద్దీపమివోదితం ॥
ఏవం విన్యస్య దేవేశి స్వాత్మాభేదేన చింతయేత్ ।

చాలా తంత్ర గ్రంథాలలో శ్రీచక్రన్యాసము చెప్పబడింది. ఇంకొక తంత్రంలో శ్రీచక్రన్యాసము సృష్టి క్రమము ఈ విధంగా ఉన్నది.

**సృష్టి న్యాసము :**

బైందవం బ్రహ్మరంధ్రే చ తత్సంవృత్య త్రికోణకం ।
లలాటేఽష్టార సంజ్ఞం చ భ్రువోర్మధ్యే దశారకమ్ ॥
బహిర్దశారకం కంఠే హృదయే మనుపత్రకం ।
కుక్షౌతు ప్రథమం వృత్తం నాభౌ త్వష్టదళాంబుజమ్ ॥
కట్యోర్ద్వితీయం వలయం స్వాధిష్ఠానే కళాస్రకం ।
తస్మాత్తృతీయం వలయ మాధారే చతురస్రకమ్ ॥
ద్వితీయం దక్షజంఘాయాం తృతీయం వామజంఘకే ।
త్రిపురేశీ మహాయంత్ర సృష్టిన్యాసే త్వయం క్రమః ॥

**దీర్ఘన్యాసము :**

శ్రీచక్రాంతర్గత దేవతలను సాధకుని శరీరంలోని కొన్ని భాగాలలోనే కాకుండా అన్ని భాగాలలోనూ ఆవాహన చెయ్యటాన్ని దీర్ఘన్యాసము అంటారని ముందే చెప్పటం జరిగింది. ఆ విధంగా శ్రీచక్రంలో నవావరణలను, వాటిలోని దేవతలను ఆవాహన చెయ్యటం జరుగుతోంది. ముందుగా సంహార క్రమంలో చెప్పబడుతున్నది.

**శ్రీచక్రన్యాసము - సంహార క్రమము :**

*శరీరం చింతయే దాదౌ నిజం శ్రీచక్రరూపకం ।*

*త్వగాద్యాకార నిర్ముక్తం జ్వలత్కాలాగ్ని సన్నిభమ్ ॥*

*తతస్తు న్యాసయోగేన శ్రీచక్రం పరిచింతయేత్ ।*

*షట్చక్రేషు లలాటే చ సీమంతే చ శిరోబిలే ॥*

*నవస్థానాని సంకల్ప్య న్యసేద్దేవితతః పరం ।*

*ప్రకటాద్యాః క్రమాత్పశ్చా దాధారాదిషు మంత్రవిత్ ॥*

అస్యశ్రీ శ్రీచక్రన్యాసస్య దక్షిణామూర్తి ఋషిః। పంక్తి శ్ఛందః। శ్రీ మహాత్రిపురసుందరీ దేవతా। ఐం బీజం। సౌః శక్తిః। క్లీం కీలకం। శ్రీవిద్యాంగత్వేన న్యాసే వినియోగః॥ కూటత్రయ ద్వారావృత్త్యాన్యాసః ॥

*నకుంకుమ విలేపనా ...... స్మరామ్యంబికామ్ ॥*

**త్రైలోక్యమోహన చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం సమస్త ప్రకటగుప్త గుప్తతర సంప్రదాయకులనిగర్భ రహస్యాతి రహస్య పరాపర రహస్య సంజ్ఞక శ్రీచక్రగతయోగినీ పాదుకాభ్యో నమ ఇతి సర్వాంగే వ్యాపకం విన్యస్య। అం ఆం సౌః త్రైలోక్య మోహన చక్రాయ నమ ఇతి వ్యాపకంన్యస్య।

ఓం ఐం హ్రీం శ్రీం అంచతురస్రాద్య రేఖాయై నమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య।

*నిధివాహన మారూఢా వరాభయకరాంబుజా ।*

*పద్మరాగ ప్రతీకాశాః ప్రసీదం త్వణిమాదయః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం అం అణిమాసిద్ధ్యై నమః - దక్షాంసపృష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం లం లఘిమాసిద్ధ్యై నమః - దక్షకరాంగుళ్యగ్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం మం మహిమాసిద్ధ్యై నమః - దక్షిణస్ఫిచి ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఈం ఈశిత్వసిద్ధ్యై నమః - దక్షపాదాంగుళ్యగ్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం వం వశిత్వసిద్ధ్యై నమః - వామపాదాంగుళ్యగ్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ప్రాం ప్రాకామ్యసిద్ధై నమః - వామస్ఫిచి ॥

ఓం ఐం హ్రీం శ్రీం భుం భుక్తిసిద్ధ్యై నమః - వామపాణ్యంగుళ్యగ్రే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఇం ఇచ్ఛాసిద్ధ్యై నమః - వామాంసపృష్ఠే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ప్రాం ప్రాప్తిసిద్ధ్యై నమః - శిఖామూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం సం సర్వకామసిద్ధ్యై నమః - చూలీపృష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఆం చతురస్రమధ్య రేఖాయై నమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య ॥

*చతుర్భుజా స్త్రినయనాః పద్మశూ లాది హేతయః ।*
*విచిత్రా భరణాదేవ్యః ప్రసీదం త్వష్టమాతరః ॥*

ఓం ఆం హ్రీం శ్రీం ఆం బ్రాహ్మ్యై నమః - పాదాంగుష్ఠద్వయే ॥
ఓం ఆం హ్రీం శ్రీం ఈం మాహేశ్వర్యై నమః - దక్షపార్శ్వే ॥
ఓం ఆం హ్రీం శ్రీం ఊం కౌమార్యై నమః - మూర్ధ్ని ॥
ఓం ఆం హ్రీం శ్రీం ఋూం వైష్ణవ్యై నమః - వామపార్శ్వే ॥
ఓం ఆం హ్రీం శ్రీం ౡం వారాహ్యై నమః - వామజానుని ॥
ఓం ఆం హ్రీం శ్రీం ఐం మాహేంద్ర్యై నమః - దక్షజానుని ॥
ఓం ఆం హ్రీం శ్రీం ఔం చాముండాయై నమః - దక్షాంసే ॥
ఓం ఆం హ్రీం శ్రీం అః మహాలక్ష్మ్యై నమః - వామాంసే ॥
ఓం ఆం హ్రీం శ్రీం సౌః చతురస్రాంత్య రేఖాయై నమః ॥
ఇతివక్ష్యమాణ స్థానేషు వ్యాపకం విన్యస్య ॥

*ముద్రాదేవ్యః ప్రసీదంతు వరాభయక రాంబుజాః ।*
*భక్తానుగ్రహసంధాన దేవతామోద హేతవః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం ద్రాం సర్వ సంక్షోభిణ్యై నమః - పాదాంగుష్ఠద్వయే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ద్రీం సర్వవిద్రావిణ్యై నమః - దక్షపార్శ్వే ॥
ఓం ఐం హ్రీం శ్రీం క్లీం సర్వార్షికణ్యై నమః - మూర్ధ్ని ॥
ఓం ఐం హ్రీం శ్రీం బ్లూం సర్వవశంకర్యై నమః - వామపార్శ్వే ॥0–
ఓం ఐం హ్రీం శ్రీం సః సర్వోన్మాదిన్యై నమః - వామజానుని ॥
ఓం ఐం హ్రీం క్రోం సర్వమహాంకుశాయై నమః - దక్షజానుని ॥

ఓం ఐం హ్రీం హ్స్ఖ్ఫ్రేం సర్వఖేచర్యై నమః - దక్షాంసే ॥

ఓం ఐం హ్రీం శ్రీహ్సౌం సర్వబీజాయై నమః - వామాంసే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం సర్వయోన్యై నమః - పాదాంగుష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రైం హ్స్క్ల్రీం హ్సౌః సర్వత్రిఖండాయై నమః ద్వాదశాంతే ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః త్రైలోక్యమోహనచక్రేశ్వర్యై

త్రిపురాయై నమః హృదయే ॥ శ్రీమహాత్రిపురసుందరీం శృంగారరసాత్మికాం ధ్యాయేత్॥

***సర్వాశాపరిపూరక చక్రన్యాసము :***

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సర్వాశా పరిపూరక చక్రాయ షోడశదళపద్మాయనమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య ॥

*రక్తాసనా రక్తవర్ణా రక్తాంబర విభూషణాః ।*
*పాశాంకుశ కరాధ్యేయాః కామాకర్షిణికాదయః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం అంకామకర్షిణీనిత్యాకళాయై నమః - దక్షిణశ్రోత్రపృష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం బుద్ధ్యాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షిణాంసే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఇం అహంకారాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షకూర్పరే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఈం శబ్దాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షిణకరపృష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఉం స్పర్శాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షిణోరౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఊం రూపాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షజానుని ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఋం రసాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షగుల్ఫే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ౠం గంధాకర్షిణీ నిత్యాకళాయై నమః - దక్షపాదతలే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఌం చిత్తాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామపాదతలే

ఓం ఐం హ్రీం శ్రీం ౡం ధైర్యాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామగుల్ఫే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఏం స్మృత్యాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామజానుని ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం నామాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామోరౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఓం బీజాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామకరపృష్ఠ ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఔం ఆత్మాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామకూర్పరే ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం అమృతాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామాంసే ॥

ఓం ఐం హ్రీం శ్రీం అః శరీరాకర్షిణీ నిత్యాకళాయై నమః - వామకర్ణపృష్ఠే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సర్వాశాపరిపూరక చక్రేశ్వర్యై త్రిపురేశ్వర్యై నమః - హృదయే॥

శ్రీ మహా త్రిపుర సుందరీం వీరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వ సంక్షోభణ చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః సర్వసంక్షోభణ చక్రాయాష్టదళ పద్మాయ నమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య ॥

***అనంగకుసుమాద్యాశ్చ పాంతు మాం రక్తకంచుకాః ।***
***వేణీకృతకరో న్నమ్ర శరకార్ముక పాణయః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం కం .... జం అనంగ కుసుమాయై నమః - దక్షశంఖే ॥

ఓం ఐం హ్రీం శ్రీం చం ....ఞం అనంగ మేఖలాయై నమః - దక్షజత్రుణి ॥

ఓం ఐం హ్రీం శ్రీం టం .... ణం అనంగమదనాయై నమః - దక్షోరౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం తం ... నం అనంగమదనాతురాయై నమః - దక్షగుల్ఫే ॥

ఓం ఐం హ్రీం శ్రీం పం ... మం అనంగరేఖాయై నమః - వామగుల్ఫే ॥

ఓం ఐం హ్రీం శ్రీం యం ... వం అనంగ వేగిన్యై నమః - వామోరౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం శం ... హం అనంగాం కుశాయై నమః - వామజత్రుణి ॥

ఓం ఐం హ్రీం శ్రీం ళం క్షం అనంగమాలిన్యై నమః - వామశంఖే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః సర్వసంక్షోభణ చక్రేశ్వర్యై త్రిపురసుందర్యై నమః -హృది॥

శ్రీ మహా త్రిపురసుందరీం కరుణ రసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వ సౌభాగ్యదాయక చక్రన్యాసము**

ఓం ఐం హ్రీం శ్రీం హైం హ్క్లీం హ్సౌః సర్వ సౌభాగ్యదాయక చక్రాయ చతుర్దశారచక్రాయ నమ ఇతి వక్ష్యమాణస్థాణేషు వ్యాపకం విన్యస్య.

***క్షోభిణ్యాద్యాః ప్రసీదంతు బాణకార్ముక పాణయః ।***
***సర్వాభరణ సంపన్నాః పృథురుక్మ సురోచిషః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం కం సర్వసంక్షోభిణ్యై నమః - లలాటే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఖం సర్వవిద్రావిణ్యై నమః - తద్దక్షభాగే ॥
ఓం ఐం హ్రీం శ్రీం గం సర్వాకర్షిణ్యై నమః - దక్షగండే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఘం సర్వాహ్లాదిన్యై నమః - దక్షాంసే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఙం సర్వసంమోహిన్యై నమః - దక్షపార్శ్వే ॥
ఓం ఐం హ్రీం శ్రీం చం సర్వ స్తంభిన్యై నమః - దక్షోరౌ ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఛం సర్వజృంభిణ్యై నమః - దక్షజంఘాయాం ॥
ఓం ఐం హ్రీం శ్రీం జం సర్వవశంకర్యై నమః - వామజంఘాయాం ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఝం సర్వరంజన్యై నమః - వామోరౌ ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఞం సర్వోన్మాదిన్యై నమః - వామపార్శ్వే ॥
ఓం ఐం హ్రీం శ్రీం టం సర్వార్థసాధిన్యై నమః - వామాంసే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఠం సర్వ సంపత్తి పూరణ్యై నమః - వామగండే ॥
ఓం ఐం హ్రీం శ్రీం డం సర్వమంత్రమయ్యై నమః - లలాటవామభాగే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఢం సర్వద్వంద్వక్షయ కర్యై నమః - లలాటపృష్ఠ భాగే ॥
ఓం ఐం హ్రీం శ్రీం హైం హ్క్లీం హ్సౌః సర్వసౌభాగ్యదాయక చక్రేశ్వర్యై త్రిపురవాసిన్యై నమః-హృదయే॥
శ్రీ మహా త్రిపుర సుందరీం భయానకరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వార్థసాధక చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః సర్వార్థ సాధక చక్రాయ బహిర్దశార చక్రాయ నమ ఇతి వక్ష్యమాణ స్థానేషు వ్యాపకం విన్యస్య ॥

***దశ దేవ్యః ప్రసీదంతు సర్వసిద్ధి ప్రదాదికాః ।***
***రక్తా స్స్రపుష్పహారాఢ్యా వరదా భయపాణయః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం ణం సర్వసిద్ధి ప్రదాయై నమః - దక్షనేత్రే ॥
ఓం ఐం హ్రీం శ్రీం తం సర్వసంపత్ప్రదాయై నమః - నాసామూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం థం సర్వప్రియంకర్యై నమః - వామనేత్రే ॥
ఓం ఐం హ్రీం శ్రీం దం సర్వమంగళ కారిణ్యై నమః - వామబాహుమూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ధం సర్వకామప్రదాయై నమః - వామోరుమూలే ॥

ఓం ఐం హ్రీం శ్రీం నం సర్వదుఃఖ విమోచిన్యై నమః - వామజానుని ॥
ఓం ఐం హ్రీం శ్రీం పం సర్వమృత్యు ప్రశమన్యై నమః - గుదే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ఫం సర్వవిఘ్న నివారిణ్యై నమః - దక్షజానుని ॥
ఓం ఐం హ్రీం శ్రీం బం సర్వాంగ సుందర్యై నమః - దక్షోరుమూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం భం సర్వసౌభాగ్యదాయిన్యై నమః - దక్ష బాహుమూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః సర్వార్థ సాధక చక్రేశ్వర్యై త్రిపురాశ్రియై నమః - హృదయే॥
శ్రీమహాత్రిపురసుందరీం భీభత్స రసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వరక్షాకర చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం సర్వరక్షాకర చక్రాయాంతర్దశారచక్రాయ నమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య ॥

*సుప్రసీదంతు దేవ్యశ్చ పుస్తకాక్షాళిపాణయః ।*
*శుద్ధస్ఫటిక సంకాశా స్సర్వజ్ఞా ద్యాశ్చ దేవతాః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం మం సర్వజ్ఞాయై నమః - దక్షనాసాపుటే ॥
ఓం ఐం హ్రీం శ్రీం యం సర్వశక్త్యై నమః - దక్షసృక్కిణ్యాం ॥
ఓం ఐం హ్రీం శ్రీం రం సర్వైశ్వర్య ప్రదాయై నమః - దక్షస్తనే ॥
ఓం ఐం హ్రీం శ్రీం లం సర్వజ్ఞానమయ్యై నమః - దక్షముష్కే ॥
ఓం ఐం హ్రీం శ్రీం వం సర్వవ్యాధి వినాశిన్యై నమః - సీవిన్యాం ॥
ఓం ఐం హ్రీం శ్రీం శం సర్వాధార స్వరూపాయై నమః - వామముష్కే ॥
ఓం ఐం హ్రీం శ్రీం షం సర్వ పాపహరాయై నమః - వామస్తనే ॥
ఓం ఐం హ్రీం శ్రీం సం సర్వానందమయ్యై నమః - వామసృక్కిణ్యాం ॥
ఓం ఐం హ్రీం శ్రీం హం సర్వరక్షా స్వరూపిణ్యై నమః - వామనాసాపుటే ॥
ఓం ఐం హ్రీం శ్రీం క్షం సర్వేప్సిత ఫలప్రదాయై నమః - నాసాగ్రే ॥
ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం సర్వరక్షాకర చక్రేశ్వర్యై త్రిపురమాలిన్యై నమః - హృదయే॥
శ్రీ మహాత్రిపుర సుందరీం రౌద్ర రసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వరోగహర చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః సర్వరోగహర చక్రాయాష్టకోణచక్రాయ నమ ఇతి వక్ష్యమాణస్థానేషు వ్యాపకం విన్యస్య ॥

*వాగ్దేవతాః ప్రసీదంతు సిందూర కనకాంబరాః ।*

*పుస్తకాక్షాళివిలస ద్వరదా భీతిపాణయః ॥*

ఓం ఐం హ్రీం అం ౧౬ బ్లేం వశినీవాగ్దేవతాయై నమః - చిబుకే ॥

ఓం ఐం హ్రీం శ్రీం కం ౫ క్ల్హ్రీం కామేశ్వరీ వాగ్దేవతాయై నమః - కంఠదక్షభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం చం ౫ న్వ్లీం మోదినీ వాగ్దేవతాయై నమః - హృదయదక్షభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం టం ౫ య్లూం విమలా వాగ్దేవతాయై నమః - నాభిదక్షభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం తం ౫ జ్మ్రీం అరుణా వాగ్దేవతాయై నమః - నాభివామభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం పం ౫ హస్ల్వ్యూం జయినీ వాగ్దేవతాయై నమః - హృదయవామభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం యం ౪ ర ఝ్మ్ర్యూం సర్వేశ్వరీ వాగ్దేవతాయై నమః - కంఠవామభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం శం ౬ క్ష్మ్రీం కౌళినీ వాగ్దేవతాయై నమః - చిబుకవామభాగే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః సర్వరోగహర చక్రేశ్వర్యై త్రిపురా సిద్ధాయై నమః- హృదయే ॥

శ్రీమహా త్రిపురసుందరీం హాస్యరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వసిద్ధిప్రదచక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైం హ్స్క్ల్రీం హ్స్రౌః సర్వసిద్ధి ప్రదచక్రాయత్రికోణ చక్రాయ నమ ఇతి వక్ష్యమాణ స్థానేషు వ్యాపకం న్యస్య ॥

*రక్తవర్ణా రక్తభూషా వరదాభయపాణయః ।*

*సాయుధా మకుటోపేతా ధ్యాయే దాయుధ దేవతాః ॥*

హృదయస్థ త్రికోణాద్బ హిశ్చతుర్దిక్షు పశ్చిభాది క్రమేణ -

ఓం ఐం హ్రీం శ్రీం ద్రాం ద్రీం క్లీం బ్లూం సః యాం రాం లాం వాం శాం సర్వజంభన బాణేభ్యోనమః పశ్చిమే ॥

ఓం ఐం హ్రీం శ్రీం థం ధం సర్వమోహన ధనుర్భ్యాం నమః - ఉత్తరే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం ఆం సర్వవశంకర పాశాభ్యాం నమః - పూర్వే ॥

ఓం ఐం హ్రీం శ్రీం క్రోం సర్వ స్తంభనాంకుశాభ్యాం నమః - దక్షిణే ॥

*పాశాంకుశామృతకపాల వరాభయాంకైః*

*హస్తై శ్చతుర్భి రభిరామ తమారుణాంగీ ।*

*కోణాగ్రగా త్రినయనా తరుణేందు చూడా*

*కామేశ్వరీ మమ దదాతు సమస్తకామాన్ ॥*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩క ౫సౌః ౫మహా కామేశ్వర్యై నమః - హృదయస్థ త్రికోణాగ్ర కోణే॥

*బాలప్రవాళ రుచిరాకరమట్కసంగీ*

*చాపేషు పాశసృణిమస్తక మాతులాంగీ ।*

*వజ్రేశ్వరీ ప్రథిత దక్షిణకోణసంస్తా*

*వజ్రోజ్వలాంగీ దిశతు మమ వాంఛితాని ॥*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩ హ ౫ సౌః ౫ మహావజ్రేశ్వర్యై నమః - దక్షకోణే॥

*ప్రత్యచ్ఛ శంఖరుచిరా శ్రిత వామకోణా*

*పాశాంకుశాక్షగుణ పుస్తకశాస్త్రహస్తా ।*

*ఉద్భాసయ త్వనిశ మద్భుతభూరిశక్తి*

*ర్భాగ్యశ్రియం భగవతీ భగమాలినీ మే ॥*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩ స ౩ సౌః మహాభగమాలిన్యై నమః - వామకోణే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైం హ్స్క్లీం హ్స్రౌః సర్వసిద్ధి ప్రదచక్రేశ్వర్యై త్రిపురాంబాయై నమః - హృదయే ॥

శ్రీ మహాత్రిపురసుందరీ మద్భుతరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వానందమయ చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం మూలం సర్వానందమయ చక్రాయ బిందు చక్రాయనమ ఇతి హృదయే వ్యాపకం న్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం మూలం శ్రీమహాత్రిపురసుందర్యై నమః - హృదయే ॥

ఓం ఐం హ్రీం శ్రీం మూలం సర్వానందమయ చక్రేశ్వర్యై శ్రీ మహా త్రిపుసుందర్యై నమః
- హృదయే॥

శ్రీ మహా త్రిపుర సుందరీం శాంతరసాత్మికాం ధ్యాత్వా ॥

ఓం ఐం హ్రీం శ్రీం సమస్త ప్రకట ..... పాదు కాభ్యోనమ ఇతి సర్వాంగే వ్యాపకన్యాసం కృత్వా పంచోపచారై స్సంపూజయేత్॥

ఇదే విధంగా సృష్టి న్యాసము కుడా చెప్పబడుతోంది. సృష్టి న్యాసము బిందువుతో మొదలయి భూపురంతో పూర్తి అవుతుంది. ఆవరణలలోని దేవతలు గతంలో చెప్పినట్లే ఉంటాయి కాబట్టి ధ్యాన శ్లోకాలు, ఆవరణ దేవతలు గతంలో ఉన్నట్లుగానే భావించగలరు.

## సృష్టి న్యాసము

**సర్వానందమయ చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం షోడశాక్షరీ అం సర్వానంధమయ బిందు చక్రాయ నమ ఇతి బ్రహ్మరంధ్రే వ్యాపకం విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం మూలం పరబ్రహ్మచక్రే ఓడ్యాణపీఠే చర్యానందనాథాత్మకే సమస్తచక్ర సపరివార పరమతత్వ సృష్టిస్థితి సంహారకృత్యేచ్ఛా జ్ఞానక్రియా శక్తి వాగ్భవ కామరాజశక్తి బీజాత్మక పరబ్రహ్మాత్మశక్తి శ్రీమహాత్రిపురసుందర్యై నమః - బ్రహ్మరంధ్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం మూలం సర్వానందమయ బిందు చక్రేశ్వర్యై శ్రీమహా త్రిపురసుందర్యై నమః -బ్రహ్మరంధ్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం సిద్ధి సిద్ధవృతరత్న ... పరదేవతాం శివామ్ ఇతి ధ్యాత్వా ॥

శ్రీ మహాత్రిపురసుందరీం శాంతరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వసిద్ధిప్రద చక్రన్యాసము**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రైం హ్క్లీం హ్సౌః అం సర్వసిద్ధి ప్రద త్రికోణచక్రాయనమః॥

ఇతి శిరస్త్రికోణే వ్యాపకం విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩ క ౫ సౌః ౫ అగ్ని చక్రే కామ గిర్యాలయే మిత్రేశానంద నాథాత్మకే నవయోని చక్రాత్మ తత్వ సృష్టికృత్యేచ్ఛాశక్తి వాగ్భవాత్మక వాగీశ్వరీ స్వరూప కామేశ్వరీ బ్రహ్మాత్మ శక్త్యై నమః - శిరస్థిత త్రికోణా గ్రకోణే ॥

*పాశాంకుశామృత ...... సమస్తకామాన్ ॥*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩ హ ౫ సౌః ౫ సూర్యచక్రే జాలంధర పీఠే షష్ఠీశానందనాథాత్మకే దశారద్వయ చతుర్దశార చక్రాత్మకే విద్యాతత్త్వస్థితికృత్య జ్ఞానశక్తి రూపకామ రాజాత్మక కామకళాస్వరూప వజ్రేశ్వరీ విష్ణ్వాత్మశక్త్యై నమః - తద్దక్షకోణే ॥

*బాలప్రవాళరుచిరా ...... వాంఛితాని ॥*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీం ౫ ఓం ౩ స ౩ సౌః ౫ సోమచక్రే పూర్ణ గిరిగహ్వరే ఉడ్డీశానందనాథాత్మకే అష్టారషోడశార చతురస్ర చక్రాత్మకే శివతత్త్వ సంహారకృత్య క్రియాశక్తి రూప శక్తి బీజాత్మక భగమాలినీ రుద్రాత్మశక్త్యై నమః - తదుత్తర కోణే ॥

*ప్రత్యచ్ఛశంఖ రుచిరా ..... భగమాలినీమే ॥*

ఓం ఐం హ్రీం శ్రీం హ్రైం హ్స్క్లీం హ్సౌః సర్వసిద్ధిప్రదచక్రేశ్వర్యై త్రిపురాంబాయై నమః ॥ ఇతి కామేశ్వర్యాః పురతో విన్యస్య ॥ శ్రీమహా త్రిపురసుందరీ మద్భుతరసాత్మికాం ధ్యాయేత్ ॥

**ఆయుధన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం ద్రాం ద్రీం క్లీం బ్లూం సః సర్వజంభనేభ్యః కామేశ్వర బాణేభ్యో నమః - దక్షనేత్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం యాం రాం లాం వాం సాం సర్వజంభనేభ్యః కామేశ్వరీ బాణేభ్యో నమః - వామనేత్రే ॥

ఓం ఐం హ్రీం శ్రీం థం సర్వమోహనాయ కామేశ్వరధనుషే నమః - దక్షభ్రూస్థానే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ధం సర్వ మోహనాయ కామేశ్వరీ ధనుషే నమః - వామభ్రూస్థానే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఆం సర్వవశీకరణాయ కామేశ్వర పాశాయ నమః - దక్షకర్ణే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం సర్వవశీకరణాయ కామేశ్వరీ పాశాయ నమః - వామకర్ణే ॥

ఓం ఐం హ్రీం శ్రీం క్రోం సర్వ స్తంభనాయ కామేశ్వరాంకుశాయ నమః - నాసాగ్రే దక్షిణతః॥

ఓం ఐం హ్రీం శ్రీం క్రోం సర్వ స్తంభనాయ కామేశ్వర్యంకుశాయ నమః - వామనాసాగ్రే వామతః ॥

**సర్వరోగహర చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః కం సర్వరోగ హరాష్టార చక్రాయనమః॥ ఇతి లలాటే వ్యాపకం విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం ౧౬ ర్బ్లూం వశినీ వాగ్దేవతాయై నమ ఇత్యాది ।

ఓం ఐం హ్రీం శ్రీం శం ౬ క్ష్మ్రీం కౌళినీ వాగ్దేవతాయై నమ ఇత్యంతం వాగ్దేవతాష్టకం ప్రాదక్షిణ్యేన లలాటే ముండమాలాక్రమేణ ప్రాగాదిదిగష్టకే విన్యస్య ॥

*ఏతా వాగ్దేవతా ధ్యేయా దాడిమీ కుసుమారుణాః ।*

*ధనుర్బాణధరా అక్షస్రక్పుస్తక కరాంబుజాః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః సర్వరోగహర చక్రేశ్వర్యై త్రిపురాసిద్ధాయై నమః ఇతి వశిన్యగ్రే విన్యస్య ॥ శ్రీ మహాత్రిపురసుందరీం హాస్యరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వరక్షాకర చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం రం సర్వరక్షాకరాంతర్దశారచక్రాయ నమ ఇతి నేత్రమూలాది స్థానేషు వ్యాపకం న్యస్య.

ఓం ఐం హ్రీం శ్రీం మం సర్వజ్ఞాయై నమః - దక్ష నేత్ర మూలే ॥
ఓం ఐం హ్రీం శ్రీం యం సర్వశక్త్యై నమః - తదపాంగే ॥
ఓం ఐం హ్రీం శ్రీం రం సర్వైశ్వర్య ప్రదాయై నమః - దక్షకర్ణ పూర్వభాగే ॥
ఓం ఐం హ్రీం శ్రీం లం సర్వజ్ఞానమయ్యై నమః - దక్షకర్ణపృష్ఠే ॥
ఓం ఐం హ్రీం శ్రీం వం సర్వవ్యాధి వినాశిన్యై నమః - శిఖాంతరాళ దక్షిణార్ధే ॥
ఓం ఐం హ్రీం శ్రీం శం సర్వాధార స్వరూపాయై నమః - శిఖాంతరాళోత్తరార్ధే ॥
ఓం ఐం హ్రీం శ్రీం షం సర్వపాపహరాయై నమః - వామకర్ణ పృష్ఠే ॥
ఓం ఐం హ్రీం శ్రీం సం సర్వానందమయ్యై నమః - వామకర్ణ పూర్వదేశే
ఓం ఐం హ్రీం శ్రీం హం సర్వరక్షా స్వరూపిణ్యై నమః - వామనేత్రాంతే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ళం సర్వేప్సితఫలప్రదాయై నమః - వామనేత్రమూలే ॥

*ధ్యేయా అంతర్దశారస్థా ఏతా దేవ్య అభీష్టదాః ।*

*కర్పూరగౌర దేహాస్తాస్స్రక్పుస్తక కరాంబుజాః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం సర్వరక్షాకర చక్రేశ్వర్యై త్రిపురమాలిన్యై నమ ఇతి సర్వజ్ఞా గ్రేవిన్యస్య ॥ శ్రీమహాత్రిపురసుందరీం రౌద్రరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వార్థసాధక చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః ఏం సర్వార్థ సాధక బహిర్దశార చక్రాయ నమ ఇతి కంఠే ప్రాదక్షిణ్యేన వ్యాపకం విన్యస్య ॥

***ధ్యేయా బహిర్దశారస్థా ముక్తాహార విభూషణాః ।***
***దేవ్యో హిమాంశు సంకాశాః కర్పూర ధవళాంబరాః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం ణం సర్వసిద్ధి ప్రదాయై నమ ఇత్యాది । ఓం ఐం హ్రీం శ్రీం భం సర్వసౌభాగ్య దాయిన్యై నమ ఇతి కంఠే ప్రాదక్షిణ్యేన విన్యస్య ॥ ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః సర్వార్థ సాధక చక్రేశ్వర్యై త్రిపురాశ్రియై నమ ఇతి సర్వసిద్ధి ప్రదాగ్రే విన్యస్య॥

శ్రీ మహాత్రిపురసుందరీం భీభత్సరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వసౌభాగ్యదాయక చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హైం హ్క్లీం హ్సౌః ఈం సర్వసౌభాగ్యదాయక చతుర్దశార చక్రాయనమః - హృదయే ప్రాదక్షిణ్యేన వ్యాప్య ॥

***ధ్యేయాశ్చతుర్దశారస్థా స్సంక్షోభిణ్యాది శక్తయః ।***
***ప్రవాళతామ్రవపుషో ధనుర్బాణోల్ల సత్కరాః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం కం సర్వసంక్షోభిణ్యై నమ ఇత్యాది ఓం ఐం హ్రీం శ్రీం ఢం సర్వద్వంద్వ క్షయంకర్యై నమ ఇతి హృదయే ప్రాదక్షిణ్య క్రమేణ విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం హైం హ్క్లీం హ్సౌః ఈం సర్వసౌభాగ్యదాయక చక్రేశ్వర్యై త్రిపురవాసిన్యై నమ ఇతి సర్వసంక్షోభిణ్యాగ్రే విన్యస్య ॥ శ్రీ మహాత్రిపురసుందరీం భయానకరసాత్మికాం ధ్యాయేత్ ॥

**సర్వ సంక్షోభణ చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః హం సర్వ సంక్షోభణాష్టదళ పద్మాయ నమ ఇతి నాభౌ ప్రాదక్షిణ్య క్రమేణ వ్యాప్య ॥

***ధ్యాతవ్యా అష్టపత్రస్థాః పుష్పే పుష్పాస్త్రపాణయః ।***
***రక్తాంగ్యో రక్తవసనా వేణీ కృతకచా స్సదా ॥***

ఓం ఐం హ్రీం శ్రీం కం ౫ అనంగకుసుమాయై నమః - పృష్ఠవంశే ॥
ఓం ఐం హ్రీం శ్రీం చం ౫ అనంగమేఖలాయై నమః - వామపార్శ్వే ॥
ఓం ఐం హ్రీం శ్రీం టం ౫ అనంగమదనాయై నమః - ఉదరే ॥
ఓం ఐం హ్రీం శ్రీం తం ౫ అనంగమదనాతురాయై నమః - దక్షపార్శ్వే ॥
ఓం ఐం హ్రీం శ్రీం పం ౫ అనంగరేఖాయై నమః - పృష్ఠవంశవామ పార్శ్వయో రంతరాళే॥
ఓం ఐం హ్రీం శ్రీం యం ౪ అనంగ వేగిన్యై నమః - ఉదరవామపార్శ్వయోరంతరాళే ॥
ఓం ఐం హ్రీం శ్రీం శం ౪ అనంగాంకుశాయై నమః - ఉదరదక్షపార్శ్వయోరంతరాళే ॥
ఓం ఐం హ్రీం శ్రీం ళం క్షం అనంగమాలిన్యై నమః - పృష్ఠవంశ దక్ష పార్శ్వయో రంతరాళే॥
ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః హం సర్వసంక్షోభణ చక్రేశ్వర్యై త్రిపురసుందర్యై నమః అనంగకుసుమాగ్రే విన్యస్య ॥ శ్రీ మహా త్రిపురసుందరీం కరుణరసాత్మికాంధ్యాయేత్ ॥

**సర్వాశాపరిపూరక చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సం సర్వాశాపరి పూరకషోడశ దళ పద్మాయ నమ ఇతి స్వాధిష్ఠానే వామావర్తేన వ్యాప్య ॥

***ఏతా ధ్యేయాః కళాదేవ్యః పాశాంకుశ కరాంబుజా : ।***
***బాలారుణ సమానాంగ్య స్సర్వాభరణ భూషితాః ॥***

ఓం ఐం హ్రీం శ్రీం అం కామాకర్షిణీ నిత్యాకళాయై నమ ఇత్యాది ఓం ఐం హ్రీం శ్రీం అః శరీరాకర్షిణీ నిత్యాకళాయై నమ ఇత్యంతం స్వాధిష్ఠానే షోడశారే వామావర్తేన పూర్వోత్తర పశ్చిమ దక్షిణ దిక్షు కామకర్షిణ్యాద్యా శ్చతస్ర శ్చతస్రశ్చ విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సర్వాశాపరిపూరక చక్రేశ్వర్యై త్రిపురేశ్వర్యై నమ ఇతి కామకర్షిణ్యాగ్రే విన్యస్య ॥ శ్రీమహాత్రిపురసుందరీం వీరరసాత్మికాం ధ్యాయేత్ ॥

**త్రైలోక్య మోహన చక్రన్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః లం త్రైలోక్య మోహనభూపురచక్రాయ నమ ఇతి మూలాధారాది పాద పర్యంతం వ్యాప్య ॥ ఓం ఐం హ్రీం శ్రీం సౌః చతురస్రాంత్య రేఖాయై నమ ఇతి మూలాధారేవ్యాప్య॥

***ఏతా రక్తా వరాభీతి పాశాంకుశ కరాంబుజాః ।***
***త్రిలోచనా శ్చంద్రధరా ముద్రాణా మధిదేవతా : ॥***

ఓం ఐం హ్రీం శ్రీం ద్రాం సర్వసంక్షోభిణ్యై నమ ఇత్యాది ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైం హ్స్క్లీం హ్స్రౌః సర్వ త్రిఖండాయై నమ ఇతి మూలాధారే ప్రాగాదిదిక్ష్వాగ్నేయాది విదిక్షు ప్రాదక్షిణ్యేన చతస్రశ్చతస్ర ఇంద్రేశానయోర్మధ్యే వరుణ నిరృత్యోర్మధ్యే చ విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఆం చతురస్రమధ్య రేఖాయై నమ ఇతి దక్షజంఘాయాం పూర్వాదిదిక్ష్వాగ్నేయాది విదిక్షు వ్యాప్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఆం బ్రాహ్మ్యై నమ ఇత్యాది ॥

ఓం ఐం హ్రీం శ్రీం అః మహాలక్ష్మ్యై నమ ఇత్యంతం దక్షజంఘాయాం ప్రాగాది దిక్ష్వాగ్నేయాది విదిక్షు పాదద్వయే చ విన్యస్య ॥ ఏతా వంశదళ శ్యామాః కపాలోత్పలధారిణ్యః బంధూకాభ పరీధానా ధ్యేయా బ్రాహ్మ్యాది మాతరః ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం చతురస్రాద్యరేఖాయై నమ ఇతి వామజంఘా మారభ్య ప్రాగుత్తర పశ్చిమదక్షిణదిక్షు ఈశానాద్యాగ్నేయా తవిదిక్షు వామపాదతలే దక్షపాదతలే చక్రమేణ వ్యాపకం విన్యస్య ॥

*ఏతారత్న ప్రభా శ్చింతామణిరత్నో భయాంచితాః ।*
*త్రిలోచనా శ్చంద్రకళామౌనీధ్యాయేదభీష్టదాః ॥*

ఓం ఐం హ్రీం శ్రీం అం అణిమాసిద్ధ్యై నమ ఇత్యాది ॥

ఓం ఐం హ్రీం శ్రీం సం సర్వకామసిద్ధ్యై నమ ఇత్యంతం వామంజఘామారభ్య ప్రాగాదిదక్షిణాంతదిక్షు ఈశానాద్యాగ్నేయాంత విదిక్షు వామపాదతలే దక్షపాదతలే చక్రమేణ విన్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః లం త్రైలోక్య మోహన చక్రేశ్వర్యై త్రిపురాయై నమ ఇత్యణిమాసిద్ధ్యగ్రే విన్యస్య ॥

శ్రీమహాత్రిపురసుందరీం శృంగారరసాత్మికాం ధ్యాత్వా । పంచోపచారై స్సంపూజయేత్॥

**అంతః శ్రీచక్రన్యాసః :**

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః చతురస్ర త్రయాత్మక త్రైలోక్య మోహన చక్రాధిష్ఠాత్ర్యై అణిమాద్యష్టా వింశతి శక్తి సహిత ప్రకటయోగినీరూపాయై త్రిపురాదేవ్యై నమః - ఆధారే ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః షోడశదళపద్మాత్మక సర్వాశా పరిపూరక చక్రాధిష్ఠాత్ర్యై కామాకర్షిణ్యాది షోడశశక్తి సహిత గుప్తయోగినీ రూపాయై త్రిపురేశ్వరీ దేవ్యై నమః స్వాధిష్ఠానే॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః అష్టదళపద్మాత్మక సర్వసంక్షోభణ చక్రాధిష్ఠాత్ర్యై అనంగకుసుమాద్యష్ట శక్తి సహిత గుప్తతర యోగినీరూపాయై త్రిపురసుందరీదేవ్యై నమః - మణిపూరకే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హైం హ్క్లీం హ్సౌః చతుర్దశారాత్మక సర్వ సౌభాగ్యదాయక చక్రాధిష్ఠాత్ర్యై సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ శక్తి సహిత సంప్రదాయ యోగినీ రూపాయై త్రిపుర వాసినీ దేవ్యై నమః ॥ అనాహతే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః బహిర్దశారాత్మక సర్వార్థ సాధక చక్రాధిష్ఠాత్ర్యై సర్వసిద్ధిప్రదాది దశశక్తి సహిత కులయోగినీ రూపాయై త్రిపురాశ్రీ దేవ్యై నమః - విశుద్ధౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం అంతర్దశారాత్మక సర్వరక్షాకర చక్రాధిష్ఠాత్ర్యై సర్వజ్ఞాది దశశక్తి సహిత నిగర్భయోగినీ రూపాయై త్రిపురమాలినీదేవ్యై నమః - ఆజ్ఞాయాం॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః అష్టారాత్మక సర్వరోగహర చక్రాధిష్ఠాత్ర్యై వశిన్యాద్యష్ట శక్తి సహిత రహస్య యోగినీరూపాయై త్రిపురాసిద్ధాదేవ్యై నమః - లలాటే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్సైం హ్స్క్లీం హ్సౌః త్రికోణాత్మక సర్వసిద్ధిప్రద చక్రాధిష్ఠాత్ర్యై కామేశ్వర్యాది త్రిశక్తి సహితాతి రహస్య యోగినీరూపాయై త్రిపురాంబాదేవ్యై నమః - సీమంతే॥

ఓం ఐం హ్రీం శ్రీం మూలం బింద్వాత్మక సర్వానందమయ చక్రాధిష్ఠాత్ర్యై షడంగాయుధ దశశక్తి సహిత పరాపరరహస్య యోగినీరూపాయై శ్రీ మహా త్రిపురసుందరీ దేవ్యై నమః బ్రహ్మరంధ్రే॥

**భంగ్యంతరేణాంత శ్రీచక్రన్యాసః :**

స్పహస్రారవిషు సంజ్ఞిక షడ్గళాధారస్వాధిష్ఠాన మణిపూరకా నాహతవిశుద్ధి లంబికాజ్ఞాంతం పూరవన్నవ చక్రేశ్వరీ ర్న్యస్య ॥

ఓం ఐం హ్రీం శ్రీం అం ఆం సౌః - బిందౌ ॥

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః - అర్ధచంద్రే॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం సౌః - రోధిన్యాం ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రైం హ్క్లీం హ్సౌః - నాదే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైం హ్స్క్లీం హ్సౌః - నాదాంతే ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం బ్లేం - శక్తౌ॥

ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం శ్రీం సౌః - వ్యాపికాయాం ॥ ఓం ఐం హ్రీం శ్రీం హ్స్రైం హ్స్క్లీం హ్సౌః - సమనాయాం ॥ ఓం ఐం హ్రీం శ్రీం మూలం - ఉన్మనాయాం ॥ ఇతి ప్రతిచక్రేశ్వరీ మంత్రం హృదంతం న్యసేత్ ॥



# 12. నవావరణలు

ఆవరణ అంటే ప్రాకారము అని అర్థం. శ్రీచక్రంలో తొమ్మిది ప్రాకారాలున్నాయి. వాటినే తొమ్మిది ఆవరణలు అంటారు. శ్రీచక్రమనేది పరబ్రహ్మ స్వరూపము. అవ్యక్తమైన పరబ్రహ్మ బిందు రూపంలో ఉండేవాడు. ఈ సృష్టిని చేయగోరినటువంటివాడై తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. అవే ప్రకాశాంశ, విమర్శాంశలు. వారే శివశక్తులు. అని గతంలో వివరించటం జరిగింది. పరమేశ్వరుడికి ఈ సృష్టితో సంబంధం లేదు. అతడు కేవలం మోక్షప్రదాత. పరమేశ్వరి మాయాస్వరూపిణి. సృష్టిస్థితి లయకారిణి. వారి అంశలుగానే శ్రీచక్రంలో శివశక్తి చక్రాలు ఉన్నాయి. అయితే సృష్టికి కారణం పరమేశ్వరి కాబట్టి శ్రీచక్రంలో ఐదు శక్తి చక్రాలున్నాయి. ఇందులో ఉన్న శివశక్తి చక్రాలు ఆ పరమేశ్వరీ పరమేశ్వరులకు ప్రతీకలు. మొత్తం ఈ తొమ్మిది చక్రాలనే తొమ్మిది ఆవరణలు అంటారు. వీటిలో ప్రతి ఆవరణకు కొన్ని దళాలు లేదా కోణాలు ఉంటాయి. వాటన్నింటిలోనూ దేవతలుంటారు. ఇక్కడ శక్తి చక్రాలన్నీ కోణాకారంలో ఉంటాయి. మొత్తం శ్రీచక్రానికి అధిదేవత పరమేశ్వరి, పరమేశ్వరులు. శ్రీచక్రంలోని ఆవరణలను గురించి రత్నాయర్షి తన **'ఆవరణ దేవతాస్తుతి'లో** ఈ విధంగా అన్నారు.

*త్రైలోక్య మోహనంవందే । సర్వాశాపరిపూరకమ్ ।*
*సర్వసంక్షోభణం చక్రం । సర్వ సౌభాగ్య దాయకమ్ ।*
*సర్వార్థ సాధకం చక్రం । సర్వ రక్షాకరం పరమ్ ।*
*సర్వరోగహర చక్రం । సర్వ సిద్ధి ప్రదాయకమ్ ।*
*సర్వానందమయ చక్రమితి చక్ర క్రమం భజే ॥*

దీని ప్రకారము శ్రీచక్రంలోని ఆవరణల పేర్లు తెలుస్తున్నాయి. అయితే అవి ఏ ఆవరణల పేర్లో ఇప్పుడు చూద్దాం. శ్రీచక్రాన్ని వర్ణించేటప్పుడు బిందువు నుండి మొదలు పెట్టటము సంప్రదాయము.

*బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతమ్ ।*
*వసుదళ వృత్త కళాదళ వృత్త త్రిమహీ గృహం భజే చక్రమ్ ॥*

శ్రీచక్రంలో బిందువు, త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, పధ్నాలుగు కోణముల చక్రము ఒకటి, అష్ట దళము, షోడశ దళము, భూపురము అనే ఆవరణలున్నాయి. ఇప్పుడు ఇవి వరుసగా.

1. భూపురము - త్రైలోక్య మోహన చక్రము
2. షోడశ దళము - సర్వాశా పరిపూరక చక్రము
3. అష్ట దళము - సర్వ సంక్షోభిణీ చక్రము
4. మన్వస్రము - సర్వ సౌభాగ్య దాయకచక్రము
5. బహిర్దశారము - సర్వార్థ సాధక చక్రము
6. అంతర్దశారము - సర్వరక్షాకర చక్రము
7. అష్టకోణము - సర్వరోగహర చక్రము
8. త్రికోణము - సర్వ సిద్ధిప్రద చక్రము
9. బిందువు - సర్వానందమయ చక్రము.

అయితే వృత్తాలు ఆవరణలలో చేర్చబడలేదు. వీటికి పూజకూడా లేదు. ఈ తొమ్మిది చక్రాల లేక ఆవరణలలోని దేవతలనూ విడివిడిగా పూజించటాన్నే ఆవరణ పూజ అంటారు.

**I. ప్రథమావరణ :**

ఇది భూపురము. దీన్ని త్రైలోక్య మోహన చక్రము అంటారు. ఈ చక్రాన్ని అర్చించిన వారు ముల్లోకాలనూ సమ్మోహింప చేయకలుగుతారు. అదే ముముక్షువులైతే లోకంలోని జీవితం మీద వారికి వైరాగ్యం కలుగుతుంది. ఇందులో మూడు రేఖలు ఉంటాయి. అవి శుక్ల, పీత, అరుణ వర్ణాలలో ఉంటాయి. ఇది లకార ప్రకృతకము. భూతత్వాత్మకము. ఈ ఆవరణకు నాలుగు ద్వారాలుంటాయి. ఈ నాలుగు ద్వారాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. ఈ ద్వారాలలోకి గనక ప్రవేశించగలిగినట్లైతే పరదేవత సాక్షాత్కారము కలుగుతుంది.

*శ్రీచక్రస్య చత్వారి ద్వారాణి చతుర్వేద రూపాణి ।*
*ద్వార ప్రవేశనైవభవతి పరదేవతా సాక్షాత్కార: ॥*

ఇందులో మూడు రేఖలుంటాయని చెప్పటం జరిగింది. ఇప్పుడు ...

**ప్రథమ రేఖ :**

*నిధి వాహన మారూఢా వరాభయ కరాంబుజా ।*
*పద్మరాగ ప్రతీకాశా: ప్రసీదం త్వమణిమాదయ: ॥*

ఈ రేఖలో ఉండే దేవతలు అష్టసిద్ధులు

*గరిమాణం లఘిమాణం వశిత్వ మణి మహిమానౌ ।*

*ప్రాకామ్యం భక్త్యాహం వందే ప్రాప్తిం చ సర్వకామార్థమ్ ॥*

సాధకుని యొక్క కోర్కెలు తీరటానికి ఈ రేఖలోని దేవతలు సహాయపడతాయి. వీటినే అణిమాది అష్ట సిద్ధులు అంటారు. వాటి వివరాలు.

1. అణిమ - శరీరము అతి చిన్నదిగా చేయుట.
2. మహిమ - శరీరము అతి పెద్దదిగా చేయుట
3. గరిమ - శరీరము బరువును విపరీతముగా పెంచుట
4. లఘిమ - శరీరమును అతి తేలికగా చేయుట.
5. ప్రాప్తి - కావలసిన వస్తువులు పొందుట
6. ప్రాకామ్యము - ఆకాశ సంచారము.
7. ఈశిత్వము - సమస్తానికీ అధికారము పొందుట
8. వసిత్వము - సమస్త భూతములను లోబరచుకొనుట.

ఈ దేవతలను అర్చించినట్లైతే అ ఫలితాలు వస్తాయని చెప్పబడుతోంది.

**ద్వితీయ రేఖ :**

*చతుర్భుజా స్త్రినయనాః పద్మశూలాది హేతయః ।*

*విచిత్రాభరణాదేవ్యః ప్రసీదం త్వమష్టమాతరః ॥*

ఇక్కడ అష్టమాతృకలు ఉంటారు. వారు ....

*బ్రాహ్మీమాహేశ్వరీ కౌమారీ వైష్ణవీ చ వారాహీ ।*

*ఇంద్రాణీ చాముండా లక్ష్మీః పాందూ ద్వితీయభూగ్యహా ॥*

1) బ్రాహ్మి, 2) మాహేశ్వరీ, 3) కౌమారీ, 4) వైష్ణవీ, 5) వారాహి, 6) మాహేంద్రీ, 7) చాముండా, 8) మహాలక్ష్మి

**తృతీయా వరణ :**

*ముద్రాదేవ్యః ప్రసీదంతు వరాభయ కరాంబుజాః ।*

*భక్తానుగ్రహసంధాన దేవతా మోద హేతవః ॥*

ఈ రేఖలో ముద్రాశక్తులు ఉంటాయి. వీటిని గురించి గతంలో చెప్పబడింది.

*సర్వసంక్షోభణ ద్రావణకాకర్షణ కావేశ కోన్మాదాదీంశ్చ ।*
*ఖేచరీ బీజయోన్యాభ్యాః స్త్రితయశ్చ గృహేభజే ॥*

1) సర్వసంక్షోభిణీ, 2) సర్వ విద్రావిణీ, 3) సర్వాకర్షిణీ, 4) సర్వ వశంకరీ, 5) సర్వోన్మాదినీ, 6) సర్వమహాంకుశా, 7) సర్వ ఖేచరీ, 8) సర్వబీజా, 9) సర్వయోని, 10) సర్వత్రిఖండ అనే ముద్రాశక్తులుంటాయి.

*ఏతాః ప్రకటయోగిన్యః త్రిపురా చక్రనాయికా.*

ఇక్కడ ఉండే యోగిని పేరు ప్రకటయోగిని. ఈ ఆవరణకు అధిదేవత త్రిపుర. దీనిని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

**అణిమాసిద్ధే, లఘిమాసిద్ధే, గరిమా సిద్ధే, మహిమాసిద్ధే, ఈశిత్వసిద్ధే, వశిత్వ సిద్ధే, ప్రాకామ్య సిద్ధే, భుక్తి సిద్ధే, ఇచ్ఛాసిద్ధే, ప్రాప్తిసిద్ధే, సర్వకామసిద్ధే, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండీ, మహాలక్ష్మి, సర్వ సంక్షోభిణి, సర్వ విద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోని, సర్వత్రిఖండే, త్రైలోక్య మోహన చక్రస్వామిని, ప్రకట యోగిని.**

**2. ద్వితీయావరణ :**

ఇది సర్వాశా పరిపూరక చక్రము. పదహారు దళాలు గల పద్మము. చంద్ర కళా స్వరూపము. అంటే ఈ పద్మంలోని పదహారు దళాలలోనూ పదహారు కళలుంటాయి.

*రక్తాసనా రక్తవర్ణా రక్తాంబర విభూషణా ।*
*పాశాంకుశ కరా ధ్యేయాః కామాకర్షిణి కాదయః ॥*
*ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకళా ।*
*ద్వితీయాద్యా ద్వితీయాద్యా పక్షయో శుక్లకృష్ణయోః ॥*

పాడ్యమి నుండి పూర్ణిమ వరకు తిథులు పదిహేను. ఇవి శుక్ల కృష్ణ పక్షాలయందుంటాయి.

*దర్మాద్యాః పూర్ణిమాంతస్తు కళా పంచదశైవతు ।*
*షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥*

ధర్మ మొదలు పౌర్ణమి వరకు పదిహేను కళలు కాగా పదహారవ కళ సచ్చిదానంద రూపిణి అయి ఉన్నది.

సర్వాశా పరిపూరక చక్రము శ్వేతవర్ణము, సకార ప్రకృతికము, షోడశ కళాత్మకము. చంద్ర స్వరూపము. ఇక్కడ ....

*కామాకర్షిణికానిత్యా బుద్ధ్యాకర్షిణికాకళా*
*అహంకారాకర్షిణికానిత్యా శబ్దాకర్షిణికాతథా.*
*స్పర్శాకర్షిణికానిత్యా రూపాకర్షిణికాకళా*
*రసాకర్షిణికానిత్యా గంధాకర్షిణికాకళా*
*చిత్తాకర్షిణికానిత్యా ధైర్యాకర్షిణికాకళా*
*స్మృత్యాకర్షిణికానిత్యా నామాకర్షిణికాకళా*
*బీజాకర్షిణికానిత్యా చాత్మాకర్షిణికాకళా*
*అమృతాకర్షిణికానిత్యా శరీరాకర్షిణికాకళా*

ఈ ఆవరణలో పదహారు మంది ఆకర్షణ దేవతలుంటారు. వారు వరుసగా.

1) కామాకర్షిణి, 2) బుద్ధ్యాకర్షిణి, 3) అహంకారాకర్షిణి, 4) శబ్దాకర్షిణి, 5) స్పర్శాకర్షిణి, 6) రూపాకర్షిణి, 7) రసాకర్షిణి, 8) గంధాకర్షిణి, 9) చిత్తాకర్షిణి, 10) ధైర్యాకర్షిణి, 11) స్మృత్యాకర్షిణి, 12) నామాకర్షిణి, 13) బీజాకర్షిణి, 14) ఆత్మాకర్షిణి, 15) అమృతాకర్షిణి, 16) శీరీరాకర్షిణి

తిధులు నిత్యా స్వరూపాలు, నిత్యలు కళా స్వరూపాలు, అందుకనే ఇక్కడ కొన్ని చోట్ల నిత్యలు అని, కొన్ని చోట్ల కళలు అని చెప్పటం జరిగింది. రత్నాయర్షి మతం ప్రకారము ఇక్కడ ఎనిమిది మంది నిత్యలు, ఎనిమిది కళలు వెరసి పదహారు.

ఆకర్షణ దేవతలు అకారాది స్వర రూపంలో అంటే అ నుంచి అః వరకు అక్షర రూపంలో ఈ దళాలలో ఉంటారు.

*ఏతాస్తు గుప్త యోగిన్యః త్రిపురేశీ పదాంతికే*

ఈ ఆవరణకు అధి దేవత త్రిపురేసి. ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్త యోగిని. ఖడ్గమాలలో దీనిని గురించి ఈ విధముగా కలదు.

**కామాకర్షిణీ, బుద్ధ్యాకర్షిణీ, అహంకారాకర్షిణీ, శబ్దాకర్షిణీ, స్పర్శాకర్షిణీ, రూపాకర్షిణీ, రసాకర్షిణీ, గంధాకర్షిణీ, చిత్తాకర్షిణీ, ధైర్యాకర్షిణీ, స్మృత్యాకర్షిణీ, నామాకర్షిణీ, బీజాకర్షిణీ, ఆత్మాకర్షిణీ, అమృతాకర్షిణీ, శరీరాకర్షిణీ, సర్వాశాపరిపూరక చక్రస్వామిని, గుప్తయోగిని.**

### 3. తృతీయావరణ :

ఇది సర్వ సంక్షోభణ చక్రము. అష్టదళము. ఎనిమిది దళాలు గల పద్మము.

**అనంగ కుసుమాద్యాశ్చ పాంతు మాం రక్త కంచుకాః ।**
**వేణీ కృతకరోన్నమ్ర శరకార్ముక పాణయః ॥**

ఈ ఆవరణ హ కార ప్రకృతికము. అష్టమూర్త్యాత్మకము. అష్టమూర్తులు అంటే

| | | |
|---|---|---|
| 1. భవాయ దేవాయ నమః | - | భవుడు |
| 2. శర్వాయ దేవాయ నమః | - | శర్వుడు |
| 3. ఈశానాయ దేవాయ నమః | - | ఈశానుడు |
| 4. పశుపతే దేవాయ నమః | - | పశుపతి |
| 5. రుద్రాయ దేవాయ నమః | - | రుద్రుడు |
| 6. ఉగ్రాయ దేవాయ నమః | - | ఉగ్రుడు |
| 7. భీమాయ దేవాయ నమః | - | భీముడు |
| 8. మహతో దేవాయ నమః | - | మహా దేవుడు |

వీరు ఎనిమిదిమంది ఎనిమిది దళాలలోనూ ఉంటారు.

**అనంగ కుసుమానంగ మేఖలాచద్వితీయకా**
**అనంగ మదనా అనంగ మదనాతుర మాసహా ।**
**అనంగ రేఖా చానంగ వేగానంగాంకుశాపిచ**
**అనంగ మాలినీ పాండునాగ ప్రతస్థితా ఇమాః ॥**

1) అనంగ కుసుమ, 2) అనంగ మేఖలా, 3) అనంగ మదనా, 4) అనంగ మదనాతురా, 5) అనంగ రేఖా, 6) అనంగ వేగిని, 7) అనంగాంకుశ, 8) అనంగ మాలిని. అనబడే దేవతలు క కారము నుండి క్ష కారము వరకు వర్ణల రూపంలో ఎనిమిది దళాలలోనూ ఉంటారు.

**ఏతాస్తు గుప్తతరాభిఖ్యా త్రిపురసుందరి పదాంతికే**

ఇక్కడ ప్రధాన రసము కరుణ రసము. ఈ అవరణకు అధిదేవత త్రిపురసుందరి. ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్తతరయోగిని. ఖడ్గమాలలో దీనిని గురించి ఈ విధంగా ఉంది.

అనంగకుసుమే అనంగమేఖలే అనంగమదనే అనంగమదనాతురే అనంగరేఖే అనంగవేగిని అనంగాంకుశే అనంగమాలిని సర్వసంక్షోణ చక్రస్వామిని గుప్తతరయోగిని

**4. చతుర్థావరణ :**

ఇది సర్వ సౌభాగ్యదాయక చక్రము. చతుర్దశారము. అంటే పధ్నాలుగు కోణాలు గల చక్రము. ఇప్పటి వరకు శివచక్రాలు చెప్పబడ్డాయి. ఇక శక్తి చక్రాలు చెప్పబడుతున్నాయి.

*క్షోభిణ్యాద్యాః ప్రసీదంతు బాణకార్ముక పాణయః*
*సర్వాభరణ సంపన్నాః పృథురుకర్మ సురోచిషః ॥*

ఇందులోని పధ్నాలుగు కోణాలు, పధ్నాలుగు లోకాలకు ప్రతీకలు. పధ్నాలుగు లోకాలలోను ఊర్ధ్వ లోకాలు ఏడు, అధోలోకాలు ఏడు.

**అధోలోకాలు :**

1) అతల 2) వితల 3) సుతల 4) తలాతల 5) రసాతల 6) మహాతల 7) పాతాళ లోకాలు.

**ఊర్ధ్వ లోకాలు :**

1) భూలోక 2) భువర్లోక 3) సువర్లోక 4) మహాలోక 5) జనోలోక 6) తపో లోక 7) సత్య లోకాలు.

ఇవన్నీ శక్తుల రూపంలో ఈ కోణాలలో ప్రక్షిప్తం చెయ్యబడ్డాయి.

*సర్వ సంక్షోభిణీ శక్తి సర్వ విద్రావిణీ తథా*
*సర్వ భంజనశక్తిశ్చ తథా సర్వ వశంకరీ*
*సర్వ రంజనశక్తిశ్చ సర్వోన్మాదనశక్తికా*
*ఏవం సంమోహినీ శక్తి స్సర్వ స్తంభన కారిణీ*
*సర్వార్థ సాధనీ శక్తి సర్వసంపత్ప్రరూపిణీ*
*సర్వమంత్రమయీ శక్తి సర్వద్వంద్వ క్షయంకరీ*

ఆవరణలో వరుసగా

1) సర్వ సంక్షోభిణీ, 2) సర్వ విద్రావిణి, 3) సర్వాకర్షిణీ, 4) సర్వాహ్లాదినీ, 5) సర్వ సమ్మోహిని, 6) సర్వస్తంభినీ, 7) సర్వ జృంభిణీ, 8) సర్వ వశంకరీ, 9) సర్వ రంజనీ, 10) సర్వోన్మాదిని, 11) సర్వార్థ సాధిని, 12) సర్వ సంపత్తి పూరిణి, 13) సర్వ మంత్రమయి, 14) సర్వ ద్వంద్వ క్షయంకరీ.

వీరందరూ క నుండి ఢ వరకు బిందు సంయుక్తంగా అక్షర రూపంలో ఉంటారు. ఇక్కడ ఉండే యోగిని పేరు సంప్రదాయ యోగిని. ఈ ఆవరణకు అధిదేవత త్రిపురవాసిని. దీన్ని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

**సర్వ సంక్షోభిణీ, సర్వ విద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వాహ్లాదిని, సర్వ సమ్మోహిని, సర్వ స్తంభిని, సర్వ జృంభిణీ, సర్వ వశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థ సాధికే, సర్వ సంపత్తి పూరిణీ, సర్వ మంత్రమయి, సర్వ ద్వంద్వ క్షయంకరి, సర్వ సౌభాగ్యదాయక చక్రస్వామిని, సంప్రదాయ యోగిని.**

**5. పంచమావరణ :**

ఇది సర్వార్థ సాధక చక్రము. బహిర్దశారము. పదికోణములు గల చక్రము.

***దశ దేవ్యః ప్రసీదంతు సర్వ సిద్ధి ప్రదాదికాః ।***
***రక్తా స్స్రు పుష్పహారాఢ్యా వరదాభయపాణయః ॥***

ఈ ఆవరణ దశావతారాత్మకము. అంటే దశావతారాలు పదికోణాలలోనూ నిక్షిప్తం చెయ్యబడ్డాయి. ఇక్కడ ....

***సర్వసిద్ధి ప్రదాదేవీ సర్వ సంపత్ప్రదా తథా***
***సర్వప్రియంకరీ దేవీ సర్వ మంగళకారిణీ***
***సర్వ కామప్రదాదేవీ సర్వదుఃఖ విమోచనీ***
***సర్వ మృత్యు ప్రశమనీ దేవీ సర్వ విఘ్న నివారిణీ***
***సర్వాంగ సుందరీ దేవీ సర్వ సౌభాగ్యదాయిని.***

1) సర్వ సిద్ధి ప్రద, 2) సర్వ సంపత్ప్రద, 3) సర్వ ప్రియంకరి, 4) సర్వ మంగళకారిణీ, 5) సర్వ కామప్రద, 6) సర్వ దుఃఖ విమోచని, 7) సర్వ మృత్యుప్రశమని, 8) సర్వ విఘ్న నివారిణి, 9) సర్వాంగ సుందరి, 10) సర్వ సౌభాగ్యదాయిని అనబడే పదిమంది దేవతలు **ణ** నుండి **భ** వరకు బిందు సంయుక్తముగా ఈ కోణాలలో ఉంటారు.

***ఏతాదేవ్యాః కుళోత్తీర్ణా స్త్రిపురా శ్రీచక్రనాయికా***

ఇక్కడ ఉండే యోగిని పేరు కుళోత్తీర్ణ యోగిని. ఈ ఆవరణకు అధిదేవత త్రిపురాశ్రీ. దీనిని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే, సర్వ ప్రియంకరి, సర్వ మంగళకారిణి, సర్వకామ ప్రదే, సర్వ దుఃఖ విమోచని, సర్వ మృత్యు ప్రశమని, సర్వ విఘ్న నివారణి, సర్వాంగ సుందరి, సర్వ సౌభాగ్య దాయిని, సర్వార్థ సాధక చక్రస్వామిని, కుళోత్తీర్ణ యోగిని.

**౬. షష్ఠావరణ :**

ఇది అంతర్దశారము. పది కోణములు గల చక్రము. దీన్నే సర్వ రక్షాకర చక్రము అంటారు.

*సుప్రసీదంతు దేవ్యశ్చ పుస్తకాక్షాళి పాణయః ।*
*శుద్ధ స్ఫటిక సంకాశా సర్వజ్ఞాద్యాశ్చ దేవతాః ॥*

దీనిలో అగ్ని యొక్క కళలు పది ఉంటాయి. అవి

1) ధూమ్ర, 2) ఊష్మ, 3) జ్వలిని, 4) జ్వాలిని, 5) విస్ఫులింగినీ, 6) సుశ్రీ, 7) సురూప, 8) కపిల, 9) హవ్యవాహిని, 10) కవ్య వాహిని ఈ ఆవరణలో ....

*సర్వజ్ఞా సర్వశక్తిశ్చ సర్వైశ్వర్య ప్రదాయినీ*
*సర్వజ్ఞానమయీ దేవీ సర్వవ్యాధి వినాశినీ*
*సర్వాధార స్వరూపా చ సర్వపాపహరాతథా*
*సర్వానందమయీ దేవీ సర్వరక్షా స్వరూపిణీ*
*సర్వేప్సితప్రదాహేతా యోగిన్యో గర్భ సంజ్ఞకా*
*త్రిపురమాలినీ చైవ ముద్రా చైవ మహాంకుశమ్ ॥*

1) సర్వజ్ఞా, 2) సర్వశక్తి, 3) సర్వైశ్వర్య ప్రదాయినీ, 4) సర్వ జ్ఞానమయి, 5) సర్వ వ్యాధివినాశినీ, 6) సర్వాధార స్వరూపా, 7) సర్వ పాపహరా, 8) సర్వానందమయి, 9) సర్వ రక్షా స్వరూపిణి, 10. సర్వేప్సిత ఫలప్రదా. అనబడే దేవతలు మ కారము నుండి క్ష కారము వరకు బిందు సంయుక్తముగా ఈ కోణములందు ఉంటారు. ఇక్కడ ఉండే యోగిని పేరు నిగర్భయోగిని. ఈ ఆవరణకు అధి దేవత త్రిపుర మాలిని. దీన్ని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్యప్రదాయిని, సర్వ జ్ఞానమయి, సర్వ వ్యాధి వినాశిని, సర్వాధార స్వరూపే, సర్వ పాపహరే, సర్వానందమయి, సర్వరక్షా స్వరూపిణి, సర్వేప్సితఫలప్రదే, సర్వరక్షాకర చక్ర స్వామిని, నిగర్భ యోగిని.

**7. సప్తమావరణ :**

ఇది అష్ట కోణము. సర్వరోగహర చక్రము. కకార ప్రకృతికము.

***వాగ్దేవతాః ప్రసీదంతు సింధూర కనకాంబరాః ।***
***పుస్తకాక్షాళి విలస ద్వరదా భీతి పాణయః ॥***

దీని ఎనిమిది కోణాలలోనూ అష్ట వసువులు వాగ్దేవతల రూపాలలో ఉంటారు.

**అష్ట వసువులు :**

1) ఆపుడు, 2) ధృవుడు, 3) సోముడు, 4) ధరుడు, 5) అనిలుడు, 6) అనలుడు, 7) ప్రత్యూషుడు, 8) ప్రభాసుడు.

***వశినీ కామేశ్వర్యో మోదిన్విమలారుణాజయన్యశ్చ***
***సర్వేశీ కౌళిన్యశ్చేతాస్తు రహస్య యోగినీ దేవ్యః***
***మాం పాతు లోకవంద్యా త్రిపురాసిద్ధా చ ఖేచరీ దేవీ ॥***

1) వశిని, 2) కామేశ్వరి, 3) మోదిని, 4) విమల, 5) అరుణ, 6) జయినీ, 7) సర్వేశ్వరీ, 8) కౌళిని అనబడే వాగ్దేవతలు అ కారాది క్ష కారాంతము బిందు సంయుక్తంగా వర్గల రూపంలో ఉంటారు. ఇక్కడ ఉండే యోగిని పేరు రహస్య యోగిని. ఈ ఆవరణకు అధిదేవత త్రిపురాసిద్ధాంబ. దీనిని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉంది.

**వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణే, జయని, సర్వేశ్వరి, కౌళిని, సర్వ రోగహర చక్రస్వామిని, రహస్య యోగిని.**

**8. అష్టమావరణ :**

***రక్తవర్ణా రక్తభూషా వరదాభయ పాణయః ।***
***సాయుధా మకుటోపేతా ధ్యాయేధాయుధ దేవతా ॥***

ఇది త్రికోణము. సర్వసిద్ధి ప్రదచక్రము. సత్వరజస్తమో గుణాత్మకము. ఇక్కడ కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అనబడే ముగ్గురు దేవతలు ఆయుధ బీజ సంయుతులై ఉంటారు. వీరే మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతులు. ఇక్కడ ఉండే యోగిని పేరు అతి రహస్య యోగిని. ఈ ఆవరణకు అధిదేవత త్రిపురాంబ.

*పాశాంకుశామృతకపాల వరాభయాఢ్యై:*
*హస్తైశ్చతుర్భి రభిరామ తమారుణాంగీ ।*
*కోణాగ్రగా త్రినయనా తరుణేందు చూడా*
*కామేశ్వరీ మమదదాతు సమస్తకామాన్ ॥*

*బాలప్రవాళ రుచిరాకర షట్కసంగీ*
*చాపేషు పాశ సృణి మస్తక మాతులంగీ ।*
*వజ్రేశ్వరీ ప్రధిత దక్షిణ కోణ సంస్థా*
*వజ్రోజ్వలాంగీ దిశతు మహవాంఛితాని ॥*

*ప్రత్యచ్ఛ శంఖరుచిరా శ్రితవామకోణా*
*పాశాంకుశా గుణ పుస్తక శాస్త్ర హస్తా ।*
*ఉద్యా సమత్వ నిశ మద్భుత భూరి శక్తి*
*ర్భాగ్యశ్రియం భగవతీ భగమాలినీ మే ॥*

దీనిని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉన్నది.

**బాణిని, చాపిని, అంకుశిని, మహాకామేశ్వరి, మహా వజ్రేశ్వరి, మహా భగమాలిని, సర్వ సిద్ధి ప్రద చక్ర స్వామిని, అతి రహస్య యోగిని.**

**9. నవమావరణ :**

ఇది బిందువు. 'బింద్వాభిన్న పరబ్రహ్మాత్మక చక్రే.' పంచబ్రహ్మాత్మకమైన బిందు స్వరూపము. అదే పరబ్రహ్మ స్వరూపము; ఈ ఆవరణలో శివశక్తులు రాజరాజేశ్వరి, రాజరాజేశ్వరుల రూపంలో ఉంటారు. ఇది సత్వ భావమైన నవరసభరితమైన చక్రము. ఇక్కడ ఉండే యోగిని పేరు పరాపర రహస్య యోగిని. ఈ చక్రాది దేవత మహాత్రిపుర సుందరి. దీన్ని గురించి ఖడ్గమాలలో ఈ విధంగా ఉన్నది.

*శ్రీశ్రీమహాభట్టారికే సర్వానందమయ చక్రస్వామిని, పరాపర రహస్య యోగిని.*

ఈ రకంగా శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోని దళాలు, కోణాలన్నింటిలోనూ అనేక మంది దేవతలున్నారు. వారందరికీ అధిష్టాత్రి ఆ పరమేశ్వరి. ఆమెను గనక శ్రీచక్రంలో అర్చించినట్లైతే సాధకునికి తీరని కోరికలుండవు. ఐహిక ఆముష్మికాలన్నీ కలుగుతాయి.

శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోనూ ఉండే బీజము, శక్తి యోగిని, ముద్ర మొదలైన వివరాలన్నీ వెనుక పేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి.

| ఆవరణ | బీజం | శక్తి | ప్రభ | వర్ణ | యోగిని | ముద్ర | రసం | చక్రేశ్వరి | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. **భూపురం** | ల | పృథివీ | ముక్తా మాణిక్యం | కాది, హాది విద్యలు | ప్రకట | సర్వ సంక్షోభిణీ | శృంగార | త్రిపురా | త్రైలోక్య మోహనం |
| 2. **షోడశదళం** | స | చంద్ర కళాత్మక | శరత్ చంద్ర | షోడశాక్షరి | గుప్త | సర్వ విద్రావిణీ | వీర | త్రిపురేశీ | సర్వాశా పరిపూరకం |
| 3. **అష్టదళం** | హ | అష్ట మూర్తులు | జపా కుసుమం | అష్టప్రకృతి | గుప్తతర | సర్వా కర్షిణీ | కరుణా | త్రిపుర సుందరి | సర్వ సంక్షోభణం |
| 4. **మన్వస్రం** | ఈ | చతుర్దశ భువనములు | దాడిమీ కుసుమం | అ నుండి ఔ ప నుండి మ | సంప్రదాయ | సర్వ వశంకరి | భయానక | త్రిపుర వాసినీ | సౌభాగ్య ప్రదం |
| 5. **బహిర్దశారం** | ర | దశ కళాత్మక | జపా కుసుమ | ట నుండి న | నిగర్భ | సర్వ మహాంకుశ | రౌద్ర | త్రిపురాశ్రీ | సర్వ రక్షాకరం |
| 6. **అంతర్దశారం** | ఏ | దశా వతారములు | సిందూరం | క నుండి ఞ | కుల | సర్వో న్మాదిని | బీభత్స | త్రిపురమాలిని | సర్వార్థ సాధక |
| 7. **అష్టకోణం** | క | అష్ట మూర్తులు | పద్మరాగం | య నుండి హ | రహస్య | సర్వ ఖేచరి | హాస్య | త్రిపురా సిద్ధాంబ | సర్వ రోగహరం |
| 8. **త్రికోణం** | నాదం | త్రిగుణములు | బంధూక కుసుమం | అః ం | అతి రహస్య | సర్వబీజ | అద్భుత | త్రిపురాంబా | సర్వసిద్ధి ప్రద |
| 9. **బిందువు** | ప్రణవం | ఈక్షతి | ఉదయసూర్య సహస్రకాంతి | ం | పరాపర రహస్య | సర్వ యోని | శాంత | మహాత్రిపుర సుందరి | సర్వా నందం |

# 13. అంతర్యాగము

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతని యొక్క ప్రతిరూపమే పరమేశ్వరి. వారే శివశక్తులు. వారి అంశలతో వచ్చినదే శ్రీచక్రము. సాధకుడు ఐహిక వాంఛలలో మునిగి తేలుతున్నప్పుడు పరదేవతను ఆరాధిస్తాడు. అంటే భగవంతుడు వేరు, భక్తుడు వేరు అని తలచి తన ఎదురుగా శ్రీచక్రము గాని, దేవి ప్రతిమ గాని ఉంచి దానిని అర్చిస్తాడు. దీనిని బాహ్యపూజ అంటారు. జ్ఞానులు, ముముక్షువులు దీనిని కౌళాచారము అంటారు. మానవాళికి కావలసినది కోర్కెల సాధనకాదు. బాహ్యపూజ అంతకన్నా కాదు. అని వారి అభిప్రాయయము. సనత్కుమార సంహితలో చెప్పినట్లుగా.

*బాహ్యపూజానకర్తవ్యా కర్తవ్యా బాహ్య జాతిభిః*
*సా క్షుద్రఫలదా నృణాం ఐహికార్థైక సాధనాత్*
*బాహ్యపూజరతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః*
*దిగంబరాశ్చేతిహాసాః వామకాస్తంత్ర వాదినః*

మోక్ష వాదులకు బాహ్యపూజ లేదు. అది కేవలము ఐహికమైన కోర్కెల సాధనకే ఉపయోగపడు తుంది. ఈ బాహ్యపూజను కౌళులు, క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, వామాచార సంపన్నులు, తంత్రవాదులు మాత్రమే చేస్తారు.

*అంతరారాధన పరా వైదికా బ్రహ్మవాదినః*
*జీవన్ముక్తాశ్చరం త్యేతే త్రిషులోకేషు సర్వదా ॥*

బ్రహ్మవాదులైన వైదికాచారసంపన్నులు అంతరారాధన చేస్తారు. వీరు జీవన్ముక్తులై ముల్లోకాలలోనూ సంచరిస్తూ ఉంటారు. జ్ఞానులు, మోక్షవాదులు ఎవరూ కూడా బాహ్య పూజ చెయ్యరు. వీరందరూ ఆత్మ సాక్షాత్కారం పొందినవారు. వీరి దృష్టిలో భగవంతుడు, భక్తుడు ఇద్దరూ ఒక్కటే. వేరుకాదు. ఆత్మసాక్షాత్కారం పొందిన వానికి ఈ జగత్తు అంతా మిధ్య అనిపిస్తుంది. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. భూత భవిష్య ద్వర్తమానాలు తెలుస్తాయి. ఈ జగత్తు అంతా తనలోనే ఉన్నది. తానే పరబ్రహ్మ స్వరూపము అని తలపోస్తాడు.

అంతరారాధన అంటే సాధకుడు తానే భగవత్స్వరూపము అని భావించి షట్చక్రాలలోనూ ఆ పరదేవతను అర్చిస్తూ కుండలినీ శక్తిని సహస్రారానికి చేర్చి పరమానందాన్ని అనుభవిస్తాడు. అంతరారాధన ఏ విధంగా చెయ్యాలి అనేది **'భావనోపనిషత్తు'**లో ఇవ్వబడింది.

పరమేశ్వరిని గురించి వివరించే ఉపనిషత్తులు ఎనిమిది ఉన్నాయి. వీటిలో భావనోపనిషత్తు ఒకటి. ఇది అథర్వణ వేదములోనిది. దీనిలో అంతర్యాగము అంటే దేవి మానసిక పూజా విధానము వివరించబడింది.

## భావనోపనిషత్తు పూర్తి పాఠము

ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః తేన నవరంధ్రరూపోదేహః నవచక్రం రూపం శ్రీచక్రం వారాహీపిత్రురూపా, కురుకుళ్ళావళి దేవతామాతా॥ పురుషార్థాస్సాగరాః దేహోనవరత్న ద్వీపః త్వగాది సప్తధాతుభిరనేకై స్సంయుక్తా సంకల్పాః కల్పతరవః తేజఃకల్పకోద్యావం రసవయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయలవణ రసాష్షడృతవః కియాశక్తిపీఠంకుడలినీ, జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తి ర్మహాత్రిపురసుందరీ. క్రియాశక్తి పీఠం కుడలినీ, జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛా శక్తి ర్మహాత్రిపురసుందరీ జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం, జ్ఞేయుగ్ంహవిః జ్ఞాతృజానజ్ఞేయోనామభేదభావనగ్ం శ్రీచక్రపూజనమ్ నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య పుణ్యాపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః' ఆధారనవకం ముద్రాశక్తయః పృథివ్యాపస్తేజో వాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశశక్తయః వచనా దానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోనంగ కుసుమాది శక్తయోష్టౌ అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా, చేతి, చతుర్దశనాడ్యః సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః ప్రాణా, పాన, వ్యానో, దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయా దశవాయవ సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతాః ఏతద్వాయుదశక సంసర్గో పాధిభేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహభో భక్ష్య భోజ్య లేహ్య చోష్య పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతాః దశధనకలాసర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతాః శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్వ రజ స్తమోగుణా వశిన్యాదిశక్తయోష్టౌ శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచనాత్మత్రా పంచపుష్పబాణాః మన ఇక్షుధమః వశ్యోబాణఃరాగఃపాశో ద్వేషోంశః అవ్యక్త మహత్తత్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిన్యోంతస్త్రికోణాగ్రగా దేవతా పంచదశతిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశనిత్యాః శ్రద్ధానురూపాధీర్దేవ తాతయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైకరూపాదేవతా పలిలమితి సాహిత్యకరణగ్ం సత్వమ్ కర్తవ్యమకర్తవ్య మౌదాసిన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః అస్తి వాస్తీతి కర్తవ్యతా

అనుపచార: తస్యబాహ్యాంత: కరణానామేకరూప విషయ గ్రహణమాసనమ్' రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్ ఉజ్జ్వల దామోదానువంధానమర్ఘ్యమ్ స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్ చిచ్ఛంద్రమయీ సర్వాంగప్రవణగ్ంస్నానమ్ చిదగ్ని స్వరూప పరమానందశక్తి స్ఫురణం వస్త్రం ప్రత్యేకగ్ం సప్తవింశతిధా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మగ్రంధి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్ స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణంవిభూషణమ్ సత్సంగపరిపూతా మన్మరణంగంథ: సమస్త విషయాణాం మనన: స్థైర్యేణామనంధానం కుసుమమ్ తేషామేవ సర్వదాస్వీకరణంధూప: పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీప: సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్ అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్ మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్ తురీయావస్థా నమస్కార: దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్ సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ం హోమ: స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్ ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్య సిద్ధి: చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కధ్యత ఇత్యుపనిషత్ ॥

## భావనోపనిషత్తు వివరణ

భావనోపనిషత్తు మొత్తము 49 సూత్రాలుగా ఉంటుంది. దీనిలో ....

1 నుండి 10 సూత్రాల వరకు - మానవ దేహమే పరమేశ్వర స్వరూపమని

11 నుండి 24 సూత్రాల వరకు - శ్రీచక్రములోని నవావరణలను

25 నుండి 49 సూత్రాల వరకు - మానసిక పూజా విధిని వివరిస్తాయి.

1. *"ఓం శ్రీగురు: పరమకారణ భూతాశక్తి:"*

*గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు: గురుర్దేవో మహేశ్వర: ।*
*గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమ: ॥*

మంత్రోపదేశం చేసి దీక్షనొసగిన గురువు త్రిమూర్తి స్వరూపుడు. అజ్ఞానమనే చీకటిని పారద్రోలి జ్ఞానమనే దీపకాంతిని చూపేమహానుభావుడు. అతని యొక్క ఉపదేశంతోనే బ్రహ్మత్వం సిద్ధిస్తుంది. అందుకే గురువు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపము అని చెప్పబడింది.

*నగురోరధికం తత్త్వం । న గురోరధికం తప: ।*
*తత్త్వజ్ఞానాత్ పరం నాస్తి తస్మైశ్రీ గురవేనమ: ॥*

గురువుకన్న ఎక్కువ అయిన తత్త్వములేదు, తపస్సు లేదు. అతను శిష్యునకు ఉపదేశించే జ్ఞానము కన్న ఎక్కువైనది లేదు.

***వందే గురపదద్వంద్వం । అవాఙ్మానస గోచరం ।***

***శ్వేతరక్త ప్రభాభిన్నం । శివశక్త్యాత్మకంపరం ॥***

మనోవాక్కులకు గోచరించనిది, శ్వేత, రక్తకాంతుల కన్న అధికమైన కాంతినిచ్చునది, శివశక్త్యాత్మకమైనది అనగా పరబ్రహ్మ స్వరూపమైనది అయిన గురు పాదములకు నమస్కరించుచున్నాను. అందుకే **"ఓం శ్రీగురు: పరమకారణభూతాశక్తి:"** అనేగురుధ్యానంతో ఈ ఉపనిషత్తు మొదలవుతుంది.

### 2. *"తేన నవరంధ్రరూపోదేహః నవచక్రం రూపం శ్రీచక్రం"*

మానవదేహము నవరంధ్రములతో కూడినది. శ్రీచక్రము తొమ్మిది చక్రముల సమూహము. త్వగాదిధాతులువు తొమ్మిది. శ్రీచక్రంలోని భూపురం దగ్గర నుండి బిందువు దాకా గల ఆవరణలన్నీ మానవదేహంలోని వివిధ అంగాలు. సాధకుని దేహంలోని షట్చక్రాలు శ్రీచక్రంలోని వివిధచక్రాలతో ఐక్యము చెందుతున్నాయి. ఈ విషయాలన్నీ 'శ్రీచక్రము - మానవదేహము' అనే అధ్యాయంలో వివరించటం జరిగింది. ఈ రకంగా చూసినట్లైతే **"దేహో దేవాలయప్రోక్తో జీవోదేవస్తసాతన:"** మానవ దేహమే శ్రీచక్రము సాధకుని దేహమే దేవాలయము అని భావించాలి.

### 3. *వారాహీపితృరూపా, కురుకుళ్ళావళిదేవతామాతా ॥*

శ్రీచక్రానికి ప్రధానదేవత శ్రీదేవి, పరాత్పరి. ఆమె శరీరము నుంచి వచ్చిన కాంతి పుంజాలు అష్టసిద్ధులైన అణిమాది దేవతలు. అలాగే సాధకుడికి తండ్రి వారాహి, తల్లి కురుకుళ్ళావతి. ఇక్కడ 'మాతా' అంటే సాధకుని యొక్క యోగ్యతను బట్టి కోర్కెలు తీర్చునది. అంటే ఐహికవాంఛలు, మోక్షములను ప్రసాదిస్తుంది. మానవ శరీరంలో ఉన్న నాడీ మండలంలో ప్రాణనాడి అని చెప్పబడే సుషుమ్నానాడినే 'కురుకుళ్ళా' అంటారు. సుధాసింధువు మధ్య మణిద్వీపమందున్న శ్రీదేవి పట్టణానికి చిత్తము, అహంకారము అనబడే రెండు ప్రాకారాలమధ్య విమర్శరూపకమైన బావియందుండేది కురుకుళ్ళావళీ అనే దేవత. ప్రముఖమైన దేవత కాబట్టి ఈమెను మాతృదేవతగా భావించాలి. లలితాస్తవరత్నములో ఈవిధంగా చెప్పబడింది.

*"కురువిందతరణి నిలయింకులాచలస్పర్థికుచనమన్మధ్యాం ।
కుంకుమవిలిప్తగాత్రీంకురుకుళ్లా మనసికుర్మహేసతతం" ॥*

కురువిందరత్నముల పైన నివసించునది, కులపర్వతములకు మించిన స్తనములచే వంగిననడుముకలది, కుంకుమ పూయబడిన దేహము కలది అయిన కురుకుళ్లాదేవిని మనసా ధ్యానించుచున్నాను. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మలోకానికి వెళ్ళే మార్గంలోరెండు అమృతసరస్సులున్నాయి. అవి ఇరమ్మదీయములు అని చెప్పబడింది. ఇరము అంటే అన్నము మదీయము అంటే ఆనందము. అక్కడ అమృత వర్షముగల 'సోమసవనము' అనే వృక్షము ఉన్నది. ఆ పట్టణానికి అపరాజితము అని పేరు.

*4. "పురుషార్థాప్రగరాః"*

సప్తసముద్రాలు, సప్తద్వీపాలు దాటిన తరువాత సుధాసముద్రమున్నది. దాని మధ్యలో మణిద్వీపము. మానవ దేహంలోని సప్తచక్రాలే సప్త ద్వీపాలు. ఆ పైన సప్త సముద్రాలు. ఆ తరువాత సుధాసముద్రము, మణిద్వీపము. సప్త సముద్రాలు సప్త ద్వీపాల వివరాలు ఈదిగువ ఇవ్వబడ్డాయి.

**సప్త సముద్రాలు :**

1) లవణ (ఉప్పు) సముద్రము, 2) ఇక్షు (చెఱుకు) సముద్రము, 3) సురా (మద్యము) సముద్రము, 4) సర్పి (నెయ్యి) సముద్రము, 5) దధి (పెరుగు) సముద్రము, 6) క్షీర (పాలు) సముద్రము, 7) జల (నీరు) సముద్రము.

**సప్త ద్వీపాలు :**

1) జంబూ ద్వీపము, 2) ప్లక్ష ద్వీపము, 3) కుశ ద్వీపము, 4) క్రౌంచ ద్వీపము, 5) శాక ద్వీపము, 6) శాల్మలీ ద్వీపము, 7) పుష్కర ద్వీపము

బిందుస్థానాన్ని 'ద్వాదశాంతము' అంటారు. ఆధారచక్రం దగ్గర నుండి లెక్కపెట్టినట్లైతే బిందువు పన్నెండవది అవుతుంది.

1) కుల పద్మము (మూలాధారానికి క్రిందరక్త వర్ణము గలిగిన సహస్రదళ పద్మము), 2) అష్టదళపద్మము, 3) షడ్దళపద్మము, 4) మూలాధారము, 5) స్వాధిష్టానము, 6) మణి పూరము, 7) అనాహతము, 8) విశుద్ధము, 9) విశుద్ధలంబికాగ్రము అష్టదళము, 10) అజ్ఞా చక్రము, 11) సహస్రకమలము, 12) అకుల పద్మము (సహస్రారకర్ణిక) దీనినే బిందు స్థానమని, చంద్రమండలమని అంటారు.

### 5. *"దేహో నవరత్న ద్వీపః"*

సాధకుని శరీరమే సుధా సముద్రము మధ్యలో ఉన్నటువంటి నవరత్నమయమైన ద్వీపము ఇదే మణిద్వీపము. ఆ దేవికి నిలయము. అంటే దేవి ఎక్కడో లేదు, సాధకుని శరీరంలోనే ఉన్నది.

### 6. *"త్వగాదిసప్తధాతుభిరన్యైస్సంయుక్తా సంకల్పాః కల్పతరవః"*

మానవదేహము ఏడుధాతువుల వలన ఏర్పడింది. వాటినే సప్త ధాతువులు అంటారు, అవి ... 1) చర్మము, 2) రక్తము, 3) మాంసము, 4) మెదడు, 5) ఎముకలు, 6) మజ్జ, 7) శుక్లము

దేవి మణిద్వీపంలోని కల్పవృక్షఛాయలో ఉంటుంది. మానవదేహంలోని సంకల్పాలే కల్పవృక్ష సముదాయము. ఆ చోటునే దేవి ఉంటుంది.

### 7. *"తేజఃకల్పకోద్యానం"*

సహస్రారంలోఉండే దేవి యొక్క ప్రతిబింబమే జీవ స్వరూపము, దాని యొక్క కాంతి కిరణాలే శరీరమంతా వ్యాపించి ఉన్నాయి. ఈ కిరణాల కాంతులనే 'కల్పకోద్యానము' అంటారు.

### 8. *"రసనయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయలవణరసాష్షడృతవః"*

నాలుకకు తెలిసే రుచులు ఆరు. ఈ ఆరు రుచులనే ఆరు ఋతువులుగా భావించాలి.వాటి వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | **రుచులు** | | **ఋతువులు** |
|---|---|---|---|
| 1. | తీపి | - | వసంత ఋతువు |
| 2. | ఉప్పు | - | గ్రీష్మ ఋతువు |
| 3. | కారము | - | వర్ష ఋతువు |
| 4. | పులుపు | - | శరదృతువు |
| 5. | చేదు | - | హేమంత ఋతువు |
| 6. | వగరు | - | శిశిర ఋతువు |

ఈ రకంగా ఇప్పటి వరకు దేవీ నివాసమైన మణిద్వీపము, సాధకుని దేహము ఒకటే అని చెప్పబడింది. ఇక పరివార దేవతల వివరణ.

*9. "క్రియాశక్తి పీఠంకుడలినీ, జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ"*

మానవదేహము త్రిశక్తిమయము. అవి 1) ఇచ్ఛా 2) జ్ఞాన 3) క్రియాశక్తులు. ఈ శక్తుల వలననే పనులు జరుగుతాయి. వీటిలో మొదటిదైన ఇచ్ఛాశక్తి అనేది విశ్వరూపము. జ్ఞానశక్తి అనేది మందిరము. క్రియాశక్తి అనేది పీఠము, ఏదైనా ఒక పని చేయాలనే ఆలోచన ముందుగా మెదడులో వస్తుంది. అదే ఇచ్ఛాశక్తి లేక పరాశక్తి. ఇది ఆధారాది చక్రాలగుండా పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములు పొందుతుంది.

*10. "జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం, జ్ఞేయగ్ంహవిః*
*జ్ఞాతృజ్ఞానజ్ఞేయో నామభేద భావనగ్ం శ్రీచక్రపూజనమ్"*

ఇక్కడ మూడు పదాలు చెప్పబడ్డాయి అవి

1. జ్ఞాత - విషయ పరిజ్ఞానము కలవాడు సాధకుడు
2. జ్ఞానము - తెలుసుకొనవలసినది
3. జ్ఞేయము - తెలుసుకొనబడినది.

ఈ మూడింటిని 'త్రిపుటి' అంటారు. జ్ఞానము అభివృద్ధి చెందినప్పుడు మిగిలిన రెండూ అంటే జ్ఞాత, జ్ఞేయములు దానియందు లీనమయిపోతాయి. అప్పుడు మిగిలేది జ్ఞానము ఒక్కటే. అదే పరబ్రహ్మానందము.

సాధకుడే అంతర్యాగానికి యజమాని. అతడే జ్ఞాత. అర్ఘ్యమే జ్ఞానము. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయాలను ఐక్యము చెయ్యటమే శ్రీచక్రపూజ. దేవి జ్ఞానాజ్ఞేయ స్వరూపిణి, జ్ఞానము వలన మాత్రమే తెలుసుకోతగినది. కాబట్టి త్రిపుటిని లయం చేయటమే శ్రీచక్రపూజ అయి బ్రహ్మానందాన్నిస్తుంది.

*11. వియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః"*

**ప్రథమా వరణ :**

ఇక్కడ శ్రీచక్ర ఆవరణ దేవతలను వివరిస్తున్నారు. చక్రార్చన భూపురం నుంచి ప్రారంభించి బిందువుతో పూర్తి చెయ్యాలి. అందుకని ప్రధమావరణ అయిన భూపుర దేవతలను వివరిస్తున్నారు.

భూపురంలో మూడు రేఖలున్నాయి. వాటిలో మొదటి రేఖయందు అన్ని వైపులా అణిమాదిసిద్ధులున్నాయి. సాధకుని శరీరంలో నవరసాలున్నాయి. ఈ నవరసాలే ప్రధమావరణలోని ప్రధమ రేఖలో ఉన్న దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని నవరసాలు | | ప్రథమ రేఖలోని దేవతలు |
|---|---|---|
| 1. శృంగారరసము | - | అణిమాసిద్ధి |
| 2. హాస్యరసము | - | లఘిమాసిద్ధి |
| 3. కరుణరసము | - | గరిమాసిద్ధి |
| 4. రౌద్రరసము | - | మహిమాసిద్ధి |
| 5. వీరరసము | - | ఈశిత్వసిద్ధి |
| 6. భయానకరసము | - | వశత్వసిద్ధి |
| 7. భీభత్స రసము | - | ప్రాకామ్యసిద్ధి |
| 8. అద్భుతరసము | - | ప్రాప్తిసిద్ధి |
| 9. శాంత రసము | - | సర్వకామసిద్ధి |

***12. "కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య పుణ్యాపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః'***

భూపురంలోని రెండవ రేఖలో ఉన్న ఎనిమిది మంది దేవతలు, సాధకుని శరీరంలోని మనోవికారాలుగా చెప్పబడ్డాయి. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| మనోవికారాలు | | ద్వితీయ రేఖలోని దేవతలు |
|---|---|---|
| 1. కామము | - | బ్రాహ్మి |
| 2. క్రోధము | - | మహేశ్వరి |
| 3. లోభము | - | కౌమారీ |
| 4. మోహము | - | వైష్ణవీ |
| 5. మదము | - | వారాహీ |
| 6. మాత్సర్యము | - | మహేంద్రీ |
| 7. పుణ్యము | - | చాముండా |
| 8. పాపము | - | మహాలక్ష్మి |

***13. "ఆధారనవకం ముద్రాశక్తయః"***

సాధకుని శరీరంలో మూలాధారం నుండి ద్వాదశాంతము వరకు గల తొమ్మిది స్థానాలు భూపురంలోని తృతీయ రేఖలోగల తొమ్మిది ముద్రాశక్తులు వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని స్థానాలు | | ముద్రాశక్తులు |
|---|---|---|
| 1. మూలాధారము | - | సర్వ సంక్షోభిణీ శక్తి |
| 2. స్వాధిష్టానము | - | సర్వ విద్రావణీశక్తి |
| 3. మణిపూరము | - | సర్వాకర్షిణీ శక్తి |
| 4. అనాహతము | - | సర్వ వశంకరీ శక్తి |
| 5. విశుద్ధ చక్రము | - | సర్వోన్మాదినీశక్తి |
| 6. లంబికాగ్రము | - | సర్వమహాంకుశాశక్తి |
| 7. ఆజ్ఞాచక్రము | - | సర్వఖేచరీశక్తి |
| 8. సహస్రారము | - | సర్వబీజాశక్తి |
| 9. ద్వాదశాంతము | - | సర్వయోని శక్తి |

*14. "పృథివ్యావస్తేజోవాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశక్తయః"*

**ద్వితీయావరణ :**

శ్రీచక్రంలో రెండవ ఆవరణ షోడశదళము. దీనిలో పదహారు దళాలుంటాయి. వీటిలో పదహారు మంది ఆకర్షణ దేవతలుంటారు. వీరు పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క స్వరూపాలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| పంచభూతాలు, ఇంద్రియాలు | | ద్వితీయావరణలోని దేవతలు |
|---|---|---|
| 1. పృథివి | - | కామాకర్షిణీదేవి |
| 2. జలము | - | బుద్ధ్యాకర్షిణీదేవి |
| 3. అగ్ని | - | అహంకారాకర్షిణీదేవి |
| 4. వాయువు | - | శబ్దాకర్షిణీదేవి |
| 5. ఆకాశము | - | స్పర్శాకర్షిణీదేవి |
| 6. కన్ను | - | రూపాకర్షిణీదేవి |
| 7. ముక్కు | - | రసాకర్షిణీదేవి |
| 8. చెవి | - | గంధాకర్షిణీదేవి |
| 9. నాలుక | - | చిత్తాకర్షిణీదేవి |
| 10. చర్మము | - | ధైర్యాకర్షిణీదేవి |

| | |
|---|---|
| 11. వాక్కు | స్మృత్యాకర్షిణీదేవి |
| 12. పాణి (చేయి) | నామాకర్షిణీదేవి |
| 13. పాదము (కాలు) | బీజాకర్షిణీదేవి |
| 14. పాయువు (గుదము) | ఆత్మాకర్షిణీదేవి |
| 15. ఉపస్థ (రహస్యాంగము) | అమృతాకర్షిణీదేవి |
| 16. మనస్సు | శరీరాకర్షిణీదేవి |

***15. 'వచనాదానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోనంగ కుసుమాది శక్త యోష్టౌ'***

**తృతీయావరణ :**

శ్రీచక్రంలో తృతీయావరణ అష్టదళ పద్మము. ఇందులో ఎనిమిది దళాలుంటాయి. ఆ దళాలలో ఎనిమిది మంది దేవతలుంటారు. మానవ దేహంలో ఉండే కర్మేంద్రియాల ధర్మాలు, ప్రవృత్తి, నివృత్తి ఉపేక్ష అనేవే ఈ ఎనిమిది మంది దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| **ఇంద్రియ ధర్మాలు** | | **తృతీయావరణ దేవతలు** |
|---|---|---|
| 1. వచనము | - | అనంగకుసుమాదేవి |
| 2. దానము | - | అనంగమేఖలాదేవి |
| 3. గమనము | - | అనంగమదనాదేవి |
| 4. విసర్గము (మలవిసర్జన) | - | అనంగమదనాతురాదేవి |
| 5. సంభోగము | - | అనంగరేఖాదేవి |
| 6. ప్రవృత్తి | - | అనంగ వేగినీదేవి |
| 7. నివృత్తి | - | అనంగాంకుశాదేవి |
| 8. ఉపేక్ష | - | అనంగమాలినీదేవి |

***16. "అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా, చేతి, చతుర్దశనాద్యః, సర్వంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః."***

**చతుర్థావరణ:** శ్రీచక్రంలో నాలుగవ ఆవరణ చతుర్దశ కోణము. ఇందులో పద్నాలుగు కోణాలుంటాయి. అవి పద్నాలుగు లోకాలకు ప్రతీకలు. మానవ దేహంలోని పధ్నాలుగు ముఖ్యమైన నాడులే ఈ ఆవరణలో ఉండే దేవతలు. వాటి వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి

| | **దేహంలోని నాడులు** | | **చతుర్థావరణలోని దేవతలు** |
|---|---|---|---|
| 1. | అలంబుసా | - | సర్వ సంక్షోభిణీదేవి |
| 2. | కుహూ | - | సర్వవిద్రావిణీదేవి |
| 3. | విశ్వోదరీ | - | సర్వాకర్షిణీదేవి |
| 4. | వరుణా | - | సర్వాహ్లాదినీదేవి |
| 5. | హస్తిజిహ్వా | - | సర్వసమ్మోహినీదేవి |
| 6. | యశస్వతీ | - | సర్వస్తంభినీదేవి |
| 7. | అశ్వనీ | - | సర్వజ్రుంభిణీదేవి |
| 8. | గాంధారీ | - | సర్వవశంకరీదేవి |
| 9. | పూషా | - | సర్వరంజనీదేవి |
| 10. | శంఖినీ | - | సర్వోన్మాదినీదేవి |
| 11. | సరస్వతీ | - | సర్వార్థసాధికాదేవి |
| 12. | ఇడా | - | సర్వసంపత్తిపూరిణీదేవి |
| 13. | పింగళా | - | సర్వమంత్రమయీదేవి |
| 14. | సుషుమ్నా | - | సర్వద్వంద్వక్షయంకరీదేవి |

*17. "ప్రాణాపాన, వ్యానో, దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయా దశవాయవ స్సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతాః"*

**పంచమావరణ :**

శ్రీచక్రంలోని ఐదవ ఆవరణ బహిర్దశారము. ఇక్కడ పదికోణాలున్నాయి. వాటిలో పదిమంది దేవతలున్నారు. సాధకుని శరీరంలోని ప్రధాన వాయువులు, ఉపవాయువులే ఈ దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| వాయువుల పేర్లు | | పంచమావరణలోని దేవతలు |
|---|---|---|
| 1. ప్రాణవాయువు | - | సర్వసిద్ధిప్రదాదేవి |
| 2. అపానవాయువు | - | సర్వసంపత్ప్రదాదేవి |
| 3. వ్యానవాయువు | - | సర్వప్రియంకరీదేవి |
| 4. ఉదానవాయువు | - | సర్వమంగళకారిణీదేవి |
| 5. సమానవాయువు | - | సర్వకామప్రదాదేవి |
| 6. నాగవాయువు | - | సర్వదుఃఖవిమోచనీదేవి |
| 7. కూర్మవాయువు | - | సర్వమృత్యుప్రశమనీదేవి |
| 8. కృకరవాయువు | - | సర్వవిఘ్ననివారిణీదేవి |
| 9. దేవదత్తము | - | సర్వాంగసుందరీదేవి |
| 10. ధనుంజయము | - | సర్వసౌభాగ్యదాయనీదేవి |

*18. "ఏతద్వాయుదశక సంసర్గోపాధి భేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహఖో భక్ష్య భోజ్య లేహ్య చోష్య పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతాః దశధనకలాసర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతాః*

**షష్ఠమావరణ :**

శ్రీచక్రంలో ఆరవ ఆవరణ అంతర్దశారము, దీనిలో కూడా పది కోణా లుంటాయి. ఈ కోణాలలో పదిమంది దేవతలున్నారు. సాధకుని శరీరంలోని దశవిధవాయువుల వల్ల కలిగే గుణాలు, చతుర్విధాన్నములు పచనము చేయుశక్తులే ఈ దేవతలు. ఈ ఆవరణలోని పది దేవతలు, వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడినాయి.

| దశవిధవాయువుల గుణములు | | షష్ఠమావరణ దేవతలు |
|---|---|---|
| 1. రేచకము (ఊపిరివిడచుట) | - | సర్వజ్ఞాదేవి |
| 2. పూరకము (ఊపిరి పూరించుట) | - | సర్వశక్తిదేవి |
| 3. శోషకము (శోషిల్లుట) | - | సర్వైశ్వర్యప్రదాయిని |
| 4. దాహకము (దాహకగుణము) | - | సర్వజ్ఞానమయి |
| 5. ప్లావకము (ప్లావకగుణము) | - | సర్వవ్యాధి నివారిణి |

**వివిధ అన్నములు**

| | | |
|---|---|---|
| 1. భక్ష్యము (తినదగినది) | - | సర్వాధారస్వరూపిణి దేవి |
| 2. భోజ్యము (భుజింపతగినది) | - | సర్వపాపహరాదేవి |
| 3. లేహ్యము (నాకి భుజింపతగినది) | - | సర్వానందమయిదేవి |
| 4. చోష్యము (పీల్చతగినది) | - | సర్వరక్షాసర్వరూపిణి |
| 5. పేయము (త్రాగతగినది) | - | సర్వేపిసత్ఫల ప్రదాదేవి. |

19. **"శీతోష్ణ సుఖదుఃఖేచ్ఛా సత్త్వరజస్తమోగుణా వశిన్యాది శక్త యోష్టౌ"**

**సప్తమావరణ :**

శ్రీచక్రంలో ఏడవ ఆవరణ అష్టకోణము. దీని ఎనిమిది కోణాలలోనూ ఎనిమిది మంది దేవతలున్నారు. వారుకూడా సాధకుని శరీరంలో ఉండే లక్షణాలే. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| **సాధకుని శరీరంలో గల లక్షణాలు** | | **సప్తమావరణలోని దేవతలు** |
|---|---|---|
| 1. శీతము | - | వశినీ |
| 2. ఉష్ణము | - | కామేశ్వరీ |
| 3. సుఖము | - | మోదినీ |
| 4. దుఃఖము | - | విమలా |
| 5. ఇచ్ఛ | - | అరుణా |
| 6. సత్త్వగుణము | - | జయినీ |
| 7. రజోగుణము | - | సర్వేశ్వరీ |
| 8. తమోగుణము | - | కౌళినీ |

10 . **"శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచతన్మాత్రా పంచ పుష్పబాణాః"**

**బాణాలు :**

దేవి చేతి యందు పుష్ప బాణమున్నది. అది ఒక పూవుకాదు. ఐదుపుష్పాలు. అవే పంచతన్మాత్రలు. పంచభూతాల ధర్మాలు వస్తువు యొక్క స్థూల స్వరూపమే గుణము. సూక్ష్మ రూపముతన్మాత్ర. బాణాలు మూడు రకాలు.

1. స్థూలములు - పుష్పబాణాలు
2. సూక్ష్మములు - బీజరూపాలు
3. కారణములు - వాసనారూపాలు

ఈ బాణాల పేర్లు ఒక్కొక్క చోట ఒక్కొక్క విధంగా ఉన్నాయి. 1. కాదిమతంలో

1. కమలము - ఎర్రతామర
2. రక్తకైరవము - తెల్లకలువ
3. కల్హారము - కొంచెము ఎరుపు రంగుకల కలువ
4. ఇందీవరము - నల్లకలువ
5. సహకారము - మామిడిపూవు.

దేవిచేతిలోని బాణాల వివరాలు ఇతర గ్రంథాలలో ఈ విధంగా ఉన్నాయి.

| | **కాలికాపురాణము** | **జ్ఞానార్ణవము** | **తంత్రరాజము** |
|---|---|---|---|
| 1. | హర్షణము | క్షోభణము | మదన |
| 2. | శోచనము | ద్రావణము | ఉన్మాద |
| 3. | మోహనము | ఆకర్షణము | మోహన |
| 4. | శోషణము | వశ్యము | దీపన |
| 5. | మారణము | ఉన్మాదము | శోషణ |

దేవి చేతిలో బాణాలు తన్మాత్రలు. అందుకనే దేవి. 'పంచతన్మాత్రసాయకా' అని చెప్పబడింది.

*21. "మన ఇక్షుధనుః వశ్యోబాణః రాగఃపాశో ద్వేషోంకుశః"*

**ధనుస్సు :**

దేవి చేతిలో ఉన్న ఆయుధములు సాధకునిలో గల రాగద్వేషాలు

చెరకువిల్లు - సాధకుని మనస్సు
బాణము - వశ్యత
పాశము - అనురాగము
అంకుశము - ద్వేషము

**22. "అవ్యక్త మహత్తత్త్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిన్యోంతస్త్రి కోణాగ్రగాదేవతా"**

**అష్టమావరణ :**

శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ త్రికోణము. అక్కడ ముగ్గురు దేవతలున్నారు. వారు సాధకుని మనసులోని ....

1. అవ్యక్తము - కామేశ్వరీ
2. మహత్తత్త్వము - వజ్రేశ్వరీ
3. అహంకారము - భగమాలినీ

వీరు శక్తిస్వరూపిణులయిన పార్వతి, లక్ష్మి సరస్వతులు.

**23. "పంచదశతిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశనిత్యాః"**

**అష్టమావరణ :**

శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో మూడు రేఖలున్నాయి. వాటిలో రేఖకు ఐదుగురు చొప్పున పదిహేను మంది దేవతలున్నారు. వీరినే నిత్యాదేవతలంటారు. ఈ నిత్యలు తిథుల స్వరూపాలు. వీటి వివరాలు ఈ క్రింద ఇవ్వబడినాయి.

| తిథులు | - | నిత్యా దేవతలు |
|---|---|---|
| 1. పాడ్యమి | - | కామేశ్వరీ |
| 2. విదియ | - | భగమాలినీ |
| 3. తదియ | - | నిత్యక్లిన్నా |
| 4. చవితి | - | భేరుండా |
| 5. పంచమి | - | వహ్నివాసినీ |
| 6. షష్ఠి | - | మహావజ్రేశ్వరీ |
| 7. సప్తమి | - | శివదూతీ |
| 8. అష్టమి | - | త్వరితా |
| 9. నవమి | - | కులసుందరీ |
| 10. దశమి. | - | నిత్యా |
| 11. ఏకాదశి | - | నీలపతాకా |

| | | |
|---|---|---|
| 12. ద్వాదశి | - | విజయా |
| 13. త్రయోదశి | - | సర్వమంగళా |
| 14. చతుర్దశి | - | జ్వాలామాలినీ |
| 15. పూర్ణిమ, అమావాస్య | - | చిత్రా |

ఈ నిత్యల ధ్యానశ్లోకాలు, స్వరూపాలు నాచే వ్రాయబడిన 'శ్రీవిద్యాదర్పణము' లో ఇవ్వబడినాయి. నిత్యలు తిథుల స్వరూపాలు, తిథులు కళాస్వరూపాలు. వీటి వల్లనే కాలచక్రం తిరుగుతున్నది.

*24. "శ్రద్ధానురూపాధీర్దేవతాతయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైక రూపాదేవతా"*

**నవమావరణ :** శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ బిందువు. ఇందున్న ప్రధానదేవతలు కామేశ్వరీ కామేశ్వరులు. ఇందులో సాధకుడి ఆత్మయే కామేశ్వరి, బుద్ధి కామేశ్వరుడు. కాబట్టి సాధకుడి ఆత్మ, దేవి రెండూ ఒక్కటే. ఎప్పుడయితే తన ఆత్మ దేవి స్వరూపం అయిందో, అప్పుడు అతడు పరబ్రహ్మ అవుతాడు. దీనినే బ్రహ్మాత్మైక్యాను సంధానము అంటారు. ఇదే జీవన్ముక్తి.

*25. "సలిలమితి సాహిత్యకరణగ్ం సత్వమ్"*

ఇక్కడ నుంచి అంతర్యాగము వివరించబడుతోంది. బాహ్యమైన వస్తువులన్నీ విషయ వాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలి పెట్టెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువుల చేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్వ రజ స్తమో గుణాలన్నాయి. వీటిలో మొదటి దానిని పెంపొందించి, మిగిలిన రెండింటినీ తగ్గించాలి. సత్వగుణమే జలము.

*26. "కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః"*

**ఉపచారాలు :**

బాహ్యాపూజలోదేవికి రాజోపచారాలు, దేవోపచారాలు, మంత్రోపచారాలు అని వివిధ రకాలైన ఉపచారాలున్నాయి. అయితే అంతఃపూజలో ఉపచారము అంటే నిత్యము కాని వాటిని వదలి వేయటము. బ్రహ్మపదార్థమే సత్యము కాబట్టి మిగిలినవి వదలివేయాలి. ఉదాసీనభావము తూష్ణీభావంగా రూపొందకూడదు. ఇదే అంతఃపూజలో ప్రధానమైన ఉపచారము.

### 27. "అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచారః"

**అనుపచారాలు :**

బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము. అది కనిపించనంత మాత్రం చేత లేదు అనుకోరాదు. సర్వజీవరాశులయందు పరబ్రహ్మమున్నది. అంతేకాని బ్రహ్మము లేదనుకోవటము అపచరాము, తెలియని తనము, అపరాధము. ఇదే అనుపచారము, చేయతగనిది.

### 28. "బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్తి త్వావాహనమ్"

**ఆవాహన :**

దేహంలో బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలున్నాయి. ఆత్మ అనేది ఈ ఇంద్రియాల ద్వారానే ప్రకాశిస్తోంది. కాబట్టి వాటి యొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే దేవిని అవాహన చెయ్యటము.

### 29. "తస్యబాహ్యాంతః కరణానామేకరూప విషయ గ్రహణమాసనమ్"

**ఆసనము :**

శరీరంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పధ్నాలుగు విభిన్నమైన ధర్మాలు కలిగి ఉన్నాయి. ఆ ధర్మాలను అరికట్టి సర్వము బ్రహ్మపదార్థము అని భావించటమే ఆసన సమర్పణ.

### 30. "రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్ "

**పాద్యము :** అంటే కాళ్ళు కడుక్కునేనీరు. ఆ దేవి సాధకుడి శరీరంలో ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశ శక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్ల బిందువయింది. విమర్శశక్తి శుక్ల బిందువులో ప్రవేశించి రర్తబిందువయింది. ఈ రెండింటి కలయిక వలన మిశ్రమ బిందువు ఏర్పడింది. ఇప్పుడు .....

రక్తబిందువు - చంద్రుడు
శుక్ల బిందువు - అగ్ని
మిశ్రమ బిందువు - సూర్యుడు

మిశ్రమబిందువు నుంచి నాదము, దాని నుంచి కళలు ఆవిర్భవిస్తాయి. ఇప్పుడు మిశ్రమ బిందుస్వరూపమైన కామేశ్వరీద్వందము యొక్క

కుడికాలు - శుక్ల వర్ణమైన ప్రకాశాంశము

ఎడమకాలు - రక్తవర్ణమైన విమర్శాంశము.

ఈ రెండు పాదాలను ధ్యానిస్తూ వాటికి భేదము లేదు అనుకోవటమే పాద్యము.

### *31. "ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్"*

**అర్ఘ్యము :**

అంటే చేతులు కడుక్కునే నీరు. శ్రమ తీరటానికి ఇచ్చే అల్పాహారం. అంటే త్రాగేందుకు ఇచ్చేనీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందాను సంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము.

### *32. "స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్ "*

**ఆచమనము :**

ఆచమనము అంటే మంత్ర పూర్వకంగా నోటిలోకి తీసుకునే నీరు. ఆత్మస్వరూపమైన దేవి స్వచ్ఛమైనది. అస్వచ్ఛత స్వయం సిద్ధమైనది అని గ్రహించుట.

### *33. "చిచ్చంద్రమయీ సర్వాంగప్రవణగ్ం స్నానమ్"*

**స్నానము :**

బాహ్యపూజలో దేవతకు పంచామృత స్నానము చేయిస్తారు. కాని అంతఃపూజలో అదిలేదు. కుండిలినీ శక్తి ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసి కుండలినీ శక్తిని గనక నిద్రలేపినట్లైతే, అది షట్చక్రాల గుండా ప్రయాణించి, గ్రంధి త్రయాన్ని భేదించి సహస్రారం చేరి తననోటితో సహస్రదళ పద్మాన్ని కరిచి పట్టుకుంటుంది. అప్పుడు సహస్రారము అనే చంద్రమండలం నుండి అమృతధారలు స్రవించి శరీరంలోని డెబ్భైరెండువేల నాడీ మండలాన్నీ తడుపుతాయి. ఈ రకంగా అమృతవర్షము కురిపించటమే ఆత్మదేవత (పరదేవత)కు స్నానము. ఈ రకంగా అమృతవర్షము వలన శరీరము సమశీతోష్ణమవుతుంది.

### *34. "చిదగ్ని స్వరూప పరమానందశక్తి స్ఫురణం వస్త్రం"*

**వస్త్రము :**

వస్త్రము అంటే శరీరాచ్ఛాదనకు ఉపయోగించేది. సాధకుని శరీరంలోని కాంతి అంతా ఆపరాశక్తి యొక్క తేజస్సే. ఈ విషయం తెలిసి బ్రహ్మానందము పొందుటయే వస్త్ర ప్రదానము,

### 35. "బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్"

**యజ్ఞోపవీతము:** దీన్నే బ్రహ్మసూత్రము అంటారు. జగత్తు అంతా బ్రహ్మమయమని సూత్రము కాబట్టి  ఇది బ్రహ్మసూత్రము. దేహంలో ఉండే నాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది. దీన్నే బ్రహ్మనాడి అని కూడా అంటారు. అంతః పూజలో ఈ సుషుమ్నానాడినే బ్రహ్మసూత్రము అని భావించాలి.

గాయత్రీ మంత్రానికి ప్రతీక యజ్ఞోపవీతము. తొంభై ఆరు బెత్తలు ప్రమాణం కల సూత్రము (దారము) తయారు చేసి దాన్ని మూడుచుట్లు చుట్టాలి. ఇప్పుడు రెండు చివరలు కలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రములో మూడుపోగులుంటాయి. అంటే మొత్తం ఇరవై ఏడు పోగులు ఉంటాయి. తొంబై ఆరు బెత్తలు ప్రమాణము - తత్త్వములు.

| | | |
|---|---|---|
| మూడు ఆవృతులు | - | త్రిగుణములు |
| మూడు ముడులు | - | మూడుగ్రంథులు |
| మూడు గ్రంథులు | - | బ్రహ్మముడి |
| ఇరవైఏడు పోగులు | - | ఇరవై ఏడు భేదములు కల జగత్తు. |

బ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని ధరించి కర్మలు చేస్తారు. యజ్ఞోపవీతాన్ని తీసివేయటమంటే సన్యాసం స్వీకరించటము. అట్టి సన్యాసి బ్రహ్మకాండను చేసేవాడు, సర్వకర్మ విముక్తుడు, జీవన్ముక్తుడు.

సుషుమ్నానాడిలో సూక్ష్మనాడులు కలిసే చోటును గ్రంథి అంటారు. అది ఇరవై ఏడు సూక్ష్మనాడుల సమూహము. అందుకనే సుషుమ్నానాడి యజ్ఞోపవీతము కంటె సత్యమైనది. సహజమైనది. ఇదే కంఠ సూత్రము.

### 36. "స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణం విభూషణమ్"

**ఆభరణాలు :**

దేవతకు కంఠ సూత్రంతో పాటుగా వివిధ ఆభరణాలు సమర్పించాలి. సాధకుడు తాను కూడా పరబ్రహ్మస్వరూపమే అని, మాయా మోహం చేత తాను మనిషిగా ఉన్నానని గ్రహించి మాయాది వస్తువులతో తనకు సంబంధము లేదు అని వాటిని పరిత్యజించటమే దేవికి ఆభరణములు అర్పించటము.

*37. "సత్సంగపరిపూతాను స్మరణం గంధః"*

**గంధము :**

దేహానికి గంధం రాసుకోవటం చేత సువాసన రావటమే కాకుండా పవిత్రత కూడా వస్తుంది. సాధకుడి సహస్రారంలో ఆ పరాశక్తి ఉన్నదని, దాని కాంతిచేతనే అతని శరీరము తేజస్సుతో ప్రకాశిస్తుందని చెప్పటం జరిగింది. ఈ రకంగా జరగటం చేత సాధకుడు తాను ఎప్పుడూ పవిత్రుడనే అనే భావం కలిగి ఉంటాడు. ఇదే దేవికి శ్రీచందనం సమర్పణ.

*38. "సమస్త విషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమమ్"*

**పూజ :**

భగవంతుని భక్తుడు నానావిధ పుష్పాలతో పూజిస్తాడు. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా, మనసును పరబ్రహ్మ మందు లయం చేసి, సర్వము బ్రహ్మమమని తెలుసుకోవటమే పుష్పపూజ.

*"అహింసా ప్రథమ పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః ।*
*దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతఃపరం" ॥*

అహింస, ఇంద్రియ నిగ్రహము, దయ, క్షమ, జ్ఞానము అనేవి పంచపుష్పాలు. సాధకుడు అరిషడ్వర్గాలు జయించి, అహంకారమనే పుష్పంతో దేవిని పూజించాలి. అంటే ఈ స్థితిలో నేను అహంకారాన్ని, నాది అనే భ్రాంతిని వదలివెయ్యాలి.

*39. "తేషామేవ సర్వదాస్వీకరణం ధూపః"*

**ధూపం :**

సాధకుడు ఇంద్రియచాపల్యానికి లోనుగాకుండా, ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకోవటమే ధూపము.

*40. "పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కా కాశదేహో దీపః"*

**దీపం:**

బ్రహ్మతేజస్సు వాయువుతో కలసి జ్వాలగా ప్రకాశిస్తుంది. అది విశ్వమంతా వ్యాపించి ఉంది. సాధకుడి శరీరము పరబ్రహ్మము యొక్క కాంతి పుంజములతో ప్రకాశిస్తోంది. ఇప్పుడు సాధకుడు ఆకాశాన్నే తన శరీరంగా భావించి, తన శరీరంలో ఉన్న ఆ పరాశక్తిని, చిత్కలను దీపముగా భావించటమే దేవికి దీపసమర్పణ.

## *41. "సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్"*

**నైవేద్యము :**

పూజానంతరము నైవేద్యము చెయ్యాలి. ఇంద్రియచాంచల్యము లేకుండా అంటే ఇంద్రియాలను జయించి బ్రహ్మాకారవృత్తితో ఉండటమే నైవేద్యము. ఇది బ్రహ్మానందానుభవము.

## *42. "అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్"*

**తాంబూలము :**

ఆకు వక్క సున్నము కలిస్తే తాంబూలము అవుతుంది. అవే జాగ్రత్స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలు. ఆమూడు అవస్థలను తురీయావస్థలో విలీనం చెయ్యటమే తాంబూల సమర్పణ.

## *43. మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్."*

**ప్రదక్షిణము :**

శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారము వరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకు సుషుమ్నా మార్గం గుండా తిరుగుతూ ఉంటుంది. ఈ రకంగా ప్రాణవాయువు సంచారము చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న దేవతకు ప్రదక్షణము. దీనికే అజపారూప హంస అని పేరు.

**హ** కారసంజ్ఞ గల పరమాత్మ **స** కార సంజ్ఞగల ప్రకృతితో కలసి హంసరూపమైన శబల బ్రహ్మము అవుతాడు. ఈ శబలబ్రహ్మము తొమ్మిది ద్వారాలు గల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడినవాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడు తున్నాడు. అంటువంటి హంస అనబడే జీవుడికి.

అగ్ని, చంద్ర మండలాలు - రెక్కలు
ఓంకారము - శిరస్సు
జ్ఞాననేత్రము - ముఖము
హకరసకారములు - పాదాలు
(హకారము రుద్ర బీజము సకారము శక్తి బీజము)

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యి లాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

సహస్రారము అనేది ఎనిమిది దళాలు కలిగిన పద్మము. ఇందులోని ఒక్కొక్క దళంలోనూ చిన్నచిన్న రేకులు నూట ఇరవై అయిదు చొప్పున ఉంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యి దళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళకమలం అంటారు. ఎనిమిది దళాలు ఎనిమిది దిక్కులకు తిరిగి ఉంటాయి.

ఎనిమిది దళాల వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | |
|---|---|
| తూర్పుదిక్కు | - సద్బుద్ధి |
| ఆగ్నేయం | - నిద్ర, దప్పిక, ఆలస్యము |
| దక్షిణం | - క్రూర బుద్ధి |
| నైరుతి | - తాపబుద్ధి |
| పడమర | - విలాసము |
| వాయువ్యము | - నడచుట మొ ॥ విషయములందుబుద్ధి |
| ఉత్తరము | - సురతము నందు ఆసక్తి |
| ఈశాన్యము | - ద్రవ్యము దానంచేసే తలంపు |
| పద్మాంతరాళంలో | - ఇహపరలోకవిముక్తి |
| కింజల్కము (తామరపువ్వులోని కేసరములు) | - మెలకువ |
| తామరదుద్దు | - కల |
| దుంప | - నిద్ర |

ఆత్మ ఏక్షణాన సహస్రారాన్ని వదులుతుందో ఆక్షణములోనే పరబ్రహ్మలో ఐక్యమవుతుంది. దీనికే తురీయావస్థ అని పేరు.

***44. "తురీయావస్థా నమస్కారః"***

**నమస్కారము:** దేవికి నమస్కారము చెయ్యటమంటే సాధకుడు తురీయావస్థ చేరటమే.

***45. "దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్"***

**బవిహారణము :**

సాధకుడి స్థూలశరీరము మాయతో కూడుకున్నది. సూక్ష్మశరీరము జ్ఞాన స్వరూపము తాను జ్ఞానస్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మ యందు విలీనం చేసినట్లు భావించటమే బలిసమర్పణ.

*46. "సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ంహోమః"*

**ధ్యానము :**

సాధకుడు తాను ఆదేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీనమయినట్లుగా తలచి, తానుకుడా ఆ తేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మమయని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

*47. "స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్"*

**ధ్యానము:**

సాధకుడు తాను ఆదేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీనమయినట్లుగా తలచి, తానుకుడా ఆతేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మమయని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

*48. "ఏవ ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధిః"*

**బ్రహ్మత్వసిద్ధి :**

ఈ విధంగా తననుతాను పరబ్రహ్మ స్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము దేవియందు మనసు లగ్నం చేసినవాడు ఆ దేవిలో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటం అంటారు.

*49. చించితకార్యాణ్యత్నేన సిద్ధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్ ॥*

**ఫలము :**

ఈ విధంగా అంతః పూజచేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడినే శివయోగి అంటారు అని ఈ ఉపనిషత్తులో చెప్పబడింది.



# 14. శ్రీ చక్రము - బిందువు

శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రం. ఇక్కడ శివశక్తులు విహరిస్తూ ఉంటారు. "యోగినీ హృదయంలో" త్రికోణంలో బిందువున్నదని చెప్పబడింది. పరాపశ్యంతులు బిందుత్రికోణాలుగా ఉన్నాయి "**త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః**" అని చెప్పటం వల్ల రెండూ ప్రకాశ విమర్శాంశలుగా ఉన్నాయి 'లలితాత్రిశతి' ఫలశ్రుతి, భైరవయామళము వంటి గ్రంథాలలో "**త్రికోణే బైందవంశ్లిష్టమష్టారేష్టదళాంబుజమ్**" అని చెప్పబడింది. అంటే బిందువు త్రికోణంలో ఉన్నదని అర్థం. ఈ విషయం అందరూ అంగీకరిస్తున్నారు. కౌళసమయాచారాల్లో అర్చనా భేదం మాత్రమే ఉన్నది, కాని బిందువు మాత్రం త్రికోణంలోనే ఉన్నది. అయితే లొల్లా లక్ష్మీధరులు మాత్రం శ్రీచక్రలేఖనంలోనే భేదం చెబుతున్నారు. వీరిమతానుసారం కౌళాచార సంప్రదాయంలో బిందువు త్రికోణంలో ఉంటుంది. కాని సమయమతానుసారము బిందువు చతుష్కోణము లేదా షట్కోణములో ఉంటుంది. దీనికి కారణము, బిందువు చంద్రమండలంలో ఉంటుంది. ఆ చంద్రమండలం చతుష్కోణాకారంలో ఉంటుంది అన్నారు. అయితే భాస్కరరాయల వారితో పాటుగా మిగిలిన వారందరూ కౌళసమయాచారాల్లో బిందువు త్రికోణంలోనే ఉన్నదని అంగీకరిస్తున్నారు. మరి ఆ త్రికోణం ఎక్కడ ఉంటుంది?

దేవీపూజలో కౌళసమయాచారాలున్నాయని ముందేచెప్పటం జరిగింది. కౌళాచారులు చతుర్విధ పురుషార్థాలలోను అర్థకామాలకే ప్రాధాన్యతనిస్తారు. వారికి పారమార్థికదృష్టి లేదు. షట్చక్రాలలో ఆధార స్వాధిష్ఠానాలయందే వీరు దేవిని పూజిస్తారు, వీరిలో ఒకతెగవారు ప్రత్యక్ష త్రికోణాన్ని పూజిస్తారు. అంటే స్త్రీయోనిని ప్రత్యక్ష త్రికోణంగా భావిస్తారు. అందులో ఉన్న మన్మథ ఛత్రమే బిందువు అని వీరి నమ్మకం. అందుకే వీరి పూజ, ఆచారాలు అవైదికములు, నీతి బాహ్యాములు. వీరి మతానుసారము ఆధారచక్రంలోనే త్రికోణమున్నది.

కౌళ సమయాచారాలను తెరచిచూసినట్లైతే మానవ దేహంలో రెండు చోట్ల త్రికోణమున్నదని చెప్పబడుతోంది. కౌళాచారులు ఆధార చక్రంలో త్రికోణమున్నదని చెప్పగా, సమయాచారులు మస్తకమే త్రికోణము అంటున్నారు. ఈ రెండింటిలోనూ బిందువున్నది. మానవ దేహంలో సహస్రదళ పద్మాలు రెండు ఉన్నాయి. ఒకటి ఆధార చక్రానికి క్రిందగా, రెండవది ఆజ్ఞా చక్రానికి పైభాగాన వీటిని గురించి గతంలో వివరించటం జరిగింది.

శ్రీచక్రాన్ని షట్చక్రాలతో అనుసంధానం చేసేటప్పుడు భైరవయామళంలో ఈ విధంగా చెప్పబడింది.

*త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా ।*
*మనుకోణం చతుష్కోణం చ కోణచక్రాణి షట్క్రమాత్ ।*
*మూలాధారం తథా స్వాధిష్ఠానం చ మణిపూరకమ్ ।*
*అనాహతం విశుద్ధాఖ్యా మాజ్ఞాచక్రం విదుర్బుధాః ॥*

శ్రీచక్రంలోని త్రికోణము మొదలైన చక్రాలు మూలాధారము మొదలైన షట్చక్రాలతో అంతర్భావం పొందుతున్నాయి. గౌడపాదులవారు తమ **"సుభగోదయస్తుతి"**లో ఇలా అన్నారు.

*త్రికోణంచాధారంత్రిపుర వినుతేష్టార మనఘే*
*భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్*
*దశారం తే సంవిత్కమల మథ మన్వస్రకముమే*
*విశుద్ధం స్యాదాజ్ఞాశివఇతి తతో బైందవగృహమ్ ॥*

ఇందులో శ్రీచక్రము - షట్చక్రాల ఐక్యత వివరించబడింది.

1. ఆధారచక్రానికి - త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి - అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి - అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధచక్రానికి - చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి - అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి - భూపురంతో ఐక్యత

దీనినిబట్టి ఆధార చక్రంలోనే త్రికోణమున్నదని తెలుస్తోంది, కౌళాచారులు ఆధార స్వాధిష్ఠానాల తరువాతనే బ్రహ్మగ్రంథిని చెబుతారు.

సమయాచారులది పారమార్థికదృష్టి జ్ఞానము, వైరాగ్యము, జన్మరాహిత్యము అనేవి వీరిప్రధాన లక్ష్యాలు. వీరి మతం ప్రకారం బిందువు బ్రహ్మరంధ్రంలోనే ఉంటుంది.

'**భైందవం బ్రహ్మరంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్**' అనటం చేత బ్రహ్మరంధ్రమందు బిందువు ఉన్నదని మస్తకమే త్రికోణమని చెప్పబడుతోంది. "**శ్రీచక్రం బ్రహ్మరంధ్రేతు, సువృత్తం చ త్రికోణకమ్**" బ్రహ్మరంధ్రంలోనే బిందువు, త్రికోణము ఉన్నాయి. వీరి మతానుసారము అజ్ఞాచక్రానికి పై భాగాన బ్రహ్మగ్రంథి ఉంటుంది. ఇదే చంద్రమండలం. సమయాచారులలో కొంతమంది ప్రకారము చంద్రమండలం వృత్తాకారంలో ఉంటుంది. కాబట్టి బిందువు వృత్తంలో ఉంటుంది. ఈ విధంగా శ్రీచక్రంలోని బిందువు త్రికోణంలో ఉన్నదని, చతుష్కోణంలో ఉన్నదని, వృత్తంలో ఉన్నదని, భిన్నవాదనలు, సంప్రదాయాలు ఉన్నాయి. ఈ రకంగా భిన్న సంప్రదాయాలు న్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమే పాటించాలని ఆర్యోక్తి.

**బిందువే శివచక్రమా ?**

శ్రీచక్రంలో నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు ఉన్నాయని అన్ని గ్రంథాలలోను చెప్పబడింది. భైరవయామళంలో చెప్పినట్లుగా...

> ***త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా***
> ***చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచచ:***

త్రికోణము, అష్టకోణము దశారయుగ్మము, చతుర్దశారము అనే ఐదు శక్తి చక్రాలు.

> ***బిందుశ్చాష్టదళం పద్మం, పద్మం షోడశపత్రకమ్***
> ***చతురస్రం చ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్ ॥***

బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము అనే నాలుగు ఒకేరకంగా ఉన్నాయి. కాని గౌడపాదులవారు తమ సుభగోదయసుత్తిలో ఈ విధంగా అన్నారు.

> ***త్రికోణైరష్టారం త్రిభిరపిదశారం సముదభూ***
> ***ర్దశారం భూగేహాదపి చ భువనాశ్రం సమభవత్ ।***
> ***తతో ఽభూన్నాగారం న్నవతిదలమస్మా త్రివలయమ్***
> ***చతుర్ద్వా: ప్రాకారత్రితయమిదమేవాంబ శరణమ్ ॥***

త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము అనే ఐదు శక్తి చక్రాలు. అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము , భూపురము అనే నాలుగు శివచక్రాలు. శ్రీవిద్యకు మూలగ్రంథంగా చెప్పబడే '**సుభగోదయస్తుతి**'లో శివచక్రాలు చెప్పేటప్పుడు

వాటిలో బిందువుకు బదులుగా వృత్తత్రయము చెప్పటం జరిగింది. అలాగే శివ శక్తి చక్రాల ఐక్యము చెప్పేటప్పుడు ....

*త్రికోణేతు వృత్తత్రితయ మిభకోణే వసుదళం*
*కళాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్*
*చతుశ్చక్రం శైవం నివవతి భగే శాక్తికముమే*
*ప్రధానైక్యం షోఢా భవతి చ తయోః శక్తి శివయోః ॥*

1. త్రికోణంతో - వృత్తత్రయము ఐక్యత
2. అష్టకోణంతో - అష్టదళము ఐక్యత
3. దశారయుగ్మముతో - షోడశదళము ఐక్యత
4. చతుర్దశారంతో - భూపురము ఐక్యత పొందుతున్నాయి.

ఇక్కడ త్రికోణములో వృత్తత్రయము ఉన్నదని చెప్పబడింది. అంతే కాని త్రికోణంలో బిందువు లేదు. అసలు గౌడపాదులవారు బిందువును చెప్పలేదు వృత్తత్రయాన్నే శివకోణము అన్నారు. దీనికి కారణము ఏమిటంటే బిందువు అవ్యక్తమైనది. అది పరబ్రహ్మ స్వరూపము. నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన వాడు పరబ్రహ్మ. అందుకే బిందువు అవ్యక్తమైనది అని చెప్పబడుతోంది. దానినుంచే శ్రీచక్రంలోని మిగిలిన చక్రాలన్నీ ఉద్భవించినాయి. అందుచేతనే గౌడపాదులవారు బిందువుకు బదులుగా వృత్తత్రయాన్నే శివచక్రంగా తీసుకున్నారు.

ఈ రకంగా చూచినట్లయితే భూపురము, వృత్తత్రయము, షోడశదళము, అష్టదళము అనబడే శివచక్రాలు వెలుపల, కోణరూపంలో ఉన్న శక్తి చక్రాలు లోపల ఉన్నాయి. ఈ రకంగా శివచక్రాలు వెలుపల, శక్తి చక్రాలు లోపల విడివిడిగా ఉండటం శాస్త్ర సమ్మతం కాదు. అందుచేత శివచక్రాల యొక్క శక్తిని బిందువులో నిక్షిప్తం చేసి, ఆ బిందువును త్రికోణం మధ్యలో ఇమడ్చటం జరిగింది. దీనివల్ల శివ శక్తి చక్రాలు వేరువేరుగా ఉండే దోషం పోయిందని కొందరి వాదన. ఈ విధంగా జరిగినట్లయితే, బిందువుతోకలసి శివచక్రాలు ఐదుకావాలి. లేదా, బిందువు ఒక్కటే శివచక్రం కావాలి. అప్పుడు శ్రీచక్రంలోని ఆవరణలు తొమ్మిదికావు.

శంకరభగవత్పాదులవారు శ్రీచక్రంలోని వృత్తాలకు ప్రతీకగా బిందువును ఏర్పాటు చెయ్యటం జరిగింది అన్నారు. దీనివల్ల రెండు వైపులా శివచక్రాలు, మధ్యన శక్తి చక్రాలు ఉంటాయి. అనగా శక్తి చక్రాలకు ఒకవైపున బిందురూపంలో ఒకటి, రెండవవైపున అష్టదళము, షోడశదళము, భూపురత్రయము శివశక్తులు ఉంటాయి. దీనివల్ల శివ శక్తి చక్రాలు విడివిడిగా ఉండే దోషం పోయింది. ఈ విషయాన్ని శ్రీవిద్యలో నిష్ణాతులుగా చెప్పబడే లక్ష్మీధరులు, భాస్కరరాయలు మొదలైనవారందరూ అంగీకరిస్తున్నారు.

అయితే శివచక్రంగా చెప్పబడిన వృత్తత్రయం మాట ఏమిటి? వృత్తత్రయానికి బదులుగా బిందువు ఏర్పాటు చేయబడి, నవావరణలలోకూడా చేర్చబడింది. కాబట్టి వృత్తత్రయానికి చేసే పూజ బిందువుకు జరుగుతోంది. వృత్తత్రయం మాత్రం శ్రీచక్రం నుంచి తొలగించబడలేదు. వాటికి అర్చన లేదు.

ఈ వృత్తత్రయాన్ని పంచదశీ మహామంత్రంలోని మూడు హ్రీంకారాలకు, షట్చక్రాలలోని గ్రంథి త్రయానికీ ప్రతీకగా చెప్పటం జరిగింది. ఈ విషయాన్ని లక్ష్మీధరులు, భాస్కరాచార్యులు మొదలైన వారందరూకూడా అంగీకరించటం జరిగింది.



# 15. దశ రూప బిందువు

గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలో ఈ విధంగా అన్నారు.

***సహస్రారం బిందుర్భవతి చ తతో బైందవగృహం***
***తదేతస్మాజ్జాతం జగదిద మశేషం సకరణమ్ ।***
***తతో మూలాధారా ద్వితయమభవత్తద్దశదళం***
***సహస్రారాజ్జాతం తదితి దశధా బిందురభవత్ ॥***

సహస్రారము అనేది బైందవ గృహము. దీనిలోనే బిందు వుంటుంది. ఈ బిందువు నుండి సృష్టి అంతా వచ్చింది. ఆధార స్వాధిష్ఠానాలలో ఉన్న పదిదళాలూ సహస్రారం నుండే ఉత్పన్నమైనాయి. అందుచేతనే ఒకే బిందువు పది విధాలుగా కనిపిస్తున్నది.

త్రికోణము మొదలైన చక్రాలన్నీ ఆధారము మొదలైన షట్చక్రాత్మకముగా పరిణతములైనాయి. శ్రీచక్రంలో త్రికోణము బైందవ స్థానము. త్రికోణ త్రయంతో అష్టకోణ నిర్మాణం జరగగా త్రికోణము నుండే బిందు స్థానము వస్తున్నది అని చెప్పబడుతోంది. అసలు బిందువు అనేది చతుష్కోణము మధ్యన ఉంటుంది. '**త్రికోణే బైందవం శ్లిష్టం**' అని చెప్పబడింది కదా! మరి చతుష్కోణంలోకి బిందువు ఎలా వచ్చింది? అనేది ప్రశ్న. భైరవయామళము వామకేశ్వర తంత్రాలలో '**త్రికోణే బైందవమ్ శ్లిష్టం**' అని చెప్పబడింది. వీటిని ఆధారంగా చేసుకొని వ్రాసిన గ్రంథాలన్నింటిలోనూ బిందువు త్రికోణంలో ఉన్నదనే చెప్పబడింది.

పండితులను కూడా మాయలో పడేస్తున్న తంత్రాలు కాకుండా, సాధకులకు మోక్షమార్గం చూపటానికి వేరే ఏదైనా చెప్పమని పార్వతీదేవి ఈశ్వరుణ్ణి అడిగినప్పుడు, ఆయన శ్రీవిద్యాతంత్రాన్ని చెప్పాడు అని సౌందర్యలహరిలోని ముప్పైఒకటవ శ్లోకంలో చెప్పబడింది. శ్రీవిద్యాతంత్రం అంటే వామకేశ్వర తంత్రమేనని కొందరి వాదన. కాని లక్ష్మీధరులు మాత్రం ఇది 'సమయవిద్య' అంటారు. అందుకే లక్ష్మీధరులు బిందువు త్రికోణంలో లేదు. చతుష్కోణంలో ఉన్నది, చతుష్కోణము అంటే సహస్ర కమలాంతర్గతమైన చంద్రమండలము అన్నారు. కాని భాస్కరరాయల వారుకూడా బిందువు త్రికోణంలోనే ఖాయం చేశారు. అయితే భాస్కరరాయల వారి మతం ప్రకారం సమయ, వామాచారాలు, రెండూ

ఉపాసించతగ్గవే. కాని లక్ష్మీధరుల ప్రకారము కౌళ వామాచారాలు ఉపాసనాయోగ్యాలు కావు. సమయాచారమే ఉపాసించతగినది. వీరి మతానుసారము చంద్రమండలం మధ్యన గల బైందవ స్థానమే సుధాసింధువు లేక సరఘ అని పిలవబడుతుంది. ఈ రకంగా బిందువు చతుష్కోణంలో ఉన్నది. త్రికోణపూజ యోనిపూజలను ఖండించటం జరిగింది. దీన్ని ఆధారంగా చేసుకుని యోనిపూజ చేసే కౌళ వామాచారులు స్వాధిష్ఠానం తరువాత బ్రహ్మగ్రంధిని చెప్పగా సమయమతంవారు ఆజ్ఞాచక్రం తరువాత బ్రహ్మగ్రంధిని చెబుతారు.

మూలాధారము మొదలైన షట్చక్రాలకు బిందువే కారణము. అదే ఈ సృష్టికి హేతువు. సహస్రకమలాంతర్గతమై చతుర్ద్వారాత్మక కర్ణికామధ్యమున గల చతుష్కోణాత్మక మైన శక్తితత్త్వమే బిందువు. శివతత్త్వము నాదము. ఈ బిందువు పదిరకాలుగా కనిపిస్తుంది.

***దశధా భిద్యతే బిందుః ఏక ఏవ పరాత్మకః***
***చతుర్ధా ౽౽ధార కమలే షోఢా౽ధిష్ఠాన పంకజే***
***ఉభయాకార రూపత్వాది తరేషాం తదాత్మతా***

ఒకే బిందువు ఆధార చక్రంలోని నాలుగు దళాలలోనూ నాలుగు విధాలుగానూ, స్వాధిష్ఠానంలోని ఆరు దళాలలోనూ, ఆరు విధాలుగానూ మొత్తం పది రూపాలతో కనిపిస్తున్నది. ఆధారచక్రంలోని నాలుగు దళాలు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములకు ప్రతీకలు. ఇవి జగన్నిర్మాణ హేతువులు. స్వాధిష్ఠానంలో గల ఆరు బిందువులు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలకు ప్రతీకలు. ఇవి సంహృత బిందువులు. అందుకే **"స్వాధిష్ఠానే సంసారః షడ్బిందుకృతః"** అని పతంజలి మహర్షి అన్నారు. ఈ రెండు చక్రాలకు కలిపి మొత్తం పది బిందువులుంటాయి. మణిపూరము ఆధార స్వాధిష్ఠానాత్మకమవటం చేతనే ఇక్కడ పది దళాలుంటున్నాయి. ఈ పది ఆధార స్వాధిష్ఠానానికి ప్రతీకలుగా రెండు, మొత్తం పన్నెండు దళాలు అనాహతంలో ఉంటాయి. అనాహతంలోని పన్నెండు, ఆధారచక్రంలోని నాలుగు కలిసి మొత్తం పదహారు దళాలు విశుద్ధిచక్రంలో ఉంటాయి. ఖచ్చితంగా చెప్పాలంటే మణిపురంలో పది, స్వాధిష్ఠానంలో ఆరు మొత్తం పదహారు దళాలు విశుద్ధి చక్రంలో ఉంటాయి. ఆజ్ఞాచక్రంలో ఆధార స్వాధిష్ఠానాలకు ప్రతీకలుగా రెండు దళాలుంటాయి. ఈ రకంగా మణిపూరం నుంచి ఆజ్ఞాచక్రం వరకు ఉన్న నాలుగు చక్రాలు ఆధార స్వాధిష్ఠాన ప్రతీకలుగా చెప్పబడుతున్నాయి. కాబట్టి ఆధార స్వాధిష్ఠానాలలో ఆ తరువాత ఉండే నాలుగు పద్మములు అంతర్భూతం అవుతున్నాయి. అక్కడే బిందువునకు పదిరూపాలు సిద్ధిస్తున్నాయి.

# 16. శ్రీచక్ర లేఖనము

శ్రీచక్రాన్ని రెండు రకాలుగా గీయటం జరుగుతుంది. 1) సృష్టి క్రమము 2) సంహార క్రమము.

**I. సృష్టిక్రమము :** ఇది సమయాచార చక్రము. దీనిలో 34 కోణాలు, 24 సంధులు, 28 మర్మస్థానాలు ఉంటాయి. 5 కోణాలు ముందు వైపుకూ, 4 కోణాలు వెనుక వైపుకూ ఉంటాయి. బిందువు త్రికోణం మధ్యనే ఉంటుంది.

**2. సంహార చక్రము :** ఇది కౌళాచారచక్రము. దీనిలో 4 కోణాలు ముందు వైపుకూ, 5 కోణాలు వెనుకవైపుకూ ఉంటాయి. బిందువు త్రికోణము మధ్యన ఉంటుంది. కోణాలకు సంఖ్యా నియమం లేదు. మర్మస్థానాలు, సంధులు మాత్రమే ఉంటాయి.

ఈ రెండింటి యందు శివచక్రాలు ఒకే విధంగా ఉంటాయి. అయితే శ్రీ చక్రాన్ని గీసేటప్పుడు సృష్టి క్రమంలో ముందుగా బిందువును ఉంచి, తరువాత త్రికోణము, అష్టకోణము మిగిలిన ఆవరణలు గీయటం జరుగుతోంది. కాని సంహార క్రమంలో భూపురం దగ్గర నుండి మొదలుపెట్టి బిందువు వరకు గీస్తారని చెప్పబడుతోంది. ఏది ఏమైనప్పటికీ శ్రీ చక్రాని గీయటమనేది అంత తేలిక అయిన పనికాదు. ముందుగా సన్నని ములికి గల పెన్సిలు, వంకర లేని మంచి స్కేలు, వృత్త లేఖిని కావాలి. శ్రీ చక్రాన్ని గీసే పద్ధతులలోఅతి తేలిక అయిన పద్ధతి ఇక్కడ ఇవ్వబడింది. ఈ పద్ధతిని **'శంకర భగవత్పాదులే'** స్వయంగా చెప్పారని చెప్పబడుతోంది.

*వ్యాసే దేవకృతే తత్తమ గలవిగతే భాషభాగే ఝ సూత్రా*
*న్కృత్వా పూరదళాంతే లవన ముభయతో వాతయో స్తయ భాగాన్ ।*
*దయ్యాంశాంన్మే విమార్జ స్రృథయతు వరణాగ్రాణి సూత్ర ద్వయాగ్రం*
*ప్రాకోతం రోధిగానం విహిమిసి ధునిగం దీయ్య సూనో చిరం ప్రాక్ ॥*

వ్యాసే, దేవి - 48 (చిత్రం 1) కృతే, తత్తమ గల విగతే భాష భాగే, త - 6, త్త - 6, మ - 5, గ-3, ల-3, వి-4, గ-3, తే - 6, చా - 6, ష - 6, ఝ-9, సూత్రాన్ కృత్వా (చిత్రం 2) పూరీదళాం తే, పూ - 1, రీ - 2, ద - 8, ళా - 9, లవన ల - 3, వ - 4, ముభయతో వాతయోవా - 4, త- 6, స్తోయభాగాన్స్తో - 6, య - 1, దయ్యాంశా ద- 8, య - 1 న్మే -

5, విమార్జన్ప్రయతు వరణాగ్రాణి సూత్ర ద్వయాగ్రం 1 ప్రాక్ప్రోతం ప-1, త-6, రోధి ర- 2, ధ-9, గానం గా-3, న-0, విహి వ - 4, హి - 8, మిసి మ - 5, సి-7, ధునిగం ధు - 9, గ - 3, దేయ్యు దీ - 8, యు - 1, సూనో స - 7, న - 0 చిరం చి - 6, ర - 2.

శ్రీచక్రము భూప్రస్తారము, అని మూడు విధాలు అని ముందుగానే చెప్పటం జరిగింది. ఇప్పుడు భూప్రస్తారము వివరించబడుతోంది.

ముందుగా ఒక వృత్తము గీయండి. దాన్ని గర్భ వృత్తము అంటారు. ఈ వృత్తము యొక్క వ్యాసమును 48 భాగాలుగా చెయ్యండి. అంటే 48 అంగుళాలు, లేద ఆసెంటీ మీటర్ల వ్యాసంతో ఒక వృత్తం గీయ్యండి. తరువాత మొదటి చిత్రంలో చూపినట్లుగా, వృత్తంలో అడ్డంగా తొమ్మిది గీతలు గియ్యాలి. వాటి మధ్య దూరము క నుంచి మొదలు పెడితే 6, 6, 5, 3, 3, 4, 3, 6, 6, 6. భాగాలకు ఒక్కొక్క అడ్డ గీత ఉండాలి.

(ఒకటవ చిత్రం చూడండి)

ఇప్పుడు రెండవ చిత్రంలో చూపినట్లుగా 1, 9, గీతలకు రెండు వైపులా మూడు భాగాలు, 2, 8, గీతలకు రెండు వైపులా నాలుగు భాగాలు. 4, 6 గీతలకు రెండు వైపులా పదహారు భాగాల, 5వ గీతకు రెండు వైపులా పద్దెనిమిది భాగాలు చొప్పున చెరిపి వేయండి. 3, 7, రేఖలు మాత్రం పూర్తిగా ఉంటాయి. ఆ తరువాత శక్తి కోణాలు గీయండి.

(రెండవ చిత్రం చూడండి)

1. ఒకటవ రేఖ నుంచి ఆరవ రేఖ మధ్య బిందువుకు ఒక త్రికోణము.
2. రెండవ రేఖ నుంచి తొమ్మిదవ రేఖ మధ్య బిందువుకు ఒక త్రికోణము.
3. మూడవ రేఖ నుంచి వృత్తం మీదకు ఒక త్రికోణము.
4. నాల్గవ రేఖ నుంచి ఎనిమిదవ రేఖ మధ్య బిందువుకు ఒక త్రికోణము.
5. ఐదవ రేఖ నుంచి ఏడవ రేఖ మధ్య బిందువుకు ఒక త్రికోణము గీయండి. ఇప్పుడు ఐదు శక్తి కోణాలు వచ్చినాయి. (మూడవ చిత్రం చూడండి)

ఇక శివకోణాలు.

1. తొమ్మిదవ రేఖ చివరలను మూడవ రేఖ మధ్య బిందువుకు కలపాలి.
2. ఎనిమిదవ రేఖ చివరలను ఒకటవ రేఖ మధ్య బిందువుకు కలపాలి.

3. ఏడవ రేఖ చివరలను వృత్తము అంచులతో కలపాలి.

4. ఆరవ రేఖ చివరలను రెండవ రేఖ మధ్య బిందువుతో కలపాలి.

ఇప్పుడు (చిత్రం 4) లో చూపినట్లుగా శివ, శక్తి చక్రాలు ఏర్పడతాయి. ఇక దళాలు.

*రుద్రాంగుళం యద్వసుపత్ర పంకజం*
*నవాంగుళం షోడశ పత్ర పంకజం ।*
*ధరాత్రి రేఖా చతురంగుళం చ*
*హ్యేతావతీ షణ్ణవతి ప్రమాణం ॥*

రుద్రాంగుళేతి రుద్రాం - 11, గుళయతేవసు వసు - 8, పత్ర పంకజం, నవాంగుళం - 9, షోడశ - 16, పత్ర పంకజంధరాత్రిరేఖాచతురంగుళంచ - 4, హ్యేతావతీ షణ్ణవతి - 96 ప్రమాణం.

ఇందాక గీసిన వృత్తమునకు పదకొండు భాగాల దూరంలో ఇంకొక వృత్తము గీసి అందులో అష్టదళాలు, దానికి తొమ్మిది భాగాల దూరంలో ఇంకొక వృత్తం గీసి అందులో షోడశ దళాలు గీయాలి. ఆవృత్తానికి ఒక భాగము ఆవల ఒక వృత్తము, ఇంకొక భాగము అవతల ఇంకొక వృత్తము గీయండి. ఇదే వృత్తత్రయము. వృత్తత్రయానికి రెండు భాగాలు అవతల అనగా షోడశ దళానికి నాలుగు భాగాలు ఆవతల మూడు రేఖలతో కూడిన, చతుర్ద్వార సహితమైన భూపురము గీయాలి. భూపురంలోని రేఖల మధ్య కూడా ఒకొక్కక్క భాగమే ఎడం ఉండాలి.

**ఉదాహరణ :**

పాఠకులకు సులభంగా ఉండటం కోసము ఇక్కడ సోదాహరణముగా శ్రీచక్రము ఇవ్వబడుతోంది.

ముందుగా నలభై ఎనిమిది సెంటీ మీటర్ల వ్యాసంతోఒక వృత్తం గీయండి దీన్ని 48 భాగాలు చెయ్యండి. ఒక భాగము అంటే సెంటీ మీటరు అవుతుంది. అందులో పై నుంచి క్రింది దాకా 6 6, 5, 3, 3, 4, 3, 6, 6, 6 సెంటీ మీటర్ల ఎడం ఉండేటట్లుగా మొత్తం తొమ్మిది అడ్డ రేఖలు గీయండి. ఇక్కడ ఒక భాగము అంటే ఒక సెంటీ మీటరు అని గుర్తుంచుకోండి. ఇప్పుడు 1, 9 గీతలకు రెండు చివరలా 3 (భాగాలు) సెంటీ మీటర్లు చెరిపెయ్యండి.

4, 6 గీతలకు రెండు చివరలా 16 భాగాలు చొప్పున చెరిపెయ్యండి.

5వ గీతకు రెండు పైపులా 18 భాగాలు చొప్పున చెరిపెయ్యండి.

3, 7, రేఖలు మాత్రం యధాతధంగా పూర్తిగా ఉంటాయి.

ఇప్పుడు పైన చెప్పినట్లుగా

1. ఒకటవ రేఖ చివరల నుంచి ఆరవ రేఖ మధ్యకు ఒక త్రికోణము గీయండి.
2. రెండ రేఖ చివరల నుంచి తొమ్మిదవ రేఖ మధ్యకు ఒక త్రికోణము గీయండి.
3. మూడవ రేఖ చివరల నుంచి వృత్తానికి ఒక త్రికోణము గీయండి.
4. నాల్గవ రేఖ నుంచి ఎనిమిదవ రేఖ మధ్యకు ఒక త్రికోణము గీయండి.
5. ఐదవ రేఖ నుంచి ఏడవ రేఖ మధ్యకు ఒక త్రికోణము గీయండి.

ఇప్పుడు శక్తి కోణాలు ఏర్పాడ్డాయి. తరువాత శివకోణాలు.

1. తొమ్మిదవ రేఖ చివరలను మూడవ రేఖ మధ్య బిందువుతో కలపండి.
2. ఎనిమిదవ రేఖ చివరలను ఒకటవ రేఖ మధ్య బిందువుతో కలపండి.
3. ఏడవ రేఖ చివరలను వృత్తము అంచులతో కలపండి.
4. ఆరవ రేఖ చివరలను రెండవ రేఖ మధ్య బిందువుతో కలపండి.

ఇప్పుడు శివ, శక్తి చక్రాలు ఏర్పడ్డాయి.

ఈ వృత్తము నుంచి పదకొండు సెంటీ మీటర్ల దూరంలో ఒక వృత్తము గీసి అందులో అష్ట దళాలు ఉంచండి. తరువాత అష్టదళాల నుంచి తొమ్మిది సెంటీ మీటర్ల దూరంలో ఇంకొక వృత్తం గీసి అందులో షోడశ దళాలు ఉంచండి. షోడశదళాలకు నాలుగు సెంటీ మీటర్ల దూరంలో భూపురం గీయండి. దానికి చతుర్ద్వాలు ఉండేటట్లు చూడండి. షోడశ దళాలకు సెంటీమీటరు చొప్పున దూరంలో రెండు వృత్తాలు గీయండి. ఇప్పుడు వృత్తత్రయం కనిపిస్తుంది. వృత్తాలకు లాగానే భూపురంలోని రేఖల మధ్య కూడా ఒక సెంటీ మీటరు దూరం ఉండేటట్టు చూడండి. ఇప్పుడు త్రికోణంలో బిందువు ఉంచండి. పూర్తి శ్రీచక్రం తయారైంది. దీని కొలతలు.

| | |
|---|---|
| గర్భ వృత్త వ్యాసార్థము | 24 సెం॥ మీ ॥ |
| గర్భవృత్తానికి అష్టదళ వృత్తానికి మధ్య దూరం | 11 సెం॥ మీ ॥ |

| | |
|---|---|
| అష్ట దళానికి షోడశ దళ వృత్తానికీ మధ్య దూరం | 9 సెం ॥ మీ ॥ |
| షోడశదళానికి భపురానికి మధ్య దూరం | 4 సెం ॥ మీ ॥ |
| మొత్తం వ్యాసార్థం సెంటీమీటర్లు | 48 సెం॥ మీ ॥ |

ఇప్పుడు 24 సెంటీమీటర్ల వ్యాసార్ధంతో ఒక వృత్తము, (గర్భ వృత్తము) 24+11 = 35 సెంటీమీటర్ల వ్యాసార్ధంతో ఒక వృత్తము (అష్టదళము) 35+9 = 44 సెంటీమీటర్ల వ్యాసార్ధంతో ఒక వృత్తము (షోడశ దళము) ఏర్పడ్డాయి. వృత్త కేంద్రం నుంచి 48 సెంటీమీటర్ల దూరంలో భూపురము చతురస్రంగా మూడు రేఖలతో నాలుగు ద్వారాలతో గీయబడింది. షోడశ దళం అనగా ఇంద్రాక శ్లోకంలో చెప్పినట్లుగా **షణ్ణవతి ప్రమాణం** తొంభై ఆరు ప్రమాణం గల శ్రీచక్రం ఏర్పడింది.

ఈ రకంగా పాఠకులు శ్రీచక్రాన్ని గీసి చూసుకొనగలరు.

**గమనిక :** కోణాలలో ముందు వైపు, వెనుక వైపు గల కోణాలు చివరలు అష్టదళము, షోడశ దళములలోని దళాల చివరలు ఒకే వరుసలో ఉండాలి.

శ్రీవిద్యలో హాది, కాది విద్యలున్నాయి భూపురంలో మూడు రేఖలు గలది హాది విద్యా శ్రీచక్రము. కాది విద్యలో భూపురానికి రెండే రేఖలున్నాయి. దీనిలో ముద్రా దేవతలు లేరు అని చెప్పబడుతోంది. కాది విద్యా శ్రీ చక్రంలో రెండు భూపుర రేఖలకు బదులుగా (సిద్ధులు పది, మాతృకలు ఎనిమిది. వెరసి పద్దెనిమిది) పద్దెనిమిది దళాలతో ఒక పద్మము గీయబడినదని "శ్రీవిద్యా విలాసము" లో చెప్పబడింది.

ఇవన్నీ సంప్రదాయ భేదములుగా భావించవచ్చును.



చిత్రము 1. సున్నా రేఖలు




చిత్రము 2. చెరిపి



## చిత్రము 5. శివ, శక్తి కోణాలు



చిత్రము 7. షోడశ దళము



# 17. చతుష్షష్టి యోగినులు

శ్రీచక్రము యొక్క బిందువు నందు పరదేవత ఉంటుంది. ఆమె ఒక్కొక్క ఆవరణయందు ఎనిమిది దిక్కులా ఎనిమిది మంది చొప్పున, మొత్తం అరవై నాలుగు మంది యోగినులతో సేవింపబడుతూ ఉంటుంది. వీరందరూ పరదేవతతో సమానమైన రూప, లావణ్యములు, శక్తులు కలవారు. వీరిలో ఒక్కొక్కరికీ కోటిమంది సేవాకాగణమున్నది. వీరందరూ పరమేశ్వరిని సేవిస్తూ ఉంటారు. అందుకనే ఆవిడ **"మహా చతుష్షష్టి కోటి యోగినీగణ సేవితా"** అని చెప్పబడుతోంది. ఆ దేవతను అర్చించే వారి కోరికలు ఈ యోగినులే తీరుస్తారు.

ఈ అరవై నాలుగు మంది భూపురం దగ్గర నుండి త్రికోణం వరకు ఒక్కొక్క ఆవరణలోనూ ఎనిమిది మంది చొప్పున ఉంటారు. శ్రీచక్రార్చన చేసేటప్పుడు **అష్టాష్టకార్చన** కూడా చేయవలసి ఉన్నదని **కులార్ణవతంత్రము, శ్రీ విద్యార్ణవతంత్రములలో** చెప్పబడింది. అష్టాష్టకార్చన అనగా ఎనిమిది ఆవరణలలోనూ, ప్రతిసారి ఎనిమిది దిక్కుల యందు యోగినీ ద్వమును పూజించాలి. అంటే అసితాంగ భైరవ మొదలైన ఎనిమిది మంది భైరవులు, బ్రాహ్మి మొదలైన ఎనిమిది మంది మాతృకలు. వీరికి ఒక్కొక్కరికీ ఎనిమిది మంది చొప్పున సేవకులు. అష్టాష్టకార్చనా విధానము నాచే వ్రాయబడిన **"శ్రీవిద్యా హృదయములో"** ఇవ్వబడింది.

**చతుష్షష్టి యోగినుల వివరాలు :**

**ప్రథమావరణ :** ప్రధానయోగిని **బ్రాహ్మి.** ఇతర యోగినులు.......

1) అక్షోంబా, 2) ఋక్షకర్ణాంబా, 3) రాక్షసాంబా, 4) క్షపణాంబా, 5) క్షపాంబా, 6) పింగళాక్ష్యంబా, 7) అక్షపయాంబా, 8) క్షమాంబా.

**ద్వితీయావరణ :** ప్రధాన యోగిని **మాహేశ్వరి.** ఇతర యోగినులు.........

1) లీలాంబా, 2) లోలాంబా, 3) లుత్తాంబా, 4) లుబ్ధాంబా, 5) లూకాంబా, 6) లంకేశ్వరాంబా, 7) లోలసాంబా, 8) విమలాంబా.

**తృతీయావరణ :** ప్రధానయోగిని **కౌమారి.** ఇతర యోగినులు .......

1) హుతాశనాంబా, 2) విశాలాక్ష్యంబా, 3) బాడబాముఖ్యంబా, 4) హర్షంబా, 5) హారయాంబా, 6) క్రోధిన్యంబా, 7) క్రోధిన్యంబా , 8) సరయాంబా.

**చతుర్థావరణ :** ప్రధాన యోగిని **వైష్ణవి** ఇతర యోగినులు ........

1) సంఖ్యా పీఠ సిద్ధాంబా, 2) కరలాంబా, 3) తారాంబా, 4) హృష్టాంబా, 5) హృల్లేఖాంబా, 6) దశకుందరాంబా, 7) సరసాంబా, 8) రససంగ్రాహిణ్యాంబా.

**పంచమావరణ :** ప్రధాన యోగిని **వారాహి** ఇతర యోగినులు.......

1) తాలజంఘాంబా, 2) రక్త్యాక్ష్యంబా, 3) విద్యుజ్జిహ్వాంబా, 4) కరంకాంబా, 5) మేఘనాధాంబా, 6) ప్రచండోఘంబా, 7) కాలకర్ణాంబా, 8) బలప్రదాంబా.

**షష్టావరణ :** ప్రధాన యోగిని **మాహేంద్రి.** ఇతర యోగినులు .......

1) శపాంబా, 2) చంపావళ్యాంబా, 3) ప్రవాయంబా, 4) శూలసాదికాంబా, 5) పిచువక్రాంబా, 6) పిశాచాక్ష్యాంబా, 7) పిశితాజ్ఞానాంబా, 8) లోలుపాంబా.

**సప్తమావరణ :** ప్రధానయోగిని **చాముండ.** ఇతర యోగినులు........

1) చామనాసాంబా, 2) వానరాంబా, 3) వాసనాంబా, 4) వికటాస్యాంబా, 5) వాయు వేగాంబా, 6) బృహత్కాలాంబా, 7) వికనాంబా, 8) విశ్వరూపిణ్యాంబా.

**అష్టమావరణ ;** ప్రధానయోగిని **మహాలక్ష్మి.** ఇతర యోగినులు......

1) యమజిహ్వాంబా, 2) జయన్త్యంబా, 3) దుర్జయాంబా, 4) యమాంతకాంబా, 5) బిడాలంబా, 6) రేవత్యంబా, 7) పూనాంబా, 8) విజయాంబా

ఈ రకంగా అరవై నాలుగు మంది యోగినులూ ఎనిమిది ఆవరణలలో ఉండి వారి వారి గణాలతో పరదేతను సేవిస్తూ, సాధకుల కోరికలు తీరుస్తుంటారు.



## 18. నిత్యాదేవతలు

నిత్యాదేవతలు పదహారు మంది. వీరినే షోడశ నిత్యలు అంటారు. వీరిని గురించి లలితోపాఖ్యానంలో ఈ విధంగా చెప్పబడింది.

*పున: స్వహృదయాకాశా త్సృష్ట్వా మార్తాండభైరవమ్ ।*
*తస్య బింబాత్సమాకృష్టం తిథి చక్రం మహోదయమ్ ॥*

*తత: షోడశ సంఖ్యాతా: స్వరాదీప్తా: సముద్గతా: ।*
*తేభ్యశ్చాభ్యుత్థగతా నిత్యా: కామేశీ ప్రముఖామునే ॥*

*తాశ్చదేవీ సమాకారా దేవ్యా ఏవాంశ మాశ్రితా: ।*
*తిథినిత్యా స్సమాఖ్యాతా స్తత్తిథ్యభి మానికా: ।*

*సర్వానందమయాఖ్యస్య పరితోదశ పంచచ ।*
*స్థానాన్యాశ్రిత్య వర్తన్తే రథమధ్యయ పర్వణి ॥*

పరదేవత హృదయము నుండి మార్తాండ భైరవుడు, వాని నుండి పదహారు మంది దీప్తి వంతమైన కామేశీ మొదలైన షోడశ నిత్యలు ఆ పరమేశ్వరితో సమానమైన రూపము, లావణ్యము, ఆకారము, శక్తి గలవి ఉద్భవించినాయి. ఇవి శ్రీచక్రములో సర్వానందమయమని చెప్పబడే బిందు చక్రము చుట్టూ ఆవరించి ఉన్నాయి.

ఈ నిత్యా దేవతలను గురించి 'వసిష్ట సంహిత'లో వివరించటం జరిగింది.

*శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ*
*న కస్య చిన్మయాఽఽ ఖ్యాతం సర్వమంత్రేషు గోపితమ్*
*తత్రాదౌ ప్రథమానిత్యా మహాత్రిపురసుందరీ*
*తత: కామేశ్వరీ నిత్యా నిత్యా చ భగమాలినీ ॥*

*నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్ని వాసినీ ।*
*మహావజ్రేశ్వరీ రౌద్రీ త్వరితా కుల సుందరీ ॥*

*నిత్యా నీల పతాకా చ విజయా సర్వమంగళా ।*
*జ్వాలామాలినీ చిద్రూపా ఏ తానిత్యాస్తు షోడశ: ॥*

*ప్రతిపత్ప్రభృతౌ దేవ్యాః పార్ద మా స్వంతర్వయేత్ ।*
*ఏకాదివృద్ధ్యా హాన్యా చ, దశాంతం దేవి విగ్రహమ్ ॥*

ఈ నిత్యాదేవతలు వరుసగా ....

1) మహా త్రిపుర సుందరి, 2) కామేశ్వరి, 3) భగమాలిని, 4) నిత్యక్లిన్నా, 5) భేరుండా, 6) వహ్నివాసిని, 7) మహావజ్రేశ్వరి, 8) రౌద్రి (శివదూతి), 9) త్వరితా, 10) కులసుందరి, 11) నిత్యా, 12) నీలపతాక, 13) విజయా, 14) సర్వ మంగళ, 15) జ్వాలామాలిని, 16) చిద్రూప.

ఈ పదహారు నిత్యలు శుక్ల పక్ష పాడ్యమి మొదలు పౌర్ణమి వరకు గల తిథులు రూపంలోనూ, కృష్ణ పక్ష పాడ్యమి మొదలు అమావాస్య వరకు గల తిథులు రూపంలోనూ ఉన్నారు.

*ప్రతిపన్నామ విజ్ఞే యూ చంద్రస్య ప్రథమాకళా ।*
*ద్వితీయ్యా ద్వితీయా ద్యాః పక్షయోశ్శుక్ల పక్షయోః ।*

ప్రతిపత్తు మొదలైన తిథులన్నీ చంద్రకళలు అని చెప్పబడుతోంది. అయితే వీటిలో

*దర్మాద్యాః పూర్ణిమాంతాంశ్చ కళాః పంచదశైవతు ।*
*షోడశీతు కళాజ్ఞేయూ సచ్చిదానంద రూపిణీ ॥*

**చంద్రకళలు :** ఇవి పదహారు.

1) అమృతా, 2) మానదా, 3) పూషా, 4) తుష్టి 5) పుష్టి 6) రతి, 7) ధృతి, 8) శశినిచీ 9) చంద్రికా, 10) కాంతా, 11) జ్యోత్స్న, 12) శ్రీ, 13) ప్రీతి, 14) అంగదా, 15) పూర్ణా, 16) పూర్ణామృతా.

"కామకలా విలాసము"లో నిత్యా ప్రకరణము ఈ విధంగా చెప్పబడింది.

*నిత్యా స్తిద్యాకారాస్తిథయః శ్శివశక్తి సమరసాకారాః ।*
*దివస నిశామయ్యస్తా శ్రీవర్ణాస్తేఽపిత ద్వయీరూపాః ॥*

కామేశ్వరీ మొదలైన పదిహేను నిత్యలు తిథుల రూపంలో ఉన్నాయి. ఆ తిథులు పగలు రాత్రి రూపంలో ప్రకాశ విమర్శాంశలుగా పంచదశీ మహామంత్రంలో బీజములయి శక్తుల రూపంలో ఉన్నాయి. సూర్యుని యొక్క సహాయంతోనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

చంద్ర కళలు పదిహేను పౌర్ణమినాడు చంద్రునిలో ఉంటాయి. పౌర్ణమి వెళ్ళిన మరునాడు పాడ్యమినాడు చంద్రుని మొదటి కళ చంద్రుని విడిచి సూర్యునిలో కలిసి పోతుంది. ఈ విధంగా పదిహేను తిథులకు పదిహేను కళలు చంద్రుని విడిచి పెట్టేస్తాయి. ఆ రోజు అమావాస్య. ఆ రోజు చంద్రుడు కళా విహీనుడౌతాడు. ఆ మరునాడు సూర్యుని నుంచి ఒక కళ వచ్చి చంద్రుని చేరుతుంది. ఈ రకంగా పదిహేను కళలు చంద్రుని చేరిన రోజు పౌర్ణమి. ఈ రకంగా శుక్ల, కృష్ణ పక్షాలు ఏర్పడతాయి. కాలమానము ప్రకారము.

ఒక పగలు, ఒక రాత్రి - ఒక రోజు లేక తిధి (సామాన్యంగా)

పదిహేను తిథులు - ఒక పక్షము.

రెండు పక్షములు - ఒక మాసము.

రెండు మాసములు - ఒక ఋతువు.

మూడు ఋతువులు - ఒక ఆయనము

రెండు ఆయనములు - ఒక సంవత్సరము.

సంవత్సరము అంటే మూడు వందల అరవై రోజులు. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు.

చంద్రకళా విద్య అనే పేరు గల ఈ విద్య పదిహేను తిథుల స్వరూపం కలదవటం చేత మూడు వందల అరవై కిరణములు రోజుల స్వరూపమై ఉన్నాయి. వాటినే సంవత్సరము అంటారు. కాల శక్తి స్వరూపమయిన ఆ సంవత్సరము ప్రజాపతి స్వరూపమై ఉన్నది. ప్రజాపతి జగత్కర్త. ఆ కిరణములే జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాలు కావిస్తూ ఉంటాయి.

మొత్తం మూడు వందల అరవై కిరణాలు డెబ్బైరెండు వేల నాడీ మండలంలో ప్రసరిస్తూ సుధాధారలు వర్షింపచేస్తూ సాధకులకు తృప్తినిస్తాయి. ఈ కిరణాలకు పై భాగాన పరమేశ్వరి పాదాలు ఉంటాయి. "'భైరవ యామళం''లో' ఈ విధంగా చెప్పబడింది.

***బ్రహ్మాండం భాసయన్తస్తే పిండాండ మపిశంకరి ।***
***దివాసూర్య స్తథారాత్రౌ సోమోవహ్ని శ్చ సంధ్యయోః ॥***
***ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకస్త్రయః ।***
***షష్ట్యుత్తరం చ త్రిశతం దినాన్యేవ చ హాయనమ్ ॥***
***హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిశ్రుతిః ।***
***ప్రజాపతిర్లోకకర్తా మరీచి ప్రముఖాన్ మునీన్ ॥***

సృజంత్యేతే లోక పాలాన్ తే సర్వే లోకరక్షకాః ।
సంహారశ్చ హరాయత్తః ఉత్పత్తిర్భవ నిర్మితా ॥
రక్షాతుమృడ సంలగ్నా సృష్టిస్థితిలయే శివః ।
నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తతే ॥

ఓ శాంకరీ! ఆ కిరణాలు పిండాండ బ్రహ్మాండాలను కూడి ప్రకాశింప చేస్తున్నాయి. పగలు సూర్యుడు, రాత్రులందు చంద్రుడు, సంధ్య వేళలందు అగ్ని, ఆయా కాలములను ప్రకాశింపచేస్తున్నారు. మూడు వందల అరవై రోజులు ఒక సంవత్సరము. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. మరీచి మొదలైన మునులను అతడే సృష్టిస్తున్నాడు. వీరందరూ లోక రక్షకులే. జగత్తు యొక్క సృష్టిని భవుడు, రక్షణ మృడుడు, లయము హరుడు చేస్తున్నారు. వీరందరినీ పరమేశ్వరి ఆయా పనులకు నియమించింది.

శుక్ల, కృష్ణ పక్షముల పగలు, రాత్రుల పేర్లు ఈ విధంగా ఉన్నాయి.

**1) శుక్లపక్ష పగళ్ళ పేర్లు :**

సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జాన దభిజానత్,
సంకల్పమానం ప్రకల్పమాన ముపకల్పమాన ముపక్లప్తం క్లప్తమ్
శ్రేయోవశీయ ఆయస్సభూతం భూతం.

**2) శుక్ల పక్ష రాత్రుల పేర్లు :**

దర్శా దృష్టా దర్శితా విశ్వరూపా సుదర్శనా,
ఆప్యాయమానా ప్యాయమానా ప్యాయా సూనృతా ఇరా,
అపూర్యమాణా పూరయంతీ పూర్ణా పౌర్ణమా సీతి.

**3) కృష్ణ పక్ష పగళ్ల పేర్లు :**

ప్రస్తుతం విష్టుతగ్ం సంస్తుతం కల్యానం విశ్వరూపం.
శుక్రమమృతం తేజస్వి తేజ స్సమిద్ధం
అరుణం భానుమ త్మరీచీ మదభితపస్త పస్విదితి.

**4) కృష్ణపక్ష రాత్రుల పేర్లు :**

సుతా సున్వతీ ప్రసుతా సూయమానా విషూయమానా,
ప్రీతీ ప్రపా సంపా తృప్తి స్తర్పయంతీ,
కాంతా కామ్యా కామజాతాయుష్మతీ కామధుఘా

## శుక్లపక్ష పగళ్ళు - రాత్రులు

శుక్ల పక్ష తిథుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| తిథి | నిత్యాదేవి పేరు | పగటి తిథి | రాత్రి తిథి |
|---|---|---|---|
| పాడ్యమి | కామేశ్వరీ | సంజ్ఞానం | దర్శ |
| విదియ | భగమాలినీ | విజ్ఞానం | దృష్టా |
| తదియ | నిత్యక్లిన్నా | ప్రజ్ఞానం | దర్శతా |
| చవితి | భేరుండా | జానత్ | విశ్వరూపా |
| పంచమి | వహ్నివాసినీ | అభిజానత్ | సుదర్శనా |
| షష్టి | మహావజ్రేశ్వరీ | సంకల్పమానం | ఆప్యాయమానా |
| సప్తమి | శివదూతీ | ప్రకల్పమానం | ఆప్యాయమానా |
| అష్టమి | త్వరితా | ఉపకల్పమానం | ఆప్యాయా |
| నవమి | కులసుందరీ | ఉపక్లప్తం | సూనృతా |
| దశమి | నిత్యా | క్లప్తం | ఇరా |
| ఏకాదశి | నీలపతాకా | శ్రేయః | అపూర్యమాణా |
| ద్వాదశి | విజాయా | వశీయః | పూర్వమాణా |
| త్రయోదశి | సర్వమంగళా | ఆయత్ | పూరయంతే |
| చతుర్దశి | జ్వాలామాలినీ | సంభూతం | పూర్ణా |
| పూర్ణిమా | చిత్రా | భూతం | పూర్ణమాసీ. |

## కృష్ణ పక్ష పగళ్ళు - రాత్రులు

కృష్ణ పక్షంలోని తిథులు ఈ విధంగా ఉంటాయి.

| తిథి | నిత్యాదేవి పేరు | పగటి తిథి | రాత్రి తిథి |
|---|---|---|---|
| పాడ్యమి | చిత్రా | ప్రస్తుతం | సుతా |
| విదియ | జ్వాలామాలిని | విష్టుతం | సున్వతీ |
| తదియ | సర్వమంగళా | సంస్తుతం | ప్రసుతా |
| చవితి | విజయా | కల్యాణం | సూయమానా |
| పంచమి | నీలపతాకా | విశ్వరూపం | అభిసూయమానా |
| షష్టి | నిత్యా | శుక్రం | ప్రీతి |
| సప్తమి | కుసుందరీ | అమృతం | ప్రసా |
| అష్టమి | త్వరితా | తేజస్వీ | సంసా |
| నవమి | శివదూతీ | తేజః | తృప్తిః |
| దశమి | మహావజ్రేశ్వరీ | సమిద్ధం | తర్పయంతీ |
| ఏకాదశి | వహ్నివాసినీ | అరుణం | కాంతా |
| ద్వాదశి | భేరుండా | భానుమత్ | కామ్యా |
| త్రయోదశి | నిత్యక్లిన్నా | మరీచిమత్ | కామజాతా |
| చతుర్దశి | భగమాలినీ | అభితపత్ | ఆయుష్మతీ |
| అమావాస్య | కామేశ్వరి | తపస్విత్ | కామదుఘా |

ఈ రాత్రులు మధువును సంపాదిస్తాయి. పగళ్ళు మధువును వర్షిస్తాయి. ఈ విషయ తెలుసుకున్న వారికి సుధాసింధువులు బైందవస్థానమందు కాలజ్ఞానము కలుగచేస్తాయి. వారి కోరికలు తీరతాయి. ఎవరైతే ఈ విషయం తెలుసుకోరో, వారి బైందవస్థానమందు శూన్యమయి వారికోర్కెలు నెరవేరవు.

నిత్యా దేవతల ధ్యాన శ్లోకాలు, వారి స్వరూపాలు నాచే వ్రాయబడిన 'శ్రీ విద్యాదర్పణము' లో ఇవ్వబడినాయి.

శుక్లపక్షంలో కాని, కృష్ణపక్షంలో కాని అష్టమి తిథినాడు ఉండేది త్వరితాకళ. అందుచే అష్టమి తిథి నాటి చంద్రరేఖ పరాత్పరి శిరోభాగాన అలంకారంగా ఉంటుంది.

నిత్యా దేవతల అర్చనలో కూడా సంప్రదాయ భేదాలున్నాయి. 1) ప్రతిరోజు అన్ని నిత్యలను పూజించటము. 2) ఆ తిథి నిత్యను మాత్రమే పూజించటము. అయితే రెండవ పద్ధతిలో తప్పని సరిగా ప్రతిరోజు మహానిత్యను మాత్రం పూజించాలి. అంతే కాకుండా ఈ నిత్యాదేవతలందరికీ విడివిడిగా షోడశోపచార పూజ చెయ్యాలి అని చెప్పబడింది. కాబట్టి సాధకులు గురు సంప్రదాయాన్ని పాటించగలరు.

సంస్కృత భాషకు అక్షరాలు యాభై. వాటిని మూడు భాగాలుగా చేసి, అంటే.......

అ నుంచి అః వరకు 16 అక్షరాలు - మొదటి భాగము

క నుంచి త వరకు 16 అక్షరాలు - రెండవ భాగము

థ నుంచి స వరకు 16 అక్షరాలు - మూడవ భాగము.

వాటిలో సత్త్వరజ స్తమోగుణాలు జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు, చంద్ర సూర్యాగ్నుల తత్త్వాలు చేర్చబడ్డాయి. వీటిలో నిత్యా దేవతలను కూడా చేర్చటం జరిగింది. ఈ రకంగా పంచదశీ మహా మంత్రము త్రిఖండమైనది.

నిత్యా దేవతలు త్రిభుజాకారంలో ఆవరణగా ఉండాలని, అదే శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ అని చెప్పబడుతోంది. అయితే "వామకేశ్వరతంత్రం"లో ఈ విధంగా ఉంది.

**చతురస్రాంతరాళే వా త్రికోణే వా యజేత్సుధీః**

ఇక్కడ చతురస్రాంతరాళము అంటే భూపురము షోడశ దళాలకు మధ్యన అని కొందరి వాదన. షోడశారము అనలేదు కాబట్టి భూపురానికి ఆవల '**త్రికోణే వా**' అన్నారు కాబట్టి త్రికోణంలోనే షోడశ నిత్యలుండాలని కొందరి వాదన. "తంత్ర రాజం"లో ...

**బిందావేవ నిత్యానాం యజనముక్తమ్**

శ్రీచక్ర మండలి బిందువు నందే నిత్యా దేవతల నుంచాలి.

**చక్రమధ్యే త్రికోణే తు తిర్యగ్రేఖా త్రయం లిఖేత్**

**ద్వితీయ రేఖా పార్శ్వాభ్యాం రేఖే త్వాకృష్య చోర్ధ్వగే ।**

త్రికోణ పృష్ఠ రేఖాయా మధ్య దేశే తు యోజయేత్
ఆద్యరేఖా దక్షపార్శ్వాద్రేఖా మాకృష్య చోర్ధ్వగమ్ ॥
త్రికోణ పృష్ఠ రేఖాయా వామభాగస్య మధ్యమే
ఆద్యరేఖా వామపార్శ్వా ద్రేఖామాకృష్య చోర్ధ్వగామ్ ।
త్రికోణ పృష్ఠ రేఖాయా దక్షభాగస్య మధ్యమే
యుంక్త్వా తృతీయ పార్శ్వాభ్యాం పార్శ్వరేఖాగ్రగే ఉభే ॥
రేఖే కుర్యాత్తతో రాజకోష్ఠాని ప్రభవంతి హి ।
మధ్యకోష్ఠం బిందురూపం త్రిపురాయతనం భవేత్ ।
పరితోస్యాః పంచదశ నిత్యావాసా ఇతీరితాః ॥

శ్రీచక్రమందలి త్రికోణమును పదునారు చిన్న త్రికోణాలుగా విభజించి నిత్యాదేవతల నర్చించవలెనని పై శ్లోకభాగ తాత్పర్యము. ఈ పద్ధతినే నిత్యాషోడశార్ణవ తంత్రం కూడా వివరించింది.

మధ్యత్రికోణ రేఖాసు నిత్యాస్స్వ న్యాన్ప్రపూజయేత్ ।
షోడశీంతు తతో నిత్యాం మహాత్రిపుర సుందరీం ।
తాసాం సమిష్టి రూపత్వాత్ బైందవే పరిచింతయేత్ ॥

"శ్రీవిద్యా విలాసం" అనే గ్రంథంలో .....

**అత్ర షోడశీ నిత్యా బైందవే దేవి శరీరే పూజయేత్ ఇత్య పరః సంప్రదాయః**

శ్రీచక్రమందలి త్రిభుజము యొక్క భుజముల వరుసలోనే 15 నిత్యలనర్చించి, పదునారవ నిత్యను బిందువునందు పూజింపవలయునని వివరిస్తూ మరొక సంప్రదాయం కూడా ప్రస్తావింపబడింది. అది బిందువునందే నిత్యలన్నింటినీ భావించటము! అయితే "మంత్ర రత్నాకరము"లో ఈ విధంగా ఉంది.

శుక్లపక్షే యజేన్నిత్యాః కామేశ్వర్యాది షోడశ
కృష్ణపక్షే విచిత్రాద్యాః కామేశ్వర్యవసానికాః
షోడశీం చ యజేన్మధ్యే పక్ష్యే తద్యజన క్రమమ్
బిందుపరిత ఆకల్ప్య త్రికోణే బిందుతోంతిమం॥

బిందువు చుట్టూ ఒక త్రిభుజాన్ని నిర్మించి వాటి భుజముల యందు పదిహేను నిత్యలను, పదహారవ నిత్యను బిందువు నందు పూజించాలి. ఎక్కువగా ఈ పద్ధతే వాడుకలో ఉన్నది. దీనినే శృంగేరీ, కంచి పీఠాధిపతులు కూడా ఆమోదించారు. పాఠకులు గమనింతురు గాక. నిత్య దేవతల చిత్రములు, ధ్యాన శ్లోకాలకు నాచే చేయబడిన 'శ్రీవిద్యాదర్పణము" చూడండి.






# 19. శ్రీచక్రార్చన

శ్రీచక్రంలోని దేవతలనందరిని అర్చించటాన్నే చక్రార్చన అంటారు. శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. ప్రతి ఆవరణలోనూ దేవతలున్నారు. ఆ దేవతలనందర్నీ పేరు పేరునా అర్చించటాన్నే చక్రార్చన అంటారు. 'వామకేశ్వర తంత్రం'లో చెప్పిన ఖడ్గమాలను గనక చూసినట్లైతే శ్రీచక్రంలో ఉండే దేవతలందరూ అందులో చెప్పబడ్డారు. శ్రీచక్రంలో ఎన్ని ఆవరణలున్నాయి ? ఆ ఆవరణలలో దేవతలు ఎవరు? ముద్రాశక్తులు ఏవి ? చక్రేశ్వరి ఎవరు ? ఈ రకంగా అన్ని విషయాలూ ఖడ్గమాలలో చెప్పబడ్డాయి. కాబట్టే శ్రీవిద్యలో ఖడ్గమాలకు అత్యంత ప్రాముఖ్యత ఇవ్వటం జరిగింది. తొమ్మిది ఆవరణలనూ విడివిడిగా అర్చించక పోయినప్పటికీ, ప్రతి రోజూ ఖడ్గమాలతో గనక శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే తొమ్మిది ఆవరణలను విడివిడిగా అర్చించిన ఫలితం. అంటే చక్రార్చన చేసిన ఫలితం కలుగుతుంది.

***అర్చనం ద్వివిధం చైవ । వామదక్షిణ భేదత: ।***
***వామేనవా దక్షిణేన । పూజనంతు యధారుచి: ॥***

చక్రార్చన వామాచారము, దక్షిణాచారము అని రెండు రకాలుగా జరుగుతుంది. సాధకుడు తనకు ఇష్టము వచ్చిన మార్గంలో చక్రార్చన చేయవచ్చును. అయితే వామాచారము మకారపంచకముతో కూడుకున్నది. మకారపంచకము అనగా.

***మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైదున మేవ చ***

అయితే వీటికి చెప్పే శబ్దార్థాలన్నీ అజ్ఞానంతో కూడుకున్నవి. వాటి యొక్క సరియైన అర్థాలు తెలుసుకుని అర్చన చెయ్యాలి అని జ్ఞానార్ణవతంత్రంలాటి గ్రంధాలు ప్రబోధిస్తున్నాయి. మహానిర్వాణ తంత్రంలో......

***న మద్యం మాధవీ మద్యం, మద్యం శశికిరణ రసోద్భవం***
***కర్మా కర్మా పశూన్హత్వా జ్ఞాన ఖడ్గేనచేశ్వరీ***
***మహామీనం తృతీయే చ హత్వా సంకల్ప వాసనాం***
***భక్ష్య భోజ్యాన్నం భక్ష్యమింద్రియ నిగ్రహ: తాం చతుర్థాం విజానీయాత్***
***హంస: సోహం శివ: శక్తిశ్చైవ ఆనంద నిర్మల: పంచమీంతాం విజానీయాత్***

చంద్రబింబము నుండి జాలు వారే అమృత రసమే మద్యము. అంతే కాని మాధవీలత నుండి తీసినది కాదు. కర్మాకర్మలను, పశువులను జ్ఞాన ఖడ్గం చేత ఛేదించటమే మాంసము. మనస్సే మత్స్యము. దాని వాసనాచయము నర్పించుటే మత్స్యము నర్పించుట. ఇంద్రియ నిగ్రహమే భక్ష్య భోజ్యములు. ఇదియే ముద్ర. హంసస్సోహం అను మంత్రార్ధములయిన శివశక్తులకలయికే మైధునము.

**అహింసా ప్రథమ పుష్పం పుష్పమింద్రియ నిగ్రహః ।**

**దయా క్షమా జ్ఞానపుష్పం పంచపుష్పం తతః పరం. ॥**

సాధకుడు అహింస, ఇంద్రియ నిగ్రహము, దయ, క్షమ, జ్ఞానములే పంచపుష్పాలు అని గ్రహించాలి. ఈ రకంగా మంత్రానికి అసలు అర్థాన్ని గ్రహించి శ్రీచక్రాన్ని అర్చించాలి.

శ్రీచక్రార్చన చాలా తంత్రాలలో చెప్పబడింది. ఏ రెండు తంత్రాలలోనూ ఈ అర్చన ఒకే విధంగా లేదు. ఎవరి పద్ధతి వారిది. వామకేశ్వర తంత్రం, యోగినీ హృదయం, యామళ గ్రంథాలు, కులార్ణవ తంత్రం. ఈ రకంగా అన్ని గ్రంథాలలోనూ చక్రార్చనా పద్ధతి వేరుగా ఉంటుంది. కాని నవావరణలలోని దేవతలు ఒకటి గానే ఉంటాయి. శ్రీచక్రానికి అధిదేవత పరమేశ్వరి. ఇందులో మాత్రమే ఏకీభావం ఉంది.

ఈ రకంగా ఉన్న భిన్న పద్ధతులకే సంప్రదాయము అనే పేరు పెట్టారు. ఎవరి పద్ధతి వారిది. ఎవరి సంప్రదాయం వారిది. అందరూ నిష్ణాతులే. ప్రతి తంత్రమూ కుడా శివుడు పార్వతికి చెప్పినట్లు గానో, పార్వతి శివుడికి చెప్పినట్లు గానో ఉంటుంది. కాబట్టి అన్ని తంత్రాలూ దైవప్రోక్తాలే. దేన్ని తప్పు పట్టటానికి లేదు. ఏదైనా ఒక సంప్రదాయంలోకి కాలుపెట్టే ముందే దాని మంచి చెడులను గురించి ఆలోచించాలి. అంతేకాని కాలుపెట్టిన తరువాత ఆ సంప్రదాయన్ని పాటించి తీరాలి.

వీరందరూ ఎవరి పద్ధతులు వారు పాటిస్తూ తమ ఆచారాలే గొప్పవని, తామే అధికుల మనీ ప్రచారం చేసుకోవటానికి ప్రయత్నం చేస్తారు. ఒక సంప్రదాయంలో ఉన్నవారు వేరొక సంప్రదాయంలోకి వెళ్లరాదని ఆంక్ష. ఒకరి ఆచార వ్యవహారాలు రెండవ వారికి తెలియనివ్వరు. ఇది కేవలం వారి అజ్ఞానానికి చిహ్నం. అంతేకాని వేరుకాదు. దేశంలో చక్రార్చనా పద్ధతి ఎక్కువగా వామాచారంలోనే ఉన్నది. బీహారు, బెంగాలు, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో శక్తి పూజ ఎక్కువ. అదంతా చాలా వరకు వామాచారమే. అయితే దక్షిణాదిన

కొంత మంది చక్రార్చనా పద్ధతిని పుస్తకాలుగా వ్రాశారు. ఇవన్నీ కూడా చాలా వరకు కౌళాచారానికి సంబంధించినవి.

పుట్టిన ప్రతి మనిషీ జ్ఞానికాలేడు. ఎన్నో జన్మలు అతడు పూర్తి చేసిన తరువాత కాని అతడికి భక్తి వాసన తగలదు. మొదట్లో ప్రతివాడూ ఐహికమైన సుఖాల కోసం వెంపర్లాడతాడు. ఆ సుఖాలు పూర్తిగా అనుభవించిన తరువాత మాత్రమే నిరాగి అవుతాడు. అదే అసలు క్రమము. అందుచేతనే భక్తుడు తన కోర్కెలు తీర్చుకోవటానికి భగవంతుణ్ణి అర్చిస్తాడు. అదే కౌళాచారము. దీనికే దక్షిణాచారమని పేరు పెట్టి మకార పంచకానికి అర్థాలు వేరుగా చెప్పి అర్చన చేస్తున్నారు. వీరి ప్రకారము

గుడార్ద్రక రసోదేవీ ముద్రతాప్రథమామతా
పిణాక్యం లవణం దేవి ద్వితీయా పరికీర్తితా
లశునంతిత్తిడీ చైవ తృతీయా పరికీర్తితా
సూర్యమండల సంకాశా చంద్రమండల సన్నిభా
గోధూమ మాషసంభూతా సుందరీచ చతుర్థికా
శక్త్యా లాపః పంచమీస్యా త్పంచముద్రా ప్రకీర్తితా ॥

అని "శక్తి సంగమ తంత్రం"లో చెప్పబడింది. దీని ప్రకారము

| | |
|---|---|
| బెల్లపు పానకము | - మద్యము |
| తెలకపిండి, లవణము, గారెలు | - మాంసము |
| వెల్లుల్లి, తిత్తిడి పదార్థములు | - మత్స్యము |
| గోధుమలు, మినుములచే చేయబడిన పదార్థములు | - ముద్ర |
| భక్ష్య భోజ్యములు కలయిక | - మైధునము. |

ప్రసుత్తం ఎక్కువగా వాడుకలో ఉన్న ఆచారము ఇదే.

**చక్రార్చనలో రకాలు :**

చక్రార్చన అంటే భూపురం దగ్గర మొదలు పెట్టి బిందువు దాకా గాని, బిందువు దగ్గర మొదలు పెట్టి భూపురం దాకా గాని తొమ్మిది ఆవరణలలోని దేవతలను అర్చించటము. ఈ అర్చన మూడు రకాలుగా ఉంటుంది.

